ప్రథమకూర్పు ౧౦౦౦ ప్రతులు

ముద్రణ :
భారతీ ప్రెస్, తెనాలి.

## గమనిక:

ఇది నా స్వతంత్ర రచన. దీనిలోని కథావస్తువును గాని, పాత్రలనుగాని, సన్నివేశాలనుగాని నా అనుమతి లేకండా బుఱ్ఱకథల్లోను, హరికథల్లోను, రేడియో నాటికల్లోను, నాటకాల్లోను, సినిమా చిత్రాల్లోను ఎవ్వరూ ఉపయోగించకూడదు. అల్లా ఉపయోగిస్తే కోర్టుద్వారా వారిమీద చర్య తీసుకోబడుతుంది.

— ఇంటూరి వెంకటేశ్వరరావు

# పరిచయము

ఈ గ్రంథమును రచించిన శ్రీ ఇంటూరి వేంకటేశ్వర రావుగారు ఆంధ్రలోకానికి సుపరిచితులు. రాజకీయ రంగంలోను, సాహిత్యరంగంలోను, సినిమా చిత్రనిర్మాణ రంగంలోను పనిచేసి పేరుపొందినవారు. వివిధరంగాలలో కృషి సాగించి వీరు సంపాదించుకొన్న అనుభవము, విజ్ఞానము, రచనాకౌశలము అన్నీ ఇప్పుడీ "కుమ్మరి మొల్ల" అనే రచనలో యథోచితంగా సంగమించి, వీరి సాహిత్య కళాభిజ్ఞతా ఘనతకు ప్రవర్థకము లైనవని నా అభిప్రాయము.

గ్రంథకర్త తెలియజేసినట్లు మొదట చలన చిత్రంకోసం ఉద్దిష్టమైన రచన ఇప్పుడీ నవల రూపాన్ని కావ్యరూపంలో ఒక నవీనపాకాన పరిణమించినది; ఒక నూతన రచనావిధానానికి లక్ష్యమైనది. ఈ గ్రంథము చదువుతూ ఉన్నప్పుడు ఆ యా సన్నివేశాల చిత్రాలు మన మనో యవనికపై చిత్రితము లవుతూ ఉంటవి.

కథావస్తువు చాలా చిన్నది. కాని, అనేక సన్నివేశాల తోను, అనేక దృశ్యాలతోను, అనేక మనస్తత్వాలతోను, అనేక సమస్యలతోను నిండియుండడంచేత చాలా పెద్దకథగా వ్యాప్తినొందినది. కుమ్మరి మొల్లను గురించి ఇదమిత్థం అని సప్రమాణంగా చెప్పగల కథ ఏమీ కనబడదు. ఉన్న కథ లన్నీ పుక్కిటి పురాణ గాథలే. ఇన్నికథలు పుట్టడంలోనే మొల్ల కథ ఏదో ఘనతకలదే కావలెనన్న అభిప్రాయం గ్రంథ కర్తకు తోచినది. ఉన్నకథలలో ఏది ఎక్కువ సమ్మతగినదో, ఆదర్శకమయినదో, ఆకర్షకమైనదో, చలనచిత్ర ప్రదర్శనానికి అనుకూలమైనదో ఎంచుకొని, లోకవ్యవహారానికి, సహజత్వా నికి, ఔచిత్యానికి వైరుధ్యం వాటిల్లకుండా ఉండేటట్లు చూచు

కొని, అనుకూలమైన సన్నివేశాలు సంఘటనలు కల్పించి, మొల్ల జీవితాన్ని ఆదర్శప్రాయంగా చిత్రించడంలో వెంకటేశ్వర రావుగారు తమ రచనా కౌశలం అద్భుతంగా ప్రదర్శించారు.

మొల్ల కుమ్మరిజాతి స్త్రీ. ఆమె తండ్రి ఆతుకూరి కేసన "గురులింగ జంగమార్చనపరుడు; శివభక్తిరతుడు; బాంధవ హితుడు." కవి; మంత్రోపాసకుడు. మొల్ల ప్రతిభా వంతురాలు. తనకు సహజంగా తోచినది చెప్పడంలో మొగమోటమి, భయమూ లేని గడుసరాలు. ఈ సద్గుణముల వలన వారికి మేలుకలుగుటకు మారుగా ముప్పు కలిగినది. అధికార బలగర్వితుల అసూయాగ్రహములకు, అత్యాచారములకు వారి జీవితము గురియై ఎట్లు దుఃఖభాజనము కావలసివచ్చెనో, గ్రంథకర్త నిరూపించినారు.

ఈ రచనలో ఆ కాలమందలి ఆర్థిక సాంఘిక రాజకీయ సమస్యలు, మతవిద్వేషములు, ఆధ్యాత్మిక చర్చలు, తత్త్వజిజ్ఞాస, సాహిత్యధర్మములు – ఇవీ అవీ అని వివరించి పేర్కొనడమెందుకు – మానవుడు వ్యక్తిగతంగాను, సమిష్టి గతంగాను ఎదుర్కొనవలసిన చిక్కులన్నీ తర్కించడమో, చర్చించడమో, విమర్శించడమో, సమర్థించడమో జరిగింది.

ఈ గ్రంథం అందరున్ను చదవదగినదనిన్ని, చదివినవారి హృదయములను పల్లవింపజేయగల ఘట్టములు గలదనిన్ని నా నమ్మకము. దీనిని రచించిన వేంకటేశ్వరరావుగారు ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులయినారని చెప్పవలెను. వీరికిని, రచనలో వీరికి తోడ్పడిన వీరి సతీమణియైన శ్రీమతి వేంకటమైత్రేయి గారికిని నా ధన్యవాదములు.

– గిడుగు వేంకటసీతాపతి

## నా మాట —

పెద్దలు వ్రాసిన కవుల, కవయిత్రుల జీవితచరిత్రల్ని తిరగేస్తే మొల్ల జీవితానికి సంబంధించిన విశేషాలు అంతగా నా కెక్కడా అగపడలేదు. కాని యీవిడను గురించిన పుక్కిటి పురాణాలు, గాథలు అనేకా అనేకా మనకు వినపడతాయి.

మొల్ల బ్రాహ్మణ బాలికని- చిన్నప్పటినుంచి ఆమె కేసనచేత పెంచబడ్డదని- బ్రాహ్మణపుటక పుట్టడంచేతనే ఆమెకు కవిత్వం అబ్బిందని అన్నారు కొందరు. కొందరు, ఆమె కుమ్మరిదేనని - చిన్నప్పుడే వితంతువయిందని - అందువల్లనే వైరాగ్యజీవితం గడిపి మోక్షసాధనకు రామాయణం వ్రాసిందని అన్నారు. ఆమె రాయల ఉంపుడుకత్తె అని - పచ్చిభోగంకులంలో పుట్టిందని - అన్నారు మరి కొందరు. రామాయణం వ్రాశాక ఆవిడను అగ్రజాతివాళ్లు- ముఖ్యంగా బ్రాహ్మణులు- చిత్రవధచేశారని కొంద రన్నారు. ఇల్లాంటి పుక్కిటిపురాణాలకు, పరస్పర విరుద్ధాభిప్రాయాలకు గురియయిన మొల్ల జీవితంలో ఏదో ప్రత్యేకత ఉందని మనకు సునాయాసంగా బోధపడకపోదు.

బసవేశ్వరోద్యమంయొక్క ప్రభావం పదహారవ శతాబ్దంలో ఉజ్వలంగా ఉందని మనకు చరిత్ర చెబుతుంది. సాంఘిక, ఆర్థిక, నైతిక విప్లవమే బసవేశ్వరోద్యమంయొక్క పరమావధి. ప్రచండమారుతంతో పోల్చదగ్గ బసవేశ్వరోద్యమాన్ని ప్రతిఘటించడానికి ఆనాటి వైష్ణవుల్లో సంకుచితవాదులు కొందరు విశ్వప్రయత్నాలు చేశారు. మొల్లతండ్రి కేసన శివభక్తిపరుడు. ఆయన మహాపండితుడు. ఆయన ఒక శతకాన్ని వ్రాశాడని - దానిని వైష్ణవులు తగలబెట్టి, నామరూపాలు లేకుండా చేశారని ఒకగాథ వ్యాప్తిలో ఉంది. కేసన శతకం అందుచేతనే యిప్పటివారికి అగపడకుండా పోయింది. వైష్ణవుల, శైవుల మధ్య మతకలహాలేగాక ఆర్థికసంబంధమైన వర్గకలహాలుకూడా ఆరోజుల్లో ఉండేవని చరిత్రచూస్తే మనకుబోధపడుతుంది. భోగవరులైన వైష్ణవులు ధనికవర్గానికి చెందినవాళ్లని - బాధిత ప్రజలునూ; శైవులు దరిద్రవర్గానికి సంబంధించినవాళ్లని ఆ రోజుల్లో ఒక ప్రతీతి ఉండేది.

కేసనకు, మొల్లకు ముందుగాని, వెనకగాని కుమ్మరికులంలో కవిత్వం వ్రాసినవాళ్లు మనకు ఎవ్వరూ కానరారు. ఈ అభిరుచి వాళ్లతోనే పుట్టింది: వాళ్లతోనే పోయింది. ఆ రోజుల్లో కవిత్వం అగ్రజాతులవాళ్ల - ముఖ్యంగా బ్రాహ్మణుల-సొత్తు. కవితాప్రపంచంలో ప్రవేశించిన తక్కువ కులాలవాళ్ళమీద ఎక్కువ కులాలవాళ్లు ఆ రోజుల్లో కత్తి ఝళిపించడంలో సత్యం లేకపోలేదు. కుమ్మరికులంలో పుట్టింది - అందులో ఆడది- కవితా ప్రపంచంలో ప్రవేశిస్తే ఆ రోజుల్లో ఎంత అలజడి కలిగుంటుందో - ఆమె ఎంత సంక్షోభానికి గురయిఉంటుందో మనం ఊహించుకోవచ్చు.

ఏ కోణంలోనుంచి చూచినా ప్రథమ ఆంధ్ర కవయిత్రియైన కుమ్మరి మొల్ల ఒక గొప్ప విప్లవకారిణి అని మనకు సులభంగా బోధపడుతుంది. చరిత్రాత్మకమయిన విప్లవానికి అంకురార్పణచేసిన ఆమెయొక్క జీవితచరిత్ర యింతవరకూ మరుగుపడటంలో వింత ఏమీ లేదు.

భుక్తికి సంబంధించిన ఉద్యమంతో ప్రారంభించి, ముక్తికి సంబంధించిన ఉద్యమంతో మొల్ల జీవితం ముగిసిందని నా విశ్వాసం. గోపవరం నెల్లూరు మండలంలోని దని - అది అగ్రహారమని - రాయలవద్ద ప్రాముఖ్యతవహించిన వైష్ణవ గురువు తాతాచారి ఆ అగ్రహారాన్ని ఒక ఆచారికి యిప్పించాడని - అహంకారంతో ఆ ఆచారి ఆ అగ్రహారంలో నిరంకుశంగా ప్రవర్తించాడని - శైవులయిన కేసనను, మొల్లను ఆయన పెట్టిన బాధ యింతా అంతా గాదని కొందరి నోట విన్నాను. ఈ గాథను ప్రాతిపదికగా తీసుకొని - ఆ రోజుల్లో సంఘర్షణకు తలపడ్డ వివిధశక్తుల స్వరూపాలను కళ్లఎదుట చిత్రించుకొని - యీ రచనను సాగించాను.

అసలీ కథను సినిమాకని ముందుగా వ్రాశాను. ఇల్లా వ్రాయడానికి నాకు ప్రోత్సాహమిచ్చి - నా పట్ల అపరాభిమానాలు చూపెట్టిన వాళ్లు నా ప్రియ మిత్రులు, విఖ్యాత నటులు శ్రీ చిత్తూరు వి. నాగయ్య, సి. ఎస్. ఆర్. ఆంజనేయులు, సుప్రసిద్ధ సినిమానటి శ్రీమతి కృష్ణవేణి. కారణాంతరాల చేత యీకథ తెరకుఎక్క లేకపోయింది. అప్పట్లో నేను వ్రాసిన సినిమా 'స్క్రిప్టు'ను ఊరికే పోనియ్యడ మెందుకని - దానిని యీ రచన రూపంలో తీసుకొచ్చాను. మిత్రుడు శ్రీ కాజ రాధాకృష్ణశాస్త్రి యిందులోని గీతాలను వ్రాశారు.

నా 'స్క్రిప్టు' ననుసరించి మిత్రుడు శ్రీ సుంకర సత్యనారాయణ బుఱ్ఱకథ వ్రాశారు. ఈ బుఱ్ఱకథ తెలుగుదేశంలోని ఎన్నోదళాలచేత చెప్పబడడమే కాకుండా - ఆల్ ఇండియా రేడియోలో కూడా అనేకసార్లు ప్రసారం చేయబడ్డది. ఈ బుఱ్ఱకథ పండితుల, పామరుల ప్రశంసల్ని అందుకుంది. పైన పేర్కొన్నవారేకాకుండా ఫిల్ముడైరెక్టరు శ్రీ కె.బి. నాగభూషణం, చిత్రకారుడు శ్రీ కె. నాగేశ్వరరావు, మిత్రుడు శ్రీ కడారు వెంకటేశ్వరరావు, తెనాలి భారతీ ముద్రణాలయాధికారులు యీ రచనను బయటకి తీసుకురావడంలో ఎంతో తోడ్పడ్డారు. వీరందరికి నా కృతజ్ఞత.

ఈ రచన వెనక నా చేయేకాకుండా మరోచేయికూడా వుంది. ఆ చేయి మరెవరిదోకాదు - నా అర్ధాంగి వెంకటమైత్రేయిది. ఈ రచనకు గౌరవమేదన్నా లభ్యమయితే - దాంట్లో ఆవిడకుకూడా సగపాలుంది.

దీనికి 'పరిచయం' వ్రాసిన పెద్దలు డాక్టరు గిడుగు వెంకట సీతాపతిగారికి నా కృతజ్ఞతాపూర్వక వందనా లర్పిస్తున్నా.

— ఇంటూరి వెంకటేశ్వరరావు

# 1

గోపవర అగ్రహారానికి నడిబొడ్డునున్న తిప్పమీాది కెక్కి – వేకువజామును సూచిస్తూ – కోడి 'కొక్కొరొకో' అని కూసింది. నిద్రావస్థలో ఉన్న ఆబాలగోపాలం ఆ కూతకు మేల్కొంది. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రు లందరూ నిత్యజీవితానికి సంబంధించిన తమతమ పనుల్లో నిమగ్ను లయ్యారు. మాలగూడెంలోని శ్రమజీవులుకూడా పొట్ట తిప్పలకోసం తమతమ పనిముట్లను తీసుకొని బయలు దేరారు.

క్రమక్రమంగా చీకటి వెలుతురుకు చోటిచ్చింది. తన లేత కిరణాలను ప్రసరిస్తూ సూర్యుడు తూర్పుదిక్కున ఉద యించాడు. ఆ కిరణాల వెలుతురులో గ్రామంలోని శ్రీరామ దేవాలయగోపురం వినూత్నశోభను వెదజల్లింది. ఆ గోపురం వల్లనే ఆ ఊరికి 'గోపురం' అన్న పేరొచ్చింది. గోపురాన్ని ఎవరో పెద్దలు గోపవరం చేశారు. ఆ దేవాలయంమీాది రక రకాల బొమ్మలు–సూర్యరశ్మిలో– ప్రాచీన శిల్పకళావైభవాన్ని వేనోళ్ల చాటాయి. దేవాలయప్రాంగణంలోని ధ్వజస్తంభం యొక్క గంటలు గాలికి గణగణ మ్రోగుతూ ప్రణవనాదాన్ని ఉప్పతిల్లజేశాయి.

సునిశితమైన సూర్యకిరణాలు దేవాలయాంతర్భాగం లోకి కూడా చొచ్చుకుపోయాయి. గర్భగుడిలో అఖండజ్యోతి వెలుగుతూంది. సీతా రామ లక్ష్మణుల విగ్రహాల ముందు

అర్చకు లిద్దరు– యంత్రసదృశంగా – మంత్రాలతో అర్చన గావిస్తున్నారు.

అన్ని అవతారాలలోకి శ్రీరామావతారం ఉత్కృష్ట మైనది. మానవ జన్మెత్తి – ఆదర్శప్రాయమైన జీవితం గడిపి – శ్రీరాముడు చరితార్థుడయ్యాడు. ఆ అర్చకు లిద్దరూ ఉచ్చ రిస్తున్న మంత్రాలు పురుషోత్తముడైన శ్రీరాముని మహిమా విశేషాలను అమోఘంగా వర్ణిస్తున్నాయి. లయబద్ధమైన ఆ అర్చకుల సూక్తులు శ్రీరామచంద్రునికి మంగళగీతాలను ఆలాపిస్తున్నాయి.

అర్చన పూర్తయింది. విగ్రహాలకు అర్చకు లిద్దరూ యథావిధిగా కర్పూరహారతి నిచ్చారు. హారతి వెలుగులో ఆ విగ్రహాల రూపురేఖలు అతిస్పష్టంగా అగపడుతున్నాయి. ఆరోజు శ్రీరామనవమి అయినా ఆ విగ్రహాలకు ప్రత్యే కాలంకారాలేమీ జరిగినట్లు అగపడదు. ఎందుకో ఆ విగ్ర హాల రూపులేఖల్లో జీవకళ ఉట్టిపడడంలేదు. మానవులందరూ మాటల్లో తమ్ము స్తుతిస్తున్నారేగాని క్రియారూపకంగా తమ అడుగుజాడల్లో నడవడంలేదన్న విచారం ఆ మూర్తుల ముఖాలలో ద్యోతకమవుతూంది.

ఇంతలోనే బయటనుంచి మేళతాళాలు వినపడ్డాయి. అర్చకుల అంతర్దృష్టి – తమ సమక్షంలోనున్న భగవానుని మీదినుంచి – అమాంతం మానవమాత్రులమీదికి పరు గెత్తుకుపోయింది. తమ ముందరున్నవి చైతన్యరహితమైన రాతి విగ్రహాలనే భావన యిప్పుడా అర్చకుల చేతల్లో అను

క్షణం అగపడుతూంది. పూర్ణకలశాన్ని, పూలదండల్ని తీసు కొని ఆ అర్చకులు - రాతివిగ్రహాల నక్కడ వదిలేసి - ఊడి పోతున్న గోచీలను బిగించుకుంటూ - తమ భక్తికి కారణ భూతులయిన మానవవిగ్రహాలకోసం - దేవాలయద్వారం దగ్గిరకు గబగబ వెళ్లిపోయారు.

బ్రహ్మాండమైన ఉత్సవం దేవాలయం వద్దకు సాగి వస్తూంది. ముందు తప్పెట్లు వాయిస్తూ వీరాంగం వేస్తున్న మాలమాదిగలు, వారివెనక సన్నాయి మేళగాళ్లు, వారి కిరుపక్కల బాకా లూదేవాళ్లు, ఆ వెనక గోపవర పంచా యతీ పెద్దలు, వారి బంధుమిత్రులు, స్వస్తివాచకాలను వల్లిస్తున్న బ్రాహ్మణోత్తములు ఆ ఉత్సవంలో అగపడు తున్నారు. వీరందరికీ వెనక ఒక ఏనుగు మందగతితో ముందుకు అడుగు వేస్తూంది. వైష్ణవసాంప్రదాయసిద్ధంగా ఆ ఏనుగు ముఖాన పెద్దపెద్ద పంగనామాలు పెట్టబడున్నాయి. పైన అంబారీలో ఒక ఆజానుబాహుడయిన వ్యక్తి కూర్చోనున్నాడు. ముఖంమీాది పట్టెవర్ధనాలు ఆయనొక వైష్ణవుడని తెలుపు తున్నాయి. శరీరంమీాద కప్పుకున్న కాశ్మీరశాలువ, చెవులకు వేలాడుతున్న కుండలాలు ఆయన ఒక పండితోత్తముడని విశదీకరిస్తున్నాయి. ఆయనముందు ఒక బంగారు పళ్లెరంలో పెట్టబడున్న తాళపత్రగ్రంథం ఆయనొక కవిపుంగవుడని నిరూపిస్తూంది. దర్పం, ఠీవి, రాజసం ఆయనలో మూర్తీ భవించున్నాయి. ఆయన రామాచారి. విజయనగర రాజులచే సర్వహక్కులతో ప్రసాదింపబడ్డ గోపవరానికి అధిపతి ఆయన.

నిజంగా చూస్తే గోపవర అగ్రహారానికి రామాచారి కిరీటంలేని మహారాజు. బ్రాహ్మణుల్లోనుంచి అవధానిని, క్షత్రియుల్లోనుంచి శరభరాజును, వైశ్యుల్లోనుంచి బొజ్జయ్య చెట్టిని, శూద్రుల్లోనుంచి సుబ్బారెడ్డిని గ్రామపంచాయతీకి ఆయనే స్వయంగా ఎన్నుకున్నాడు. ఆ నలుగురు ఆయనకు పక్కతాళగాళ్లు.

ఒకవిధంగా చూస్తే అవధాని ఆచారికి మెదడు, కర వాలం, హృదయం. ఆయన పక్కన లేందే ఆచారికి ఒక్క క్షణం తోచదు. ఆరోజునే రామాచారి 'శృంగార లీలా తరంగిణి' అన్న గ్రంథాన్ని వ్రాయడం ముగించడంచేత - అవధాని ఆయనకు - గ్రామ ప్రజలపక్షాన - సన్మాన పూర్వకంగా యీ ఉత్సవాన్ని ఏర్పాటు చేశాడన్నమాట.

దేవాలయ ద్వారందగ్గరకొచ్చి ఏనుగ మోకరించింది. అవధాని చెయ్యి అందిస్తూంటే - రామాచారి ఏనుగుమీది నుంచి కిందికి మెల్లగా దిగాడు. తాళపత్ర గ్రంథమున్న బంగారు పళ్లెరాన్ని బట్టుకొని అవధాని ఆచారికి లోపలికి తోవచూపాడు. అర్చకులు పూర్ణకుంభంతో - మంగళ నిస్వనాలతో - ఆచారికి అపూర్వ స్వాగతమిచ్చి - పూలదండల్ని ఆయన మెడలో వేశారు.

ఉత్సవంతో వచ్చిన మేళతాళగాళ్లు, తక్కిన పురుషులు, స్త్రీలు - అందరూ ఆచారితో దేవాలయంలోకి వచ్చేశారు. ఎంతో ఉత్సాహంతో తమయింట్లో పెళ్లిలాగా తప్పెట్లు వాయించుకుంటూ, వీరాంగం వేసుకుంటూ, ఉత్సవం...

దొచ్చిన నూంలమాదిగలు బయటనే ఉండిపోయారు. నిస్సహాయత, దైన్యం వాళ్ళ ముఖాలలో తొంగిచూశాయి. మానవ జన్మెత్తి గూడా – సర్వసముడైన భగవంతుని దర్శనానికి తాము నోచుకోలేకపోయినందుకు వాళ్లు చింతాక్రాంతు లయ్యారు.

లోపల కల్యాణమండపంలో వేదికమీద ఆసీనుడయిన రామాచారిని గురించి అవధాని సభాసదులకు చెప్పాడు. ఆచారి మహాపండితుడు, విఖ్యాత కవి అని – ఆయన గోపవర అగ్రహారంలోని ప్రజలకు చేసినసేవ యింతా అంతా గాదని – ఆయన రచించిన 'శృంగార లీలాతరంగిణి' అద్భుతమైన మహాకావ్య మని – త్వరలోనే ఆ కావ్యాన్ని ఆచారి కృష్ణదేవ రాయలకు కృతియిచ్చి గొప్ప బహుమానాలు అందుకోబోతున్నాడని – అల్లాంటి మహామహుని సత్కరించడం గోపవర ప్రజల విధ్యుక్తధర్మమని – ఆచారి నూరేళ్లు బతికి గోపవర అగ్రహారంయొక్క యశశ్చంద్రికల్ని దిశలంతా పాకించేందుకు తాను శ్రీరామచంద్రమూర్తిని అహర్నిశలు ప్రార్థిస్తున్నానని – అవధాని తన సహజవాగ్ధోరణిలో ప్రసంగించాడు.

శరభరాజు, బొల్లయ్యశెట్టి, సుబ్బారెడ్డి అవధాని నోటినుంచి వెలువడ్డ ప్రతిమాటకు ఉట్లల్లో చెంబులల్లే తలకాయలు దిట్టంగా ఊపారు. సమయోచితంగా తక్కినవాళ్లు చప్పట్లు చరిచారు.

దేవాలయంలోకి అడుగెడుతున్న వాళ్లంతా – దేవుడి మాటే మరచిపోయి – ఆచారికి భక్తిపూర్వకంగా నమస్కా

రాలు చేస్తూ - సభలో కూర్చుండి పోయారు. తన ప్రతిభను అందరూ గుర్తించడం ఆచారిని సంతోషస్వాంతుణ్ణి చేసింది.

అవధాని తన దీర్ఘోపన్యాసాన్ని ముగించి - బొజ్జయ్య చెట్టిచేత బహూకరింపబడ్డ దుశ్శాలువను, పట్టుపీతాంబరాలను, మరి యితర కానుకలను - గోపవర గ్రామప్రజలపేర - ఆచారికి సమర్పించాడు. సభాసదులందరూ అవధాని ననుస రించి ఆచారికి జయజయధ్వానాలు సలిపారు.

భరతశాస్త్రంలో, కవిత్వంలో తెనాలి రామలింగకవి దగ్గిర కొంతకాలం కృషిచేసి - కొద్దిరోజుల క్రిందటనే ఆ దేవాలయంలో దేవదాసిగా నియమింపబడ్డ రంగనాయకిని నాట్యం ప్రారంభించమని అవధాని ఆదరంగా పురమా యించాడు.

రంగనాయకి అక్షరాలా దేవదాసి. ఆవిడ మానవ దాసిగాదు. యావనంలో నవనవలాడుతున్న ఆ వనిత తన శరీరాన్ని భగవానుని సేవకు అంకితంచేసిన చరితార్థజీవి.

అవధాని ఆజ్ఞప్రకారం రంగనాయకి కాలికి గజ్జె కట్టు కుంది. గర్భగుడివైపు తిరిగి రామచంద్రమూర్తికి ఆమె భక్తి పురస్సరంగా ప్రణమిల్లింది. ఆచారివైపుకు తిరిగి నమస్కారం పెట్టి - సభాసదులకు వినయపూర్వకంగా తలొగ్గి - జ్యోతిని చేత్తో బుచ్చుకొని ఆమె నాట్యం చేయడం సాగించింది.

నీలోని దీపమ్ము వెలిగించుకో !
నీ బయట వెన్నెలలు పండించుకో !

నీలోని......

నీలోని వెలుగుతో, వెలుగులో నీవుండి
లోకాలచీకట్లు పోకార్చు తలపుతో
నీలోని......

శాంతిసౌఖ్యాలతో, స్వర్గసౌరభముతో
జతకూడి మన ప్రజలు బ్రతుకు మార్గముచూప
నీలోని......

వలదహంకృతి; యీను వలదోయి, వదలుకో!
చెలిమిపెంచెడి ప్రేమపథమెంచి మసలుకో!
నీలోని......

స్వ పర భేదము గనక, సమతకై పాటుబడి
సర్వజీవుల నుండు స్వామి నూహింపగా
నీలోని......

— యీ గీతాన్ని ఆలాపిస్తూ ఆమె నృత్యంచేస్తూంటే సభలోని భక్తులందరూ పారవశ్యం చెందారు. తక్కువ అంతస్థుకు చెందిన జనమంతా ఆమె హావ భావాలను పరికించి కామోద్రేకతను చూపెట్టారు. ఆమె మోహనమూర్తి శృంగారపురుషుడైన ఆచారిమీద సమ్మోహనాస్త్రాన్ని బలపింది.

రసానుభూతిని స్పందింప జేస్తున్న రంగనాయకి నృత్యం లోపల జరుగుతుంటే – బయట మాలమాదిగలు కేవలం ఆ ధ్వనినే వింటూ సంతుష్టిచెందారు. దేవాలయంవైపుకు వస్తున్న ఒక వ్యక్తిమీదికి యిప్పుడు వాళ్ల దృష్టిపోయింది. ఆ వ్యక్తి బక్కచిక్కున్నాడు. నొసట విభూతిరేఖలు, మెడలో రుద్రాక్ష

మాలికలు ఉన్నాయి. తలమీద నాలుగుపరకల పిలక నాట్య మాడుతూంది. కటికొక అంగవస్త్రం, పైనొక అంగవస్త్రం ఆయన్ను దరిద్రనారాయణునికి ప్రతినిధిగా రూపొందిస్తున్నాయి. ఆయనచేతిలో ఒక చిన్న పళ్లెముంది. ఆ పళ్లెంలో తాటాకుల గ్రంథం, పళ్లు, పూలూ ఉన్నాయి. ఆయన ఆకారం ఆయన పరిపక్వదశనందిన ఒక మహాభక్తుడని నిరూపిస్తూంది.

దేవాలయ ద్వారందగ్గిరకొచ్చి – మాలమాదిగల్ని ఒకసారి చూచి – ఆయన ఒక నిట్టూర్పు విడిచాడు. కొందరు మానవులు భగవానుని దర్శనానికి నోచుకోనందుకు ఆయన విచారించాడు. ఆయన కళ్లనుండి రెండు నీటిబొట్లు జలజల రాలాయి. మాలమాదిగలు ఆయనకు చేతులెత్తి దండం పెట్టారు. నిండు హృదయంతో ఆయన వాళ్ల నమస్కారాల నందుకొని – ప్రతినమస్కారం సలిపాడు. ఆయన కేసన. కుమ్మరివాడు. గురులింగజంగమార్చనపరుడు. పరమనిష్ఠాగరిష్ఠి. సత్వగుణ భూయిష్ఠుడు. తక్కువ కులంలో పుట్టిన వాడయినా ఆయనలో బ్రహ్మతేజస్సు ఉట్టిపడుతూంది.

దేవాలయం లోపలికి అడుగెట్టాడు కేసన. ఆయన దృష్టి అంతా గర్భగుడివైపే ఉంది. అక్కడ జరుగుతున్న రంగనాయకి నృత్యం ఆయన బాహ్య, అంతర్దృష్టులను ఆకర్షించలేకపోయింది. అందరిమోస్తరుగా ఆయన వేదికపై నున్న ఆచారికి వంగి నమస్కారం చేయకుండా గర్భగుడిలో నున్న విగ్రహంవైపే తన ప్రశాంతదృక్కుల్ని పారించాడు.

ఆచారికి కేసన చేయెత్తి నమస్కరించకుండా గర్భగుడి వైపు పోవడం ముందుగా కనిపెట్టినవాడు అవధాని. ఆయన ఆచారివైపు చూశాడు. కేసన ప్రవర్తనను తనూ కనిపెట్టక పోలేదని ఆచారి అవధానిని చూచి తల పంకించాడు. పరాభవానలం యిప్పుడే ఆచారి హృదయకుహరంలో పుట్టుకొస్తున్నట్లు ఆయన ముఖం సాక్ష్యమిచ్చింది.

పళ్లాన్నక్కడబెట్టి కేసన శ్రీరామచంద్రమూర్తికి సాష్టాంగదండప్రణామం చేశాడు. తిరిగి లేచినిలబడి ఆయన విగ్రహంమీద తనదృష్టిని కేంద్రీకరించాడు. కళ్లుమూసుకొని ఆయన తన్మయత్వాన్ని చెందాడు. క్రమక్రమంగా ఆయన యోగసమాధిలో ప్రవేశించాడు.

అంతకుముందు దేవునిదగ్గిరున్న అర్చకులు – కొత్తగా దేవదాసిగా నియమింపబడ్డ రంగనాయకి నృత్యం దగ్గిరనుంచి చూడాలనే కుతూహలంతో – గర్భగుడినుంచి బయటికొచ్చి–సభికుల్లో చేరిపోయారు.

దేవాలయం లోపలికి వస్తున్న జనం వస్తునేఉంది. వచ్చినవాళ్లంతా ఆచారికి నమస్కారంచేసి అక్కడే చతికిలబడిపోయారు. కాని ఆచారి, అవధానుల చూపులు వాళ్లమీదగాని, యింకెవరిమీదగాని లేవు. తమను అవమానపరిచిన కుమ్మరికేసనమీదనే వాళ్లచూపులు కేంద్రీకృతమయ్యాయి.

భక్తిప్రబోధకమైన రంగనాయకి నృత్యం యింకా జరుగుతూనే ఉంది.

బయటి మాలమాదిగలు బయటనుంచే ఆమె పాట విని ఆనందపరవశు లవుతున్నారు. దేవాలయం వైపుకు పదహారేళ్ళ పిల్ల ఒకతే వస్తూంది. ఇప్పుడు వాళ్ళ చూపులు ఆమెమీద పడ్డాయి. అంద వికారంగా ఉంది ఆ పిల్ల. చింపిరిజుట్టు, చినిగిన చీర ఆమె స్వరూపాన్ని మరింతవికృతం చేశాయి. మోటుతనం ఆమెలో హెచ్చుగా కనిపిస్తూంది. స్త్రీత్వం ఆమెలో కలికానికైనా అగపడడం లేదు. అంతా మగరాయుడులాగా ఉంది ఆ పిల్ల. క్రమశిక్షణకు అలవాటుపడ్డ జీవితంకాదని ఆ పిల్ల ఆకారవ్యవహారచేష్టలు చెబుతున్నాయి. కాని ఆమె ముఖంలో ఒక విధమైన తీక్ష్ణత దోబూచులాడుతూంది. నిశితంగా చూచేవాళ్ళకు ఆమె ఒక శక్తిస్వరూపిణిలాగా అగుపిస్తూంది. ఆమె మొల్ల. కేసన కూతురు. తల్లిలేని పిల్ల.

ఒక్కసారి ఆమె మాలమాదిగల్ని పరకాయించి చూచింది. నైరాశ్యదృష్టితో వాళ్లూ ఆమెను చూచారు. దేవాలయం లోపలినుంచి రంగనాయకిపాట ఆమెకు వినపడ్డది. వెంటనే ఆమె గుడిలోకి అడుగెట్టింది. ఆమె వాలకాన్నిబట్టి 'గుళ్లో యీ పిల్ల ఏదో గలభాచేయకుండా ఊరుకోదు' అనుకున్నారు మాలమాదిగలు – సంజ్ఞాపూర్వకంగా.

లోపలి కడుగెట్టిన మొల్ల కల్యాణమండపం వైపు చూచింది. గ్రామపెద్దలందరూ– ఆ మండపంలో సుఖాసీనులై ఉన్నారు. దుశ్శాలువ కప్పుకొన్న ఆచారి ప్రత్యేకంగా ఆమె దృష్టినిబడ్డాడు. వాళ్ళముఖాలన్నీ కలకల లాడుతున్నాయి. ఇప్పుడామె తన చూపును గర్భగుడిలోని మూర్తులవైపుకు

తిప్పింది. విగ్రహాలకు ఏ విధమైన అలంకారాలు లేవు. మానవమాత్రులందరూ అలంకారభూషితులై ఉండడం, అసలు దేవుళ్ళకు ఎట్లాంటి అలంకారాలు లేకపోవడం ఆమె పరీక్షపెట్టి చూచింది.

గర్భగుడి దగ్గరగా యోగసమాధిలో ఉన్న తనతండ్రి ఆమెకు అగపడ్డాడు. ఒకచెంప రంగనాయకి జ్యోతినృత్యం రసోద్రేకంతో జరుగుతూంటే - గర్భగుడిలోని దేవుని సమక్షంలోనున్న అఖండజ్యోతి - ఎగసనదోసేవాళ్ళు ఎవ్వరూ అక్కడ లేకపోవడం మూలాన - కొడిగట్టి ఆరిపోవడానికి సిద్ధమవుతూంది.

అంతకుముందు కేసనమీద కేంద్రీకరించిన తమ చూపుల్ని ఆచారి, అవధాని యిప్పుడు దుడుకుపిల్ల మొల్ల మీదికి మరల్చారు.

గర్భగుడిలోని అఖండజ్యోతి ఆరిపోవడం చూచింది మొల్ల. గబగబ గర్భగుడిలోకి ప్రవేశించి - దగ్గరగా ఉన్న చెకుముకిరాళ్లను, దూదిని సంధించి - ఆమె అఖండ జ్యోతిని తిరిగి వెలిగించింది. ఆమె అల్లాచేస్తూంటే ఆచారి, అవధాని యిక చూడలేకపోయారు. 'ఆగు' అంటూ ఆచారి సింహగర్జనచేస్తూ పీఠంమీదనుంచి లేచాడు. ఆ పొలికేకతో అదిరిపడి - నృత్యంచేస్తున్న రంగనాయకి - రాతి విగ్రహంలాగ - అలా ఉండిపోయింది. సభాసదులంతా విస్మయులయ్యారు. ఆచారి, అవధాని చూస్తున్నవైపుకు యిప్పుడు వాళ్లంతా చూచారు. అఖండజ్యోతిని వెలిగించి మొల్ల గర్భగుడిలో

నుంచి బయటికొస్తూంది. కల్యాణమండపం దిగి ఆచారి, అవధాని గర్భగుడివైపుకు నడిచారు. భయ, సంభ్రమాలకు లోనయిన అక్కడివాళ్లంతా లేచి వారిద్దరిని అనుసరించారు.

ఆగ్రహావేశుడయిన ఆచారి పొలికేక బయటనున్న మాలమాదిగలకుకూడా వినిపించకపోలేదు. మొత్తానికి లోపల మొల్ల ఏదో గలభా చేసుంటుందని వాళ్లు ఊహించారు.

యుద్ధభూమిలోని సైనికవిన్యాసాలను స్ఫురణకు తెస్తూ దేవాలయంలోపలి జనమంతా గర్భగుడిముందు రెండు పక్షాలుగా నిలబడిపోయింది. ఆచారిబృందమంతా ఒకవైపు చేరింది. మరోవైపు ధ్యానముద్రలో ఉన్న కేసన అగపడ్డాడు. ఆయన దగ్గరగా బుసకొడుతున్న త్రాచుపాము లాగా మొల్ల నిల్చోనుంది. ఆమెకు కొంచెందూరంలో రంగనాయకి, సీతమ్మలు ఉండిపోయారు. ఆచారి బృందమంతా కేసనమీదికి లంఘించబోతున్నట్లు అగపడుతూంది. అవధాని, శరభరాజు, బొజ్జయ్యచెట్టి, సుబ్బారెడ్డితోపాటు కనకయ్య కూడా నిప్పులుగక్కుతూ ముందుకొచ్చి నిల్చున్నాడు. కనకయ్య కేసనబావమరిది. అతనొక పచ్చిరౌడీ. కండలు పెంచుకున్న వస్తాదుకూడాను. కులవృత్తిమానేసి గోపవరంలో ఉన్న వ్యవసాయ కూలీలమీద – ఆచారిప్రాపకంతో – కఱ్ఱ పెత్తనం చెలాయించడమే అతని నిత్యజీవితం. తిక్కన కనకయ్యకొడుకు. వాడొక తిక్కమనిషి. మొల్లంటే వాడికి ఎంతో ఇష్టం. తండ్రితోపాటు తిక్కనకూడా ముందుకొచ్చి నిల్చున్నాడు – అవసరమొస్తే మొల్లకు అండగా నిలవడానికి.

"ఏరా కేసనా! ఇంకా నీ సమాధి కాలేదా?" అంటూ హుంకారనాదం సలిపాడు ఆచారి.

కేసన కళ్లు తెరిచి చూచాడు. ఆచారిబృందమంతా తనమీద కత్తి ఝుళిపిస్తున్నట్లు ఆయనకు అగపడ్డది. పక్కకు తిరిగి చూచాడు కేసన. రోషావేశంతోనున్న మొల్ల ఆయనకు అగపడ్డది. ముద్దుకుపిండమైన కూతురి మన స్తత్వం తండ్రికి చిన్నప్పటినుంచీ తెలుసు. మొత్తానికి ఆమె ఏదో హడావిడి చేసుంటుందని కేసన గ్రహించాడు. విజయోత్సాహంతో మొల్ల తండ్రివైపు చూచింది.

కేసనను చుఱచుఱ చూస్తూ అవధాని ముందుకొచ్చాడు. "ఏంరా కేసనా!... ఏం తెలియనివాడికిమల్లే అటూయిటూ చూస్తావేం? నీ కళ్లముందరే నీ కూతురుముండ ఏంచేసిందో నీకు అగపడడంలా? కళ్లేమైనా చీకట్లు కమ్మాయా?... అటుచూడు! ఆచారిగారు ఆగ్రహపరవశులయ్యారు. పవిత్ర మైన శ్రీరామచంద్రవిగ్రహం మైలపడ్డది. దేవాలయమంతా అపవిత్రమై పోయింది. ఏం చెప్తావు దీనికి?" అన్నాడు అవధాని – పళ్లు పటపటకొరుకుతూ.

అవధాని ధోరణి కేసనకు ఏమీ అంతుబట్టలేదు. "ఏంతల్లీ – ఏం చేశావు," అడిగాడు కేసన – మొల్లవైపుచూచి.

"వీళ్లంతా అక్కడ రంగనాయకి నృత్యంలో తన్మయత్వం పొందుతూంటే – గర్భగుడిలో అఖండజ్యోతి ఆరి పోయింది. లోపలికెళ్లి దాన్నితిరిగివెలిగించా. ఇదీ నేంచేసిన

పని," అంది మొల్ల – ఆవేశంతో ఆచారి ప్రభృతులను చూస్తూ.

నిజానికి మొల్ల చేసినపనిలో కేసనకు తప్పేం కనపడ లేదు. కాని యితరులు అల్లాఅనుకోరని ఆయనకు తెలుసు. తక్కువ కులాలవాళ్లు గర్భగుళ్లోకి ప్రవేశించడం సాంప్ర దాయ విరుద్ధమని, అపచారమని యితరులు భావిస్తున్నప్పుడు– ఆమెపక్షాన క్షమాపణ చెప్పుకోవడంకంటే గత్యంతరం లేదను కొన్నాడు కేసన. ముందు దేవునివైపు తిరిగి ఆయన మౌనంగా ప్రార్థించాడు – తన కూతురు చేసింది తప్పయితే దాన్ని క్షమించమని.

అవధానికి ప్రత్యుత్తరం యివ్వకండా దేవునికి నమస్క రిస్తున్న కేసనను బొజ్జయ్యచెట్టి, శరభరాజు, సుబ్బారెడ్డి, కనకయ్య తలాఒక తిట్టుతిట్టి ఆచారిపట్ల తమకుంచే భక్తి ప్రపత్తుల్ని ప్రత్యక్షంగా ప్రదర్శించారు. మందస్మితవదను డయిన కేసన వాళ్లందరికీ సమాధాన పూర్వకంగా ఒక చిరు నవ్వు నవ్వాడు.

అవధానికి కోపం ఎక్కడా ఆగడంలేదు. "చేసినతప్పుకు తపీమని ఆ చెంప యీ చెంప వాయించుకోక పైగా నవ్వు తున్నావుట్రా కుమ్మరికుంకా ?... ఇంకా చూస్తారేం–మహాప చారంచేసిన ఆ కుట్టకుంకను నాలుగుతన్ని బయటికి గెంటక?"

ప్రశాంతచిత్తుడయిన కేసన అవధాని మాటలకు ఎంతో నొచ్చుకున్నాడు.

"ముక్కుపచ్చలారని పిల్ల బాబూ అది. దానికి-మీకు తెలిసినధర్మాలు, సాంప్రదాయాలు ఏం తెలుస్తాయి చెప్పండి!... చిన్నప్పుడే దానితల్లి చచ్చిపోయింది. అప్పట్నుంచి దాన్ని ముద్దు, మురిపాలతో పెంచి పెద్దదాన్ని చేశా. అదేమిటో మొదటినుంచీ దానిధోరణి దానిది. ఆ నీతులు యీ నీతులు చెప్పి దాన్ని అదుపాజ్ఞల్లో పెట్టాలని ఎంతో ప్రయత్నించా. కాని నాకు సాధ్యపడడంలేదు. దాని కర్మ దానిదేనని - దేవునిమీద భారంవేసి వదిలేశా. ఎంత చేసినా అది నా కూతురు. నా జీవితంలో అదొక్కటే నాకు ఆశాజ్యోతి. దాన్ని చూసుకునే నేను కాలం గడుపుతున్నా.. తెలియక అదేదో చేసింది. అది చేసింది తప్పేనని నే నొప్పుకుంటున్నా. కాదూగూడదంటే దానికిబదులు నాకు మీ చిత్త మొచ్చిన శిక్షవిధించండి: సంతోషపూర్వకంగా స్వీకరిస్తా," అన్నాడు కేసన వినయపూర్వకంగా.

తండ్రి చెప్తున్న మాటలకు ఆక్షేపణా పూర్వకంగా మొల్ల ఆయన్ను ఒక్కచూపు చూసింది. 'నువ్వెప్పుడూ యింతే!' అన్నభావం ఆమెచూపులో ద్యోతకమయింది.

వినయవిధేయతలతో - తనకూతురు చేసిన అపచారానికి క్షమాపణచెప్పిన కేసనను అవధాని మరేమీ అనలేక పోయాడు. ఆచారికూడా ఉపశాంతిని పొందాడు.

నేలమీదున్న పళ్లెంలోని తాటాకుల పుస్తకంమీదికి ఆచారిదృష్టి పోయింది. "అదేమిటో చూడు," అన్నాడు ఆచారి - అవధానితో. తాటాకుల పుస్తకాన్ని చేత్తోతీసుకొని

అవధాని దాంట్లో ఒక్కొక్కాకు తిరగేసి చూచాడు. చూస్తున్నకొద్దీ అవధాని కళ్లు ఎఱ్ఱబారాయి.

"ఈ కుమ్మరివాడు ఒక శతకం వ్రాశాడు. మొత్తానికి వీడు కవనంలోగూడా వేలెట్టాడు. ఈ శతకాన్ని శ్రీరామ దేవుడికిసమర్పించడానికి వచ్చాడల్లేఉంది," అన్నాడు అవధాని—ఆచారి ముఖంచూసి.

కుమ్మరివాడు కవిత్వం వ్రాయడమా ?... ఇదెంత అపచారం ?... బ్రాహ్మణుల ఆధిక్యతకు యిదొకగొప్పదెబ్బ గాదూ ?... ప్రపంచానికిది ప్రళయంగాదూ ?... ఈ ప్రశ్నలు ఆచారిబుఱ్ఱను ఆ క్షణంలో తొలిచేశాయి.

"ఏదీ— ఏం రాశాడో చదువు," అన్నాడు ఆచారి అవధానితో. ఆచారిగుండెలు దబదబ కొట్టుకుంటున్నాయి.

అవధాని ఆ శతకంలోని ఒక పద్యాన్ని హేళనా పూర్వకంగా యిల్లా చదివాడు:

'పంగనామము'నకు పట్టుశాలువ గప్పి
'లింగ'మనిన చీదరించుకొనుట
పాలు త్రావి, వెన్న పరిహరించుట కాదె ?
ప్రేమమయసుధాబ్ధిసోమ ! రామ !

ఆచారి ఆ పద్యం విన్నాడు. ఆయనకు ఆపాద మస్తకం కంపించిపోయింది. ఇంతవరకూ కేసన భక్త సామాన్య భక్తుడనే భావనలో ఉన్నాడాయన. ఇప్పుడు కవితాప్రపంచంలో కూరికి తనమీాద కత్తిదూసినట్లయింది ఆయనకు. దేశమంతటా

ప్రబలిన బసవేశ్వరోద్యమంయొక్క ప్రభావం వీడిమీదగూడా పడలేదుగదా !

ఆచారి ముఖభావాలను పరికించాడు అవధాని. ఇక ఊరుకుంటే బాగుండదనుకొని - కేసన ఆ పద్యంలో వెలిబుచ్చిన భావాలను తన మిడిమిడిజ్ఞానంతో అధిక్షేపించాడు అవధాని. చిరునవ్వుతో కేసన అవధాని ఆక్షేపణకు సమాధానం చెప్పాడు. వేదాలు, శాస్త్రాలు అల్లాంటివేమీ చదవకపోయినా ప్రపంచజ్ఞానం పూర్తిగాఉన్న కేసనముందు అవధాని నిజంగా ఆగలేకపోయాడు. బిక్కముఖం వేసుకొని ఆయన ఆచారివైపు చూశాడు.

"నీకు కవిత్వమేం తెలుసురా? ఎవరు నేర్పారురా నీకు?" అధిక్షేపించాడు ఆచారి - అసూయతో. సాంప్రదాయసిద్ధమయిన, లక్ష్యలక్షణసమన్వితమయిన కవిత్వాన్ని తను ఏ గురువుదగ్గిర నేర్చుకోలేదని - తనదంతా ఏదో గాలికవనమని - ఆచారిలాంటి మహాపండితులు తన కవనాన్ని, అందులోని భావాలను లెక్కలోకి తీసుకోనక్కరలేదని కేసన సవినయంగా అన్నాడు.

కేసనలో శక్తి యింకా ఎంతుందో పరీక్షించడానికి ఆచారి వేదాంతరహస్యాలమీద ఆయన్ను ప్రశ్నించాడు. మహాజ్ఞాని, పరమభక్తుడూ అయిన కేసన - ఉద్రేకాన్ని, ఆవేశాన్ని ఏ మాత్రం చెందకండా - ఆచారిప్రశ్నలకు తగు సమాధానాలిచ్చాడు. కులాధిక్యత, అహంకారం, ద్వేషం ఆచారి మాటల్లోను, వినయం, నమ్రత, సహిష్ణుత కేసన వాక్కు

ల్లోను ద్యోతకమయ్యాయి. శైవ, వైష్ణవ మత సిద్ధాంతాల మీద గూడా వాళ్లిద్దరిమధ్య తర్కం బయలుదేరింది.

"శైవ, వైష్ణవ మతాలకు ఏవిధమైన భేదం లేదు. రెంటి పరమావధి ఒక్కటేనని నా నమ్మకం. విశాలహృదయులకు, నిజమైన జ్ఞానులకు యీ రెంటిమధ్య ఏమీ తేడాఅగపడదు," అన్నాడు కేసన.

పైకి సాధువర్తనుడుగా అగపడుతున్న కేసన తన మీద విసురులు విసిరి, తనను గేలిచేస్తున్నాడని ఆచారి భ్రమించాడు. కేసన చిరునవ్వులో విషముందని ఆయన అనుకున్నాడు. అహంకారం, కులాధిక్యత, ద్వేషం తనకళ్లకు పొరలుగప్పుతూంటే ఆచారి కేసననుగూర్చి అల్లాఅనుకోక మరెల్లా అనుకోగలుగుతాడు ?

"ఆ కుమ్మరివెధవతో మీకు వాదనేమిటండీ ?" అన్నాడు అవధాని ఆచారితో. ఆచారి ఊర్కున్నాడు. "కుమ్మరివాడికి నీకు కవిత్వమేమిట్రా !... నీబోటివాళ్లు కవిత్వం వ్రాస్తే ప్రపంచంలో దుర్భిక్షం హెచ్చదూ ?" అంటూ అవధాని ఆగ్రహావేశంతో తాటాకుల పుస్తకాన్ని అఖండజ్యోతివైపుకు విసిరిపారేశాడు. నిప్పంటుకొని అది క్షణంలో చుటచుట కాలిపోయింది. ఇదిచూచిన ఆచారికి తాపంతగ్గింది.

తనతండ్రి వ్రాసిన తాళపత్రగ్రంథం అగ్నిదేవుడికి ఆహుతయి పోతూంటే మొల్లయొక్క ఆవేశం హెచ్చిపోయింది. కేసన ఆదృశ్యాన్ని చూస్తూ ప్రశాంతంగా ఒక చిరునవ్వు నవ్వాడు.

"మీరు మనుషులా - దున్నపోతులా ?... మీ కేమయినా బుద్ధుందా?" అంటూ మొల్ల ఆచారి, అవధానుల వైపుకు ఉరికింది.

అవధాని ఆవేశంతో మొల్లను జుట్టుపట్టుకొని 'దొంగ ముండా' అంటూ కొట్టబోయాడు. తిక్కన అడ్డుబోదామను కున్నాడుగాని వాడికి ధైర్యం చాల్లేదు. అంతలోకే ఆచారి భార్య సీతమ్మ ముందుకొచ్చి 'ఆగు' అంటూ అవధానిని అదిల్చింది. దాంతో అవధాని వెనక్కు తగ్గాడు.

"ఏమిటీ రభస!... గర్భగుళ్లోకి ప్రవేశించి మొల్ల ఆరిపోయిన దీపాన్ని వెలిగించడం తప్పా ? కుమ్మరి కేసన కవనం వ్రాయడం తప్పా ?... బుద్ధిలేకపోతేసరి!... మనకు లేని భక్తి, జ్ఞానాలు ఆ తండ్రీ కూతుళ్లలో ఉన్నందుకు మనం వాళ్లకు చెయ్యెత్తి దండం పెట్టాలి," అంది సీతమ్మ - ధర్మాధర్మ నిర్ణయం చేస్తూ. ఆమె మాటల్ని విని ఆచారి క్రోధోద్దీపితు డయ్యాడు.

"నీ కెందుకు - నువ్వేమీ మాట్లాడకు!... మగవాళ్ల విషయాలలో జోక్యం తీసుకోవద్దని నీకు ఎన్నోసార్లు చెప్పాను. వెళ్లు," అంటూ గద్దించాడు ఆచారి. "ఎవరి పాపఫలం వాళ్లు తప్పకండా అనుభవిస్తారు," అంది సీతమ్మ - సవినయంగా.

"బాబూ - మామీద మీ కెందుకింతకోపం ? తెలిసో తెలియకో నా కూతురు గర్భగుళ్లో కడుగెట్టింది: నేను కవిత్వం వ్రాశాను. క్షేమ చేసింది తప్పంటున్నారు మీరు. మీ మనస్సునొప్పించడం నా మతంగాదు. మమ్మల్ని క్షమించండి.

అది ఏం తెలియని పిల్ల. దాన్ని మాటిమాటికి రెచ్చగొట్టకండి. అదొక మోటుమనిషి. దానిదొక వింత ప్రకృతి. దానివైఖరి నాకే అర్థంకావడంలేదు," అన్నాడు కేసన ఆచారిని చూచి.

"సరే - యిది మొదటితడవకాబట్టి క్షమించాం. బుద్ధి గలిగి నడుచుకో. నీ కూతుర్ని అదుపు, ఆజ్ఞల్లో బెట్టుకో. పిచ్చిపిచ్చి కవిత్వాలువ్రాసి పులితో చెర్లాటలాడకు. ఇక వెళ్లు," అన్నాడు ఆచారి - అధికారపూర్వకంగా.

"రా తల్లీ - రా - వెడదాం," అంటూ కేసన కూతుర్ని తీసుకొని - నొచ్చిన మనస్సుతో - దేవాలయం బైటికి వెళ్లి పోయాడు. తండ్రితో పోతున్న మొల్ల అప్పుడప్పుడు వెనక్కు తిరిగి, ఆచారి, అవధానులనుచూచి పళ్లుకొరికింది. దీనికెక్కడ మదం తగ్గినట్లు లేదనుకొన్నారు వాళ్లు.

ఇంతవరకూ తన సమక్షంలో ఒక హృదయవిదారక దృశ్యాన్ని చూచింది రంగనాయకి. ఆమె కళ్లవెంట నీళ్లు బొట బొట కారాయి. నిట్టూర్పువిడుస్తూ ఆవిడ కిందికిచూచింది. సగంకాలిన ఒక తాళపత్రం ఆవిడకంటబడ్డది. ఎవ్వరికీ తెలియకండా ఆవిడ ఆ తాళపత్రాన్ని పైకితీసి - కళ్లకద్దుకొని - బొడ్డులో దాచిపెట్టుకుంది. కేసనవ్రాసిన కవిత్వం ఆవిడకు అంత నచ్చిందా ?

కేసన, మొల్ల దేవాలయం బైటికొచ్చారు. మాలమాదిగలకు పెద్ద అయిన పోలిగాడు ముందుకొచ్చి 'లోపలేమైనా జరిగిందా బాబూ' అని కేసనను అడిగాడు. తను చెప్ప

దగినంత - వాళ్ళు వినవలసినంత సంఘటన ఏంజరగలేదంటూ కేసన మందస్మితవదనంతో జవాబిచ్చాడు. "జరగవలసిందేదో జరిగింది. దానికిదగ్గ ప్రాయశ్చిత్తం త్వరలోనే వాళ్ళు అనుభవిస్తారు," అంది మొల్ల రోషంతో. మొల్లమాటలకు కేసన చిరునవ్వు నవ్వాడు. ఆరోజు శ్రీరామనవమి కావటంచేత - వీలైనప్పుడు తనయింటికొచ్చి వడపప్పు, పానకం పుచ్చుకువెళ్ళవలసిందని కేసన వాళ్ళందరిని కోరాడు. పోలిగాడు కేసనశిష్యుడు. పరమభక్తుడు. "అట్లాగేవస్తాం స్వామీ," అని పోలిగాడు కేసనకు తమందరి పక్షాన కృతజ్ఞతను తెలిపాడు.

దేవాలయం లోపల - మైలపడ్డ దేవుడికి సంప్రోక్షణాది కార్యకలాపాన్ని శాస్త్రోక్తంగా కొనసాగించ వలసిందిగా రామాచారి అర్చకులకు ఆజ్ఞ యిచ్చాడు. తన సమక్షంలోనే యిల్లాంటి దృశ్యం జరిగినందుకు ఆయనకూడా కటకటబడి - రామచంద్రుణ్ణి స్తుతిస్తూ శ్లోకాలు చదివాడు. కాని గర్భగుడిలోని విగ్రహాల వదనాలలో ప్రసన్నత ఎక్కడా గోచరించలేదు. పరమభక్తుడు, మహాజ్ఞానిఅయిన కేసనకు జరిగిన అపచారానికి శ్రీరామచంద్రమూర్తిగూడా ఖిన్నుడయినట్లు ఆ విగ్రహం చూపెట్టింది.

ఏ పేరుతో పిలిచినా - ఏ రూపంతో కొలిచినా - భగవంతు డొక్కడేనన్న నమ్మకం కలిగిన మహావ్యక్తి కేసన. ఇంటికి వెళ్ళాక - కాళ్ళూ చేతులూ కడుక్కొని - కుండలో రాగిఅంబలి కాచుకొని - దొడ్లో కట్టేసున్న ఆవు, దూడలకు పుష్టిగా మేతబెట్టి - తన యిష్టదైవమయిన శ్రీ కంఠమల్లేశుని

ప్రార్థించాడు. తనలోని అహంకార, మమకారాదులను నిర్మూలించమని, జీవితాంతం వరకూ మానవసేవ చెయ్యడానికి తనకు శక్తిని ప్రసాదించమని - ఏ పరిస్థితుల్లోను తనను రాగ ద్వేషాలకు లోనుచేయొద్దని - ఆయన ఆ దేవదేవుణ్ణి ప్రార్థించాడు. పూజ పూర్తయ్యాక ఆయన - ప్రసాదం చేత్తో బుచ్చుకొని తన పూరింటి బైటికొచ్చాడు.

రోటిమీద కూర్చొని మొల్ల అప్పుడే ముఖం కడుగుతూంది. ఆమె వెనకాల ఆకాశాన్నంటుకుంటున్న శ్రీరామ దేవాలయ గోపురం అగపడుతూంది. ఆవిడదృష్టి ఎక్కడో ఆకాశంమీదుంది. ఏమిటో తలపోస్తున్నది మొల్ల. "తొందరగా మొగం కడుక్కో తల్లీ - దేవుని ప్రసాదం పుచ్చుకుందువు గాని," అన్నాడు కేసన. నీళ్లుపుచ్చుకొని మొల్ల ముఖం అదో తరహాగా కడుక్కుంది. కేసన ఆవిడచేతిలో ప్రసాదంబెట్టాడు. దాన్ని కళ్లకద్దుకోకండా ఆ పిల్ల నోట్లోవేసుకుంది. కేసన చిరునవ్వునవ్వి, "కళ్లకద్దుకోకండా దేవుడుప్రసాద్దాన్ని నోట్లో వేసుకోగూడదమ్మా - నువ్వెన్నిసార్లు చెప్పినా వినవు," అన్నాడు.

"అయ్యా - యిక్కడనుంచి దేవతల, దేవుళ్లపేర్లు నా దగ్గిరెత్తబోకు. ఇంతకాలంబట్టి వాళ్లను నువ్వు పూజిస్తూంటే ఏమిటి నీకు వాళ్లు ఒరగబెట్టింది ?... ఆ దేవాలయంలోని శ్రీరామచంద్రుడు, మనింట్లోని శ్రీ కంఠమల్లేశుడు ఆ ఆచారిచేత నువ్వు పరాభవం పొందకండా అడ్డుపడలేక పోయారు. గర్భగుళ్లో ఆరిపోయిన దీపాన్ని నేను వెలిగిస్తే -

నన్ను కొట్టడానికొచ్చిన అవధానిని యీ దేవుళ్లేమీ చేయలేక పోయారు. ఇంతకూ అవి రాతివిగ్రహాలని, వాటిని ఆరాధించ డంవల్ల ఫలితమేం లేదని శుభ్రంగా తేలిపోయింది. లేకపోతే యింతఘోరం జరుగుతూంటే – బెల్లంకొట్టిన రాళ్లులాగా – అల్లా మూగనోము ఎందుకుబడ్తారు వాళ్లు?... అయ్యా – నువ్వు నూరుచెప్పు – వెయ్యిచెప్పు. ఈ పూజలు, పునస్కారాల వల్ల ఏం లాభంలేదు. సామాన్య మానవుడికి కావలసింది ముందు భుక్తి, తరవాత ముక్తి," అంది మొల్ల – దేవాల యంలో జరిగిన సంఘటనను స్మరణకు తెచ్చుకొంటూ. రోషావేశంతో తన కూతురు అల్లా మాట్లాడుతూంటే కేసన పెదవులమీద చిరునగవు చిందులేసింది.

"అల్లా అనకు తల్లీ! దేవాలయంలో నువ్వుచేసింది తప్పని నేనుఅనను. ప్రాజ్ఞులెవ్వరూ అనలేరుకూడాను. కాని కొన్ని ధర్మాలు, సాంప్రదాయాలు, కట్టుబాట్లు ఉన్నాయి. వాటిని మనం అతిక్రమించగూడదు. ఒక్కొక్కప్పుడు మనం చేస్తున్న పని సక్రమమైనదన్న దృఢవిశ్వాసం మనకుండొచ్చు. అది అవతలివాళ్లు సరిగ్గా అర్థంచేసుకోలేనప్పుడు – వాళ్లతో మనం పేచీకిదిగి ప్రయోజనం లేదు. ఓర్పుతో, నిదానంతో, ఉద్రేకం అల్లాంటిదేం లేకండా మనం మనప్రతిపక్షుల హృదయా లను మార్పుకు గురిచెయ్యాలి. కళంకంలేని మన ప్రవర్తనలో, తియ్యని హేతువాదంతో మన విరోధుల్ని మనం మనవైపుకు రప్పించుకోవాలి. హింస, దౌర్జన్యాలవల్ల మనం ఏపనీ సాధించలేం. నీ మనస్సులో, మాటలో, చేతలో దౌర్జన్యానికి

ఎక్కడా చోటుయివ్వకు. నువ్వు చేసింది తప్పుగాదు. కాని అవ తలివాళ్లు అది అర్థంచేసుకోలేనప్పుడు మనం దౌర్జన్యానికి దిగి – వాళ్లకు నచ్చజెప్పటానికి ప్రారంభిస్తే – మనంకూడా వాళ్ళలాగా అయిపోతాం. ఇదే నేను నీకు చిన్నప్పటినుంచి చెబుతున్నా. దుడుకుతనం నీలోని మంచితనాన్ని మరుగు పరుస్తున్నది. ఆ దుడుకుతనం నువ్వు చంపుకోవాలి. అంతకంటె ఏంలేదు. లే-తల్లీ-లే!... లోపలికొచ్చి అంబలితాగు. నాతో పాటు కూర్చో. వడపప్పు పానకం తయారుచేస్తా. పోలయ్య వాళ్లంతా యివాళ మనింటికి ప్రసాదం తీసుకోడాని కొస్తారు," అన్నాడు కేసన – ఆమెపట్ల తన పితృవాత్సల్యాన్ని చూపెడ్తూ. మొల్ల లేచి అయ్యతో యింట్లోకి వెళ్లింది.

తల్లిలేని ఆ పిల్లకు – తిండి సరిగ్గా తినడం, బట్ట సరిగ్గా కట్టుకోవడం తెలియని ఆ పిల్లకు – తనచేత్తో తాను అంబలి తాగించాడు కేసన. "ఆచార్లగారి భార్య సీతమ్మను చూశావుగా తల్లీ!... చూడు – ఆవిడ ఎంత ధర్మాత్మురాలో!... దేవాలయంలో మగణ్ణి ఎంత భక్తితో, ఎంత తియ్యగా, ఎంత వినయంగా మందలించిందో చూచావా!..." అన్నాడు కేసన. అంతవరకూ రోషంతో కుమిలిపోయిన ఆ అమాయకపు పిల్ల వరహాలు విలువచేసే ఒక్కనవ్వు నవ్వింది. ఆ నవ్వు కేసనకు ఎంతో ఆహ్లాదాన్ని కలిగించింది. కూతుర్ని దగ్గరకు తీసుకొని తండ్రి ఆమె తలను ముద్దుపెట్టుకున్నాడు.

భక్తిప్రపత్తులు తనలో వెల్లివిరిసిన విదుషీమణి – ఆచారి భార్య సీతమ్మ. దొడ్లో ఆవిడ తులసిపూజ చేసుకుంటూంటే

రామాచారి తన భవనపు మధ్యభాగంలో కొచ్చాడు. ఒంటి మీద శాలువను తీసేసి ఆయన ఒక చిన్న బల్లదగ్గిరగా కూర్చున్నాడు. తాళపత్రాలన్నీ ఆ బల్లదగ్గిర పడేసున్నాయి. గంటం తీసుకొని ఆయన మరో గ్రంథరచన కుపక్రమించాడు.

సీతమ్మ— దొడ్లో తులసిపూజ పూర్తిచేసుకొని — పళ్లెంలో ప్రసాదం బట్టుకొని — భర్త దగ్గిరకొచ్చి — ఆయనకు ప్రసాదం పెట్టబోతుంది. అది పుచ్చుకోకండా ఆయన ఆవిడను నఖశిఖ పర్యంతం తీక్ష్ణంగా చూచాడు. దేవాలయంలో జరిగిన సంఘటనయొక్క ప్రభావం ఆయన చూపులో ద్యోతకమయింది.

"మగవాళ్ల విషయాల్లో జోక్యంతీసుకోవద్దని నీకు ఎన్నోసార్లు చెప్పాను. నువ్వు వింటల్లేదు," అన్నాడు ఆచారి గద్దిస్తూ.

"అవును. అక్కడ నేను మీ విషయంలో జోక్యం తీసుకోక తప్పిందిగాదు. కేసనపట్ల, మొల్లపట్ల మీరక్కడ చూపెట్టిన ప్రవర్తన నైతిక విరుద్ధంగా ఉంది. అది మీ ఘనతకు ఏ విధంగాను దోహదం చెయ్యదు. నా భర్త తప్పు దారిలో బడ్డప్పుడు, నిజమైన సతిగా — ఆయన్ను మంచిదారిలోకి మరల్చడం నా విధి. నా దృష్టిలో కేసన, మొల్ల దేవాలయంలో ఏ విధమైన అపచారం చెయ్యలేదు," అంది సీతమ్మ — ధర్మంపట్ల తన అభిమాన నిరతిని చూపెడుతూ.

అహంకార స్వరూపుడైన ఆచారికి ఆమె మాటలు వింటూంటే ఉద్రేకం హెచ్చింది. చేతిలోని గంటంతో ఆవిడ నెత్తిమీద ఒకపోటు పొడిచాడు. రక్తం చిందింది.

ఇంత జరిగినా సీతమ్మ తన ప్రశాంతతను విడనాడలేదు. ఆచారి కళ్ళల్లోకి చూచి ఆవిడ, "మీరు మహాపండితులు. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు కూలంకషంగా చదివారు. కాని మీకు సంస్కారం లేదు. చదువుకు, సంస్కారానికి చాలా తేడా ఉంది. పెద్దపుటక పుట్టడంతో ఎవరికీ సంస్కారం అబ్బదు. నిత్యజీవితంలో సాధనవల్లనే వ్యక్తికి సంస్కారం అలవడుతుంది...... ఇంతకూ మీరు మగవాళ్లు - యిదే మీరు చేయగలిగింది!" అంది.

ఇంతలోకే కనకయ్యను వెంటబెట్టుకొని అవధాని అక్కడకు వచ్చాడు. "గురువుకు తగ్గ శిష్యుడు," అంటూ సీతమ్మ లోపలికి వెళ్లిపోయింది.

ఆడవాళ్లకు అలుసిచ్చి ఎప్పుడూ నెత్తికెక్కించుకోగూడదని - వాళ్లను ఎక్కడుంచాలో అక్కడుంచాలనీ అన్నాడు ఆచారి అవధానితో. "మీరు చెప్పింది అక్షరాల నిజం," అంటూ బ్రహ్మచారి అవధాని ఆచారికి వంత పాట పాడాడు.

దేవాలయంలో జరిగిన సంఘటననుగూర్చి అవధాని ఆచారితో ప్రస్తావించాడు. మాలమాదిగల నందరిని కేసన యీ రోజు తన యింటికి రమ్మన్నాడని - యిల్లా రమ్మనడంలో ఏదో కుంభకోణం లేకపోలేదని - కనకయ్యే యీ సంగతిని తనకు చెప్పాడని అవధాని అంటాడు.

"కేసనను, మొల్లను మనం ఒక కంటితో కనిపెట్టి ఉండాలి. మన గ్రామంలో వీళ్లు కల్లోలం తెచ్చిపెట్టేటట్టుగా

అగుపిస్తున్నారు. అందులో పైకి సాధువుగా కనపడే ఆ కేసనను మనం ఎంతమాత్రం నమ్మడానికి వీల్లేదు. వాడొక పయోముఖ విషకుంభం. అసలీ శైవులందరు వినాశకరశక్తులు. సంఘంలో సంక్షోభాన్ని తీసుకురావడమే వీరి జీవిత పరమావధి. ఎవడో బసవేశ్వరుడు దేశమంతా గగ్గోలు బయలుదేరదీశాడట!... కులాలన్నీ ఏకంకావాలని వాడు ఉద్ఘోషించాడట!... వర్ణాశ్రమధర్మాల మీద వాడు గొప్పదాడి బయలుదేర దీశాడట!... కవితాప్రపంచంలో ఒక గొప్ప విప్లవాన్ని రేకెత్తించాడట!... వాడి గాలే యీ కేసనకుగూడా సోకిందనుకుంటూ," అన్నాడు ఆచారి - పరిస్థితుల్ని సమీక్షిస్తూ.

కనకయ్య తమకు అండగా ఉన్నంతవరకు తాము ఎవ్వరికీ భయపడక్కర్లేదని - గ్రామంలో ఏదైనా గోలబుడ్తే కనకయ్య యిట్టే అణిచేస్తాడని అవధాని ఆచారికి తాపోప శమనం చేశాడు. అవధాని తనను గురించి ఆచారితో అల్లా చెప్తూంటే కనకయ్యలో ఒక విధమైన స్వాతిశయం, గర్వం పుట్టుకొచ్చాయి.

"నా బొందిలో ప్రాణముండగా అగ్రహారీకులైన రామాచారిగారి మీద యీగనైనా వాలనివ్వను. మా బావ కేసన ఒక పిచ్చాడు. భార్యపోయినప్పటినుంచి వాడిమతి చలించింది. వాడి కూతురు మొల్ల ఒక కుట్టుకుంక. అది ఏంమాట్లాడుతుందో దానికే తెలియదు. ఇంతకూ దాన్ని నాకొడుకు తిక్కన మంచిరోజుచూసి పెళ్ళాడబోతున్నాడు. మావాడు

దాన్ని కుక్కినపేనులాగా కూచోబెడతాడు. ఇక కేసనను గురించి నేను చూసుకుంటా. మీరేం భయపడక్కర్లేదు," అంటూ కనకయ్య తన రౌడీధోరణిలో ఆచారికి, అవధానికి అభయహస్తమిచ్చాడు.

ఎంత చెప్పినా ఆచారిమనస్సు కుదటబడడం లేదు. ఆ ఊళ్లో కేసన బసవేశ్వరుని ప్రతినిధి అని – పైకి తెలియకుండా ఆయన అన్ని రంగాలలోను విప్లవాన్ని రేకెత్తించబోతున్నాడని – తన ఆధిక్యతను ఆయన సవాలుచేయడానికి ఉంకిస్తున్నాడని – ఊళ్ళో ఉన్న కూలి, నాలి జనాన్నంతా తనమీదికి సమయంచూసి ఉసికొల్పబోతున్నాడని – ఆయనకు అనుమానం, భయం పట్టుకున్నాయి.

ఆందోళితుడైన ఆచారి మనస్తత్వాన్ని అవధాని గ్రహించకపోలేదు. "అల్లా రంగనాయకి యింటిదాకా పోయొద్దాం రండి – కాస్త మనశ్శాంతి చేకూరుతుంది," అన్నాడు అవధాని. రంగనాయకి పేరు వినడంతోటే ఆచారి మనస్సు విప్పారింది. ఆ మోహనమూర్తి ఆయన మనోవీధిలో తాండవమాడింది. అందరూ బయలుదేరారు – రంగనాయకి యింటికి వెళ్ళడానికి.

బయటికి వెళ్ళేసరికి – పోలిగాడి పెద్దరికం కింద – మాలమాదిగ లంతా తన యింటివైపుకొస్తున్నట్లు చూచాడు ఆచారి. వాళ్ళను చూస్తే ఆయనకు ఒకవిధమైన భయం పుట్టింది. బసవేశ్వరోద్యమపు వాసన వాళ్ళకుకూడా సోకిందా ?...

"ఏం దగ్గిరదగ్గిరకొస్తున్నారు ?... కొంచెం దూరంగా ఉండండి!... కళ్ళేమైనా నెత్తి మీదికొస్తున్నాయా ?... మీకొక వినాయకుడు దొరికాడని మాకు తెలుసులేండ్రా! అన్నట్టు మీరంతా శైవమతం పుచ్చుకోబోతున్నారటగా!..." అంటూ అవధాని వాళ్ళమీద తనకుండే అక్కసును వెళ్ళ గక్కుకున్నాడు.

అవధాని మాటల్లోని అంతరార్థం పోలిగాడికేమీ బోధపడలేదు.

"శైవమేమిటో, వైష్ణవమేమిటో మాకేం తెలియదు బాబూ! మాకు కావలసినదల్లా తింటానికి తిండి – కట్టుకోడానికి గుడ్డ!... రాత్రింబవళ్ళు చెమటోడ్చి, కూలినాలి చేసుకు బతికేవాళ్ళం – మాకెందుకు బాబూ మీరు చెప్పేవన్నీను ?" అంటూ పోలిగాడు సవినయంగా అవధానికి సమాధాన మిచ్చాడు.

"ఏడిశారులేండ్రా! నోరుమూసుకోని ఊరోక్క అయ్యగారికి జవాబుగూడా చెప్తాన్తున్నారూ ?" అంటూ కనకయ్య వాళ్ళను అదమాయించాడు.

"ఇంతకూ మీకు ఆచారిగారితో కావలసిన పనేమిటో చెప్పండోయ్ ?" అని ప్రశ్నించాడు అవధాని.

ఆ నాటి ఉత్సవానికి తప్పెట్లు మోగించినందుకు – వీరాంగం వేసినందుకు తమకు ముట్టవలసిన కూలిడబ్బులకోసం వచ్చామని పోలిగాడు ఆచారికి మనవిచేశాడు.

"కూలిడబ్బులేం ట్రోయ్ - కొత్తగా జెప్తున్నారు ! అగ్రహారపుపొలాల్లో పనిచేసినందుకు మీకు కూలిగింజలు కొలవడంలా !... ఉత్సవానికి తప్పెట్లు వాయించినందుకు ప్రత్యేకంగా కూలిడబ్బులుకావాలీ మీకు ?... ఇదంతా వెట్టిచాకిరి. ఆచారిగారికి కోపం తీసుకురాకండి!... ఆయన కేగనక ఆగ్రహం వస్తే మీరంతా మూట, ముల్లె సర్దుకొని యీ ఆగ్రహారాన్నొదలి - శంకరగిరి మాన్యాలు పట్టాల్సొస్తుంది - ఏమనుకున్నారో - ఏమో !..." అన్నాడు అవధాని - బూకరిస్తూ.

అవధానికి లయబద్ధమైన పక్కతాళం వేశాడు రౌడీ కనకయ్య. మాలమాదిగలకు ఏమనాలో పాలుబోలా.

"ఇవాళ శ్రీరామనవమి బాబూ?... ఈ రోజైనా పొట్టనిండా అంబలి తాగాలనుంది మాకు. తప్పెట్లు వాయించినందుకు కూలి యివ్వకపోతేమానె - పోయిన సంవత్సరం మాకివ్వవలసిన కూలిగింజలు కొలిపించియ్యండి బాబూ - మీకు పుణ్యముంటుంది," అంటూ మొరెట్టుకున్నాడు పోలిగాడు - తనవాళ్ళందరి పక్షాన.

"మీకు ముట్టవలసిన కూలిగింజలు అప్పుడే ముట్టిపోయాయి. నే గాదట్రా మీకా కూలిగింజలు కొలిచిచ్చింది," అన్నాడు - అబద్ధమాడడానికి వెనుకాడని రౌడీ కనకయ్య.

ఈ తతంగమంతా లోపలినుంచి కనిపెడుతున్న సీతమ్మ - తలమీద గాయానికి కట్టుకున్న కట్టుతో - బయటకొచ్చింది. పోయిన సంవత్సరం వాళ్ళకు యివ్వాల్సిన కూలి

అల్లాగే ఉండిపోయిందని – అది యీనాడైనా యివ్వకపోతే మహాపాపమని సీతమ్మ తనభర్త ఆచారికి విన్నవించింది.

"ముందు లోపలికి వెళ్ళు," అంటూ ఆచారి ఆవిడను గద్దించాడు. "చెప్తే వినడం మీ నిఘంటువులో లేదుగా !" అంటూ ఆవిడ లోపలికివెళ్ళి పోయింది.

తనధోరణిలో కనకయ్య మాలమాదిగల్ని కూలి నాలి అడగొద్దంటూ ఆఖరిసారిగా హెచ్చరించాడు. చేసేదేం లేక అమాయకులైన ఆ మాలమాదిగలు 'పోదాంరాండ్రా – యీాళ్ళపని యిట్లాగాదు' అంటూ పాపం వెళ్ళిపోయారు.

"ఈ కూలికుంకల మాటలకు మీరేం బెదరకండి బాబూ!... అంతా నేను చూసుకుంటా," అన్నాడు కనకయ్య ఆచారితో–ఆయనపట్ల తనకున్న భక్తి ప్రపత్తులను ప్రదర్శిస్తూ. ఆచారి ఏం మాట్లాడలేదు. మొత్తానికి మాలమాదిగల ధోరణిచూస్తే ఆయనకు ఒక విధమైన భయం పట్టుకొంది. ఇద్దరికీ నమస్కారంబెట్టి 'వస్తా బాబూ' అంటూ కనకయ్య వెళ్లి పోయాడు.

"లేనిపోని అనుమానాలు మీకు ! బసవేశ్వరుడి భయం మీకు బాగాపట్టుకుంది. అల్లా రంగనాయకి యింటికి వెళ్దాం రండి !..." అంటూ అవధాని ఆచారిని తీసుకు పోయాడు.

బోగంకులంలోబుట్టినా రంగనాయకికి ఆకులం యొక్క లక్షణాలు ఏమాత్రం అబ్బలేదు. ఆమె చిన్నప్పటినుంచి దేవదాసివృత్తి స్వీకరించింది. సంగీతంలో, కవిత్వంలో, నృత్యంలో

ఆమె పాండిత్యం అపారం. మహాకవి తెనాలిరామలింగని శిష్యురాలు అల్లాగాక మరెల్లా అవుతుంది ?

మురళీకృష్ణుని విగ్రహం ముందున్న జ్యోతిని వెలిగించి— భక్తి పారవశ్యంతో ఆవిడ భగవానుని ప్రార్థిస్తూంది. ఐహిక భోగాలవైపుకు తన మనస్సును పోనియ్యొద్దని ఆవిడ ఆ దేవ దేవుని వేడుకొంటూంది.

చిరుగజ్జియల వలపు పిలుపు వినిపింపవా !
మురళీస్వనమున నను కలిగింపవా !
చిరుగజ్జియల...
నీతలపు బాటలో — నీవలపు తోటలో
నీదాసి చిరుకోర్కె నిలిపి కులికింపవా ?
చిరుగజ్జియల...
కాముకుల కౌగిళ్ళ కలగుటా "ప్రేమ" యన
'కాదు కా దని' కోటికంఠాలతోచాట
చిరుగజ్జియల...
కులటగా నను, నన్నుగొలుచు సామిగ నిన్ను
తలచు పామరులతో పలుకు తలపే లేదు
చిరుగజ్జియల...

— యీ గీతాన్ని ఆలాపిస్తూ రంగనాయకి మురళీకృష్ణునిముందు నృత్యం చేస్తూంటుంది.

రంగనాయకితో యిష్టాగోష్ఠి సల్పడంకోసం— సరససల్లాపాలాడడంకోసం — ఆచారి, అవధాని ఆమె యింట్లో అడుగిడు తారు. లోపల ఆవిడ పాడుతున్న పాట వింటూ — అక్కడున్న

సోఫాలమీద వాళ్ళు ఆసీనులయ్యారు. గోడలమీదున్న చిత్రాలను వాళ్ళు తిలకించారు. అవి రంగనాయకి స్వయంగా వ్రాసిన చిత్రాలు. చిత్రలేఖనంలో రంగనాయకి గొప్ప ప్రవీణురాలని ఆ బొమ్మలు చాటుతున్నాయి. ప్రేమకు, కామానికి ఉన్న అపారభేదాన్ని ఆ బొమ్మలు స్పష్టీకరిస్తున్నాయి.

కృష్ణవిగ్రహంముందు పూజ పూర్తయ్యాక రంగనాయకి-హారతి, ప్రసాదంఉన్న పళ్ళాన్ని చేతబట్టుకొని హాల్లోకొచ్చింది. అక్కడ కూర్చున్న ఆచారిని, అవధానిని చూచింది. భక్తి, వినయంతో ఆవిడ వారికి ప్రణామం సల్పి, స్వాగతం చెప్పింది. ప్రసాదం పళ్లాన్ని ఆవిడ వాళ్ళముందు పెట్టింది. ఆచారి ఆ ప్రసాదాన్ని ఆహ్లాదంతో స్వీకరించాడు. తన అర్ధాంగి సీతమ్మ చేతినుంచి ప్రసాదం తీసుకొన్నప్పుడు ఆయన ముఖంలో పుట్టుకొచ్చిన విసుగు, కోపాలు యిప్పుడు ఏకోశాన అగపడలేదు.

ఆచారి ఆవిడ యింటికి ఎందుకొచ్చాడో నిగూఢంగా వివరించాడు అవధాని. అవధాని మాటల్లోని అంతరార్థాన్ని ఆవిడ గ్రహించలేకపోలేదు. మనస్సులో చలనమేం లేకండా ఆవిడ వారికి అతిథిసత్కారాన్ని కావించింది.

ఆచారి, అవధాని ఆవిడను మాటల్లోకి దింపి ఆవిడమీద చలోక్తుల్ని విసిరారు. కల్లకపటంలేని మనస్సుతో ఆవిడ ఆ చలోక్తుల్ని సవినయంగా స్వీకరించింది. రంగనాయకి పవిత్రప్రేమకు ప్రతినిధి. ఆచారి కామానికి ప్రతినిధి. ప్రేమ,

కామానికి సంబంధించిన ప్రవృత్తులు వారిద్దరి సంభాషణలో నర్మగర్భితంగా ద్యోతకమయ్యాయి.

దేవాలయంలో జరిగిన కేసన సంఘటనగూడా వారిద్దరిమధ్య చర్చకు వచ్చింది. ఈ చర్చలో వారిద్దరూ తీక్ష్ణంగా ఖేదించారు. ఆ సంగతొదిలిపెట్టి ఆచారి తిరిగి ఆవిడను తన గాలానికి ఎరచేయడానికి తీవ్రమైన ప్రయత్నం సలిపాడు. జితేంద్రియత్వాన్ని పొందిన రంగనాయకి ఆయనకు కొరక బడని పోకగా అగపడ్డది.

క్రమక్రమంగా వారిద్దరిమధ్య చర్చ కవిత్వంమీదికి దొర్లింది. తన గురువు తెనాలిరామలింగని కావ్యాలను ఆవిడ శ్లాఘించింది. అల్లా శ్లాఘించడం ఆచారికి ఎంతమాత్రం రుచించలేదు తెనాలి రామలింగని కవిత్వం తనకు తెలుసని- రసికులకు విమర్శకులకు అందులో మెదడుకు ఏ మాత్రం మేత దొరకదని - ఆచారి హేళనపూర్వకంగా అన్నాడు. "రామలింగకవి రచనలను చదివి, అర్థంచేసుకోగలిగితే మీరు అల్లాఅనరు" అంది రంగనాయకి.

మహాపండితు డనదగ్గ రామాంచారి యీ విధంగా రంగనాయకి యింట్లో కామప్రవృత్తితో యిహలోక సుఖాల కోసం ఆశిస్తూంటే అక్కడ కేసన భగవద్భక్తిలో మునిగి పరలోక సుఖాలకోసం పాకులాడుతున్నాడు.

బారులు తీర్చి తన గుడిసెముందు కూర్చొనున్న జంగం దేవర్లకు, మాల మాదిగలకు భజనచేస్తూ కేసన పానకం, వడపప్పు పంచిపెట్టాడు. ఆ భజనలో అందరూ పాల్గొన్నారు.

తండ్రి భజనచేస్తూ భక్తిలో తన్మయత్వం చెందు తూంటే ఎప్పటిమో స్తరుగా రోటిమీద కూర్చొని మొల్ల శూన్యంలోకి తొంగిచూస్తూంది. కనకయ్య కొడుకు తిక్కన గూడ అక్కడజేరి- మొల్లమీద తన మోహపుబాణాలను వికృతంగా విసురుతున్నాడు. అదో ప్రపంచంలో ఉన్న మొల్ల ఆబాణాల కెక్కడా కిందపడడంలేదు.

అందరూ వడపప్పు, పానకం తీసుకున్నాక అక్కడున్న రావిచెట్టుకింద గుమిగూడారు. ఆనాడు దేవాలయంలో అగ్ని దేవుడికి ఆహుతయిన తన గ్రంథంనుంచి నాలుగుపద్యాలు వినిపించి, తమ వీనులకు విందుచెయ్యమని పోలిగాడు కేసనను అడిగాడు. జ్ఞప్తికి తెచ్చుకొని కేసన - మానవజీవిత పర మార్థాన్ని విశదీకరించే పద్యాలను చదివి - వాళ్ళకు విని పించాడు. కేసన కవితను వాళ్ళందరూ ఎంతో శ్లాఘించారు.

ఇక్కడ కేసన భక్తిరసంతో గూడిన గీతాలను మాలల సమక్షంలో పాడుతూంటే - రంగనాయకి యింట్లో రామాచారి తను రచించిన శృంగారలీలాతరంగిణి నుంచి కొన్ని శ్లోకాలు ఆవిడకు వినిపిస్తున్నాడు. రామలింగకవి గ్రంథాలు చెత్తరచనలని - వాటిల్లో రసికత్వం మందుకైనా కానరాదని - తన గ్రంథముందు తెనాలి రామలింగని గ్రంథాలన్నీ బలాదూరని ఉద్ఘోషిస్తున్నాడు. కామోద్రేకాన్ని కలిగించే శ్లోకాలను రామాచారి వల్లెవేస్తూంటే రంగనాయకి వాటిపట్ల తన ఏహ్యభావాన్ని చూపెట్టింది. ఆమె ప్రవర్తన పట్ల ఆచారికి కోపం, చికాకు హెచ్చాయి. రంగనాయకి గట్టి

పిండమని తెలుసుకున్న అవధాని - ఆచారి పాచికలు ఆవిడ మీద ఏ మాత్రం పారేస్థితిలో లేవని తృణ్ణంగా గ్రహించిన అవధాని - "రంగనాయకికి తమ మహాకావ్యంలోని రచనలు బోధపడలేదు. వాటిని అర్థంచేసుకోవడానికి ఆవిడకు మీరు కొంత కాలవ్యవధి యివ్వాలి," అంటూ ఆచారిని ఊరడించాడు.

"ఆచారిగారు మరో పర్యాయం నీ యింటికి విచ్చేస్తారు. వారి అమూల్యవాక్కుల్ని యీలోపల బాగా మననం చేసుకో," అంటూ అవధాని ఆచారిని అక్కడినుంచి తీసుకు పోయాడు. సంస్కారులకు, పండితులకు మధ్య ఒక పెద్ద అడ్డాంశ రేఖ ఉందని ఆవిడ గ్రహించింది. పామరుడయినా సభ్యత, సంస్కృతి గల కేసన ఏ అంతస్థుకు చెందినవాడో యిప్పుడావిడ తెలుసుకుంది.

అక్కడ కేసన ధర్మార్థ, కామమోక్షాలను గురించి మామూలు మాటల్లో మాలమాదిగలకు హితోపదేశాలు చేశాడు. పోలిగాడు, రత్తయ్య మొదలయిన పెద్దలు కేసన చెప్తున్న వేదాంతరహస్యాలను అర్థంచేసుకోగలిగారు. తక్కిన కుఱ్ఱకారుకు ఆయన చెప్పిందేమీ బుఱ్ఱకెక్కలేదు.

వాళ్లల్లోనుంచి నడివయస్సువాడొకడు గొంతు సవరించుకుంటూ ముందుకొచ్చాడు.

"అయితే కేసనబాబూ- నువ్వు చెప్పిందంతా విన్నాం. మొత్తానికి నువ్వు పెద్దపెద్దమాటలే చెప్పావు - వాటిని మేమేం కాదనం. కాని కూడు సంపాదించుకొనే మార్గాన్ని

గూర్చి నువ్వు ఎత్తలేదు. ముందు పొట్టలో పడన్నా పడితేనే గదా తరవాత యీ పెద్ద కబుర్లన్నీను! ఇవాళమటుకు యివాళ మేమంతా ఆచారిగారిదగ్గరకెళ్లి 'మేంచేసిన కష్టానికి కూలివ్వవయ్యా', అంటూ ఆయన కాళ్లా వేళ్లా పడ్డాం. నోటికొచ్చినట్లు మాట్లాడి అవధానిగారు ఆయన మమ్మల్ని అక్కడినుంచి పంపించేశారు. ఆఖరుకు కనకయ్యను మామీద ఉసికొలిపారుకూడా. ధర్మం, మోక్షం అంటూ మేం తలకాయ వంచుకొని పోతుంటే మా పెళ్లాం బిడ్డల గతి ఏంకాను? ఆకలికి వాళ్లు అట్లా మలమలమాడి చావాలసిందేనా? ఎంత తలకాయొంచుకుపోతున్నా అందరూ మామీద కారాలు, మిరియాలు నూరితే. ఎట్లా? కయ్యానికి కాలుదువ్వితే ఎట్లా? మా ఎముకల్లో సున్నాన్ని అపహరించి - మా శ్రమశక్తిని వీళ్లు కొల్లగొడ్తుంటే మేం చూస్తూ ఊర్కోవలసిందేనా?" అన్నాడు ఆవేశంతో.

ఇది విన్న మొల్ల ఛంగున రోటిమీధనుంచి దూకి వీళ్లదగ్గరకొచ్చింది. "అట్లా అడగండి మా అయ్యని - నిలబెట్టి! ఆయనెక్కడో మీకు, నాకు అందుబాటులోలేని ప్రపంచంలో ఉన్నాడు. ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికి ఎగబాకటానికి ఉబలాటపడ్డదిట! ముందు తింటానికి కూడులేదుగాని ముక్తికోసం మనమంతా పాటుబడాలట!" అంది మొల్ల - తండ్రియొక్క వేదాంతాన్ని నిశితంగా విమర్శిస్తూ.

మొల్ల ఆవేశంతో వెలిబుచ్చిన భావాలకు అనుకూలురు ఆ గుంపులో అధికసంఖ్యాకులున్నారని

కేసనకు తెలియకపోలేదు. మామూలుఫక్కీలో ఆయనొక చిరునవ్వు నవ్వాడు.

"మా అమ్మాయి చెప్పినదాంతో ఏకీభవించేవాళ్లు మీలోచాలామందున్నారని నాకు తెలుసు. ఒకవిధంగా మీరు చెప్పిందంతా సమంజసంగానే ఉందని నేనూ ఒప్పుకుంటా. కాని మనిషి కేవలం తిండికోసమే పుట్టలేదు. తిండి లేక చావడంలేదు. తిండిని మనమంతా సంపాదించుకోవాలన్న వాదనను నేను కాదనను. కాని ఆ తిండిని సంపాదించుకోవడంలో మనం – మన మనోవాక్కాయకర్మల్లో – దౌర్జన్యాన్ని, హింసాపద్ధతిని అవలంబించకూడదు. దౌర్జన్యపద్ధతులకు దిగితే తాత్కాలికంగా మనకు కొంతలాభం కలిగేమాట వాస్తవం. కాని ఆ తాత్కాలిక లాభంకోసం – ఆ తాత్కాలిక ప్రయోజనంకోసం – మన ఆత్మను పోగొట్టుకోగూడదు. దొరికిన దాంతో సంతృప్తిపడండి!... ఇంతా చేస్తే మనది జానెడు పొట్ట. తింటానికి, అనుభవించడానికి మితమెక్కడుంది ?... మనుష్యజన్మ ఎత్తినందుకు మీ ధర్మం మీరు నిర్వర్తించండి!... కర్మచెయ్యండి!... ఫలితాన్ని భగవంతుడికి వదిలిపెట్టెయ్యండి!... నారు పోసినవాడు నీరుపోయకండా వదలడు," అన్నాడు కేసన – తన వాగ్ధోరణిలో.

"మా అయ్యకు దేవుడిపిచ్చి బాగా పట్టుకుంది. దేవుడుగుళ్లో మొన్న జరిగింది చూచాకకూడా ఆయనకు జ్ఞానోదయం కలగలా. నేనొకటడుగుతా – దేవుడు, దేవుడు అంటూ కూచుంటే తిండి మనముందరికొస్తుందా ?... రాత్రి

దేవుళ్లకు పూజలు, పునస్కారాలుచేస్తే మన కడుపు నిండు తుందా?... ఇంతకూ దేవుణ్ణి చూసినవాళ్లు మనకెవ్వరూ కనపడడంలా – కనపడని దేవుడి పేరెత్తడం మనల్ని మనం మోసపుచ్చుకొన్నట్లవుతుంది: మన అశక్తతను తెలియ పరుచుకొన్నట్లు అవుతుంది. ఇంతకూ సర్వసముడైన దేవుడుంటే కొందరు భాగ్యాలతో కులకడం, కొందరు మలమలమాడి చావడం ఎందుకు జరుగుతుంది?... కొందరు మేడల్లో ఉండ టం, కొందరు పూరిగుడిసెల్లో అల్లల్లాడటం ఎందుకు సంభ విస్తుంది?... పుట్టేటప్పుడు తనవెంట ఎవరయినా ఏదైనా తీసుకొస్తున్నారా? చచ్చేటప్పుడు ఎవ్వరైనా తనవెంట ఏదైనా తీసుకుపోతున్నారా? లేదు. అందుచేత యిక్కడున్న ప్రకృతి సంపద నంతా మనం అభివృద్ధి నొందిద్దాం. ఎవరికి కావలసింది వాళ్లు చక్కగా అనుభవిద్దాం. మీరంతా కూలినాలి చేసే జనం. మీరు లేకపోతే ఏ పైరూ పండదు: ఏ యిల్లూ లేవదు. మీ కూలికిదగ్గ ప్రతిఫలం అందుచేత తప్పకండా ముట్టాలి. ఉన్నవాడి దయాదాక్షిణ్యాలమీద మనం ఆధార పడ్డామంటే వాడు మన రక్తం జుర్రడానికే ప్రయత్నిస్తాడు గాని – మన బాగోగులు చూడడు. మీకు రావలసిందేదో మీరు రాబట్టుకోవాలి. అక్కడ పెడ్తావా లేదా అంటేగాని అవతలివాడు పెట్టడు. దేవుడు మనల్ని యిల్లా పుట్టించా డంటూ ధర్మపన్నాలు వల్లెవేసుకుకూచుంటే మన పొయ్యిలో పిల్లి లేవదు. 'దేవుడు' 'ధర్మం' అంటూ అవతలివాళ్లు మనలోని శక్తి విజృంభించకండా అరికట్టడానికి ప్రయత్నిస్తారు. వాళ్ల

ఆటల్ని మనం సాగనివ్వకూడదు. ముందు 'భుక్తి, తరవాత ముక్తి' అని నా వాదం...... అరుగో అటుచూడండి!... పెళ్లాంబిడ్డలతో మీరు మలమలమాడి చస్తూంటే మన గ్రామ పెద్దలు 'బేవ్' 'బేవ్' మంటూ పొట్టలు నిమురుకుంటూ - గ్రామమండపానికి ఎట్లా పోతున్నారో!......" అంది మొల్ల ఆవేశంతో.

అక్కడున్నవాళ్ళంతా తిరిగి చూచారు. గ్రామమండపానికి పోతున్న శరభరాజు, బొజ్జయ్యచెట్టి, సుబ్బారెడ్డి వాళ్లకు అగపడ్డారు. మాలమాదిగల ఆవేశానికి పట్టపగ్గాలు లేకుండాపోయాయి. "చూడండ్రా - పొట్టలు బలిసినోళ్లు ఎట్లా పోతున్నారో," అన్నాడొకడు. "ఒసికబ్బలు తీసుకులేవండ్రా - యింకా చూస్తారేం ?" అన్నాడింకోడు. "వీళ్లకొకసారి మన తడాఖా చూపెడ్తేగాని తెలిసిరాదు," అన్నాడు మరొకడు. "ఈ అయిదుగురిని కట్టగట్టి గంగలోపడేస్తే మన ఊరి పీడ వదులుతుంది," అన్నాడు యింకోడు. అందరూ గొల్లున నవ్వి, వాళ్ళను అపహాస్యంచేశారు.

బొజ్జయ్యచెట్టి, శరభరాజు, సుబ్బారెడ్డికి ప్రాణాల్లో ప్రాణాలు లేవు. ఒక్కసారి వాళ్లను ఉరిమిఉరిమిచూసి - చల్లగా వెళ్లిపోయారు. ఇంకా అక్కడుంటే తమవీపులు రండోళ్లమోతలు మోగుతాయని వాళ్ళకు తెలుసు.

కేసన యీ సంఘటనకు చాలా విషాదం చెందాడు. వాళ్లు అధికారరీత్యా గ్రామపెద్దలని - వాళ్లను అవమానించడం తమను తామే అవమానించుకోవడమవుతుందని -

అధికార్లను, పెద్దల్ని తృణీకరించగూడదని - శాసనాలను, ధర్మాలను మనం గౌరవించాలని - కేసన వాళ్ళకు విశద పరిచాడు. స్వార్థపరులైనవాళ్ళను - పెద్దలనే పేరుతో అసభ్య కృతులను చేసేవాళ్ళను అపహాస్యానికి పాలుచేయడంలో తప్పేంలేదని - దేవుడు అనేవాడుగనక ఉంటే అది హర్షించ కండాపోడని - అంది మొల్ల. మాలమాదిగల్లోని కుట్టి కారంతా మొల్లమ్మ చెప్పింది బాగుందంటూ కేకలేశారు. గాలి ఎల్లావీస్తుందో తెలుసుకున్న కేసన ఒక్కచిరునవ్వు నవ్వాడు.

పోలిగాడు, రత్తయ్య మొదలయిన పెద్దలంతా కేసనదగ్గిర సెలవు దీసుకొని వెళ్లిపోయారు. వాళ్ల వెనక కుట్టికారు పోయింది. "భక్తి ముందు- ముక్తి వెనక" అంటాడు ఆ కుట్టికారులో ఒకడు - పోతూపోతూ.

ఆవేశపరులైన మాల మాదిగల్ని చూసి భయపడి పోయిన శరభరాజు, బొట్టియ్యశెట్టి, సుబ్బారెడ్డి యిప్పుడు గ్రామమండపానికి జేరారు. ఆరడుగులు ఎత్తుగల ఒక పెద్దఅరుగు - బలిష్ఠమైన నాలుగు స్తంభాలు - పైన రాతికప్పు- యివీ ఆమంటపం యొక్క లక్షణాలు. గ్రామాధికారుల కార్యాలయంకూడా దానికి దగ్గిరగానే ఉంది. మండపంలో వెనకభాగాన ధర్మచక్రం చిత్రించబడుంది.

రామాచారి అగ్రహారీకుని హోదాతో - పంచా యతీపెద్ద హోదాతో - ఆ మంటపంలో కూర్చునేగోపవరం లోని వివాదాలన్నీ అధికార పూర్వకంగా పరిష్కరిస్తుంటాడు.

ఆయన కూర్చునే ఆసనం వెనకాలే ధర్మచక్రపు చిత్తరువు ఉందన్నమాట.

శరభరాజు, సుబ్బారెడ్డి, బొజ్జయ్యచెట్టి వచ్చేసరికే రామాచారి అవధాని అక్కడ చేరారు. వాళ్లిద్దరూ బసవేశ్వరుని ఉద్యమంయొక్క ఉధృతాన్ని గురించి మాట్లాడుకుంటున్నారు. ఇప్పుడు పంచాయతీ పెద్దలందరూ అక్కడ సమావేశమయ్యారు. కేసన, మొల్ల ఉద్బోధను విని మాల మాదిగలు తమను ఎల్లా గేలిచేసింది – ఆఖరుకు కొట్టడానికి ఎల్లాసిద్ధమయిందీ – ఆచారిని, అవధానిని ఎల్లా దుర్భాషలాడింది – శరభరాజు ఆచారికి నివేదించాడు. మొత్తానికి కేసన, మొల్ల ఊళ్లో పెద్దసంక్షోభం లేవదీసే టట్టుగా ఉన్నారంటాడు అవధాని.

"అవును. మీకు నేను యిదివరకే చెప్పాను. ఇదంతా బసవేశ్వరోద్యమంయొక్క రభస. తానొక మహాకవినని – తక్కువజాతివాళ్లు, ముఖ్యంగా మాలమాదిగలు తన వెనకాల ఉన్నారని అనుకుంటున్నాడు కేసన. పైకి శాంతం శాంతం అంటూ వాడే తన కూతుర్ని యిల్లా మనపైకి ఉసికొలుపు తున్నాడు. మొత్తానికి మన అగ్రహారంలో పుండుబుట్టింది. అధికారరీత్యా కేసనను, మొల్లను అణిచివెయ్యడం నాకొక పెద్దపనిగాదు. ఇట్టే హంపీకి వ్రాశానంటే అట్టేవచ్చిపడతారు రాజభటులు. అయినా ఎందు కంతదూరం పోవడమని చూస్తున్నా. వాళ్లతాడుతో వాళ్లే కంఠానికి ఉరిసేసుకో డానికి కాలవ్యవధి నిస్తున్నా," అన్నాడు ఆచారి గంభీరంగా.

తనకు అనుజ్ఞయిస్తే - కేసనమాటలు వినే మాల మాదిగల నందర్నీ జుట్టుపట్టుకు యీడ్చుకొచ్చి - ఆయన కాళ్లముందుపడేట్టుగా చేస్తానని కనకయ్య ఆచారితో బీరాలు పలికాడు. "దండం దశగుణం భవేత్!... నలుగురికి నాలుగు తాపులు తగిలితేగాని తక్కినవాళ్ళకు బుద్ధిరాదు. నా మటుకు నాకు యిదే మంచిపనిగా తోస్తూంది," అన్నాడు శరభరాజు - తన బుఱ్ఱమీసాలు మెలిబెట్టుకుంటూ. ముక్కుపోగు సుబ్బారెడ్డి కూడా తనదీ అదే అభిప్రాయమన్నట్లు తలకాయ ఊపాడు.

బొజ్జయ్యచెట్టి కోమటిబిడ్డవడంచేత దెబ్బలాట కార్యక్రమానికి విముఖతను చూపాడు. అతని లావాదేవీలన్నీ కూలినాలిజనంతోనే ఉన్నాయి. లౌకికుడు, యుక్తిపరుడు, కుశాగ్రబుద్ధి అయిన అవధాని "మనం తొందరపడి ప్రయోజనం లేదు," అంటూ హెచ్చరించాడు.

"మీరు చెప్పినట్టు అలగాజాతివాళ్లందర్నీ - ముఖ్యంగా మాలమాదిగల్ని - తమ పెద్దరికంకిందికి తీసుకొచ్చుకోడానికి కేసన, మొల్ల మొత్తానికి గుట్టుచప్పుడుగాకండా పెద్దపథకాలు వేస్తున్నారు. మాలమాదిగలు సుతిమెత్తని పదార్థాలు. నిప్పులాగా యిల్లాముట్టిస్తే రగుల్కొనిపొయ్యే సరుకు అది. వాళ్లతో మనం ప్రత్యక్షంగా పేచీకి దిగి, వాళ్లను రెచ్చగొట్టామంటే అగ్రహారపు పొలాలన్నీ బీళ్లుబడి ఊరుకుంటాయి. ఉపాయం చేత ఎల్లాగయినా వాళ్లను మనపక్కకు లాక్కోవాలి. పంచాయతీపట్టాన పెద్దలమయిన మనం యీ అలగాజాతికి

వినోదాలు, కాలక్షేపాలు ఏర్పాటుచేద్దాం. దాంతో వాళ్లకు మనపట్ల గౌరవప్రపత్తులు హెచ్చుతాయి. కనకయ్య ప్రతిపాదించిన దండ ప్రయోగసాధనం యిప్పుడు లాభంలేదు. అది అమలుజరిపేందుకు అదను యిదిగాదు. సామ, దాన, భేదోపాయాలచేతనే వాళ్లను మనం కేసన, మొల్ల నుంచి విడదియ్యాలి. వాళ్ల తోకల్ని కోసేందుకు సరియైన కార్యక్రమం యిదేనని నాకు తోస్తూంది," అన్నాడు అవధాని – తన లౌకికజ్ఞానాన్ని బహిర్గతం చేస్తూ.

సాక్షిగా పౌర్యోరకం బొజ్జయ్యచెట్టి అవధానితో సంపూర్ణంగా ఏకీభవించాడు.

"మాలమాదిగల సమక్షంలో రంగనాయకి నృత్యం ఏర్పాటుచేస్తే బలేబాగుంటుంది," అన్నాడు బొజ్జయ్యచెట్టి – లొట్టలేస్తూ.

"రంగనాయకి భరతనాట్యాన్ని అర్థంచేసుకునేటంత తెలివి వాళ్ళదగ్గిరేమేడ్సింది!... వీధిభాగోతం, హరికథ, తోలుబొమ్మలాట – యిల్లాంటి వేర్పాటుచేస్తే వెధవలు చంక లెగరేస్తూ చూస్తారు," అన్నాడు ఆచారి – దూరదృష్టితో.

"నాకు బుఱ్ఱకథంటే చెడ్డయిష్టం. అదిగూడా మన వినోదకార్యక్రమాల్లో జేర్చండి," అన్నాడు సుబ్బారెడ్డి – మెల్లిగా.

బుఱ్ఱకథ పేరుచెప్పడంతో బసవేశ్వరుడు అగుపించాడు ఆచారికి – ఆయన మానసవీధిలో. శైవమతానికి సంబంధించిన జంగాలు యీ బుఱ్ఱకథలమూలాన విస్తవాన్ని

రేకెత్తిస్తున్నారని ఆచారి ఊహ. "అది మరొకసారి చూద్దాంలే," అన్నాడు ఆచారి. వైష్ణవమతప్రచారానికి దోహదమిచ్చే కార్యక్రమాన్ని ఏర్పాటుచేయాలనే యిప్పుడు ఆచారి సంకల్పం.

మరి యీ వినోదాలకు, కాలక్షేపాలకు కావలసిన డబ్బు, దస్కం బొజ్జయ్యచెట్టే భరించాలనుంటుందని అవధాని ఒక విసురువిసిరాడు. దాంతో బొజ్జయ్యచెట్టి ఉలిక్కి పడ్డాడు. "నా దగ్గిరేముందిబాబూ !... లాభాలు గూబల్లోకి దిగాయి. రావలసిన బాకీలకు అంతా ఎగనామాలు బెడ్తున్నారు," అంటూ వెనక్కు తగ్గాడు బొజ్జయ్యచెట్టి.

మీరెవ్వరూ డబ్బు ఖర్చు బెట్టక్కర్లేదు. మనపాలిట కల్పవృక్షం, కామధేనువు రామాచారిగారే యీ వినోద, కాలక్షేపాలను తనడబ్బుతో నిర్వహిస్తారు," అంటూ అవధాని ఆచారిని ఉబ్బగొట్టాడు. అల్లాగే నంటూ సిద్ధపడ్డాడు ఆచారి.

శ్రీరామనవమిపండుగ సందర్భంలో మూడురాత్రిళ్లు వినోదా లేర్పాటుచేయడానికి ఆ పెద్దలందరూ ఏకగ్రీవంగా తీర్మానించారు. అందరూకలిసి బుజ్జిమీసాల శరభరాజుకు యీ విషయంలో కట్టుపెత్తనం ఒప్పగించారు.

మూడురాత్రిళ్ళ కార్యక్రమాలకు సర్వసన్నాహాలు గావింపబడ్డాయి. మాలమాదిగలు తప్పెట్లువాయించినందుకు కూలియివ్వడానికి విముఖత చూపెట్టిన ఆచారి - వాళ్ళకు కూలిగింజల్ని కొలిచియివ్వడానికి వెనకడుగువేసిన ఆచారి -

వాళ్లను తన పాదాక్రాంతులుగా చేసుకోవడంకోసం యీ కార్య క్రమాలకు తన సొంతడబ్బు తగలేశాడు. గోరుగిల్లుతో పోయే వ్యవహారానికి ఆచారి గొడ్డలిపెట్టు పెట్టాడు. భాగోతులు, హరిదాసు, తోలుబొమ్మలాటగాళ్లు – అందరూ ఊళ్ళోదిగారు.

గ్రామమండపందగ్గిరే వినోదకార్యక్రమాలు ఏర్పాటు గావింపబడ్డాయి. ఆనాటిరాత్రి గ్రామపెద్దలు నలుగురు చక్కగా ముస్తాబై – ఆచారి ఆధిపత్యంకింద – అందరికీ కనపడేటట్టు – మండపంలో ఆసీనులయ్యారు.

కులాలవారీగా, లింగభేదాలవారీగా అందరూ వీధిభాగోతం చూడడానికి అక్కడ కూర్చున్నారు.

మాలమాదిగలు మటుకు అగ్రజాతులవాళ్లకు చాలా దూరాన ఉన్నారు. కేసనకూడా వాళ్లమధ్యనే కూచుండి పోయాడు. ఆయన పక్కగా పోలిగా డున్నాడు. కేసన వాళ్లతో గలిసి కూచోడం ఆచారి, అవధానులు ప్రత్యేకంగా గమనింపక పోలేదు.

ఎక్కడో ఏకాకిగా కూచుంది మొల్ల. దగ్గరగా ఉన్న చెట్టుమీదికెక్కి తిక్కన – మొల్లచూపులు తనమీద పడడం కోసం – ఒక లేట అల్లరి సాగించాడు.

ప్రాచీనసాంప్రదాయపూర్వకంగా వీధిభాగోతం ప్రారంభ మయింది. తాళాలు వాయించుకొంటూ వంతపాటగాళ్లిద్దరూ 'తాండవనృత్యకరి' కీర్తనతో ఆట మొదలెట్టారు. ముఖ్య పాత్రధారుడు హిరణ్యకశిపుడికి మరుగ్గా కట్టబడ్డ తెర అనే చీర తొలగిపోయింది. ఒకచేత్తో చేతిరుమాల, మరొకచేత్తో

మొండికత్తి పుచ్చుకొని హిరణ్యకశిపుడు ముందుకొచ్చాడు. తను ఎవరైందీ తనకు తానే చెప్పుకొని - భూమి దద్దరిల్లేటట్లు గంతులేశాడు. అలిసిపోయాక ఆగిపోయి ఆయన ప్రహ్లాదుణ్ణి, లీలావతిని తన సమక్షంలోకి తీసుకురమ్మని రాజభటుల్ని పంపాడు. వాళ్లువెళ్లి తల్లీ, కొడుకుల్ని తీసుకొచ్చారు. 'హేనాథా' అంటూ లీలావతి భర్తకు నమస్కరించింది. "హేతండ్రీ!' అంటూ ప్రహ్లాదుడు తండ్రికి దండంపెట్టాడు. కొడుకును అదుపాజ్ఞల్లో పెట్టనందుకు పద్యాలరూపంలో హిరణ్యకశిపుడు లీలావతిని నాలుగుతిట్టాడు. ఆవిడ గుడ్లనీరు గుడ్లకుక్కుకొని ఒకపాటద్వారా తనశోకాన్ని వెళ్లగక్కింది. 'పో పొమ్మ'న్నాడు ఆమెను హిరణ్యకశిపుడు. చీమిడిచీదు కుంటూ ఆవిడ లోపలికి వెళ్లిపోయింది. ఇక హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి పట్టుకున్నాడు. "దేవుడు - దేవుడంటావు - ఎప్పు డూను - ఎవడ్రా ఆ దేవుడు - ఎక్కడున్నాడు ?" అంటూ హుంకరిస్తాడు హిరణ్యకశిపుడు. 'ఇందుగల డందులేడను' పద్యం సాంప్రదాయసిద్ధంగా చదువుతాడు ప్రహ్లాదుడు. ఆఖరుకు హిరణ్యకశిపుడు అక్కడపడేసున్న కాగితపుగదతో కాగితపు స్థంభాన్ని వ్రయ్యలుచేస్తాడు. శ్రీమహావిష్ణువు, నారసింహరూపంలో అగపడి - హిరణ్యకశిపుణ్ణి చీల్చి చెండాడి - ఆయన పేగుల్ని మెడ కేసుకొని - రక్తం జుర్రేస్తాడు. నిజంగా అది భయానక, భీభత్స రసప్రధానమయిన ఘట్టం. సభాసదుల్లో వయసుమళ్లిన అయ్యలు, అమ్మలు

'నమో నారాయణా' అంటూ నరసింహావతారానికి చేయెత్తి దండంబెట్టారు.

భాగోతం అయిపోయేసరికి భళ్లున తెల్లవారింది. ఉన్న వాళ్ళంతా యింటికిపోయి – సుష్టుగా భోంచేసి – పగలంతా నిద్రపోయారు. లేనివాళ్ళంతా – పొట్టతిప్పలకోసం – పంచెలు పైనేసుకొని అక్కడనుంచే పనుల్లోకి వెళ్లిపోయారు.

రెండోరోజురాత్రి అప్పలదాసుగారు రామాయణ మంతా హరికథారూపంలో చెప్పారు. జుట్టుముడికి మల్లె పూలదండల్ని కట్టుకొని – మెడనిండా పూలదండలు ధరించి – నాట్యమాడుతూ – చిరుతలువాయిస్తూ – అప్పలదాసుగారు హరికథ చెబుతూంటే మొత్తానికి చాలమంది ఆ రాత్రి కునికి పాట్లుబడ్డారు. 'అప్పలదాసుగారి కోకిలకంఠం యీనాడు ఎందుకో దెబ్బతింది,' అన్నాడొకడు సదస్యుల్లో. 'బహుశా యీన అప్పలదాసుగారి భక్తాంఘ్రిరేణువు అయిఉండాలి,' అన్నాడు మరొకాయన – ఎగతాళిపూర్వకంగా. ✓

తోలుబొమ్మలవాళ్ళు మూడోరోజు 'విరాటపర్వం' ప్రదర్శించారు. వీధిభాగోతంకంటె, హరికథకంటె యిది బాగా రక్తిగట్టిందన్నారు అందరూను. కిన్నెరకంఠంతో ఒకఆవిడ ఆ రాత్రంతా పాడిందిపాడినట్టుగానేఉంది. ఎంతపాడినా ఆవిడ గొంతు ఎక్కడా బొంగురుపోలా.

కేతిగాడు, బంగారక్క, పోలిగాడు మొత్తానికి అందర్నీ గొల్లున నవ్వించారు. వీళ్ళకు సంబంధించిన ఘట్టాలే

మంచి రసపట్టులో పడ్డాయన్నారు అందరూ ఏకగ్రీవంగా. మగ వాళ్ళకంటే ఆడవాళ్ళే తోలుబొమ్మలాటగాళ్ళని బాగా మెచ్చుకున్నారు.

మంగళహారతితో తోలుబొమ్మలాట ముగిసింది. రసానుభూతిని పొందిన జనమంతా లేచి వెళ్ళబోతున్నారు.

"అందరూ దయచేసి కూర్చోవాలి!... మహాపండితులు, వేదశాస్త్రపారంగతులు, అగ్రహారికులు, పూజ్యులు, మనపెద్దలు అయిన రామాచారిగారు యీ మూడురోజులు వినోదకాలక్షేపాలను ఏర్పాటుచేసిన విషయం మీ కందరికీ తెలిసిందే !... నేను వేరే చెప్పనక్కర్లేదు. నిజంగా మన ఊరు నిత్యకల్యాణం, పచ్చతోరణంగా వెలుగొందుతుందీ అంటే భగవదంశసంభూతుడైన రామాచారిగారే కారణమని మీరందరూ ఒప్పుకోవాలి," అన్నాడు అవధాని.

బొజ్జయ్యచెట్టి, శరభరాజు, సుబ్బారెడ్డి, కనకయ్యలు 'అవును – అవును' అంటూ పొలికేకలు బెట్టారు.

"ఏమిటయ్యా – అవును ! మీరంతా యీఅగ్రహారానికి చేసినసేవ ఏమిటని నే నడుగుతున్నా !... చెరువులుగాని, బావులుగాని ఏమైనా మరమ్మతుచేయించిన పాపాన పొయ్యారా ? బాటలేమైనా బాగుచేయించారా ? రోగులకేమైనా వైద్యాలయాలు స్థాపించారా ? మాలమాదిగలకు చేసినచాకిరీకి సవ్యంగా కూలిగింజలు కొలిపించి యిచ్చారా? ఆఖరుకు శ్రీరామదేవాలయం గోడలు పడిపోతూంటే– వాటిని బాగుచేయించటానికేమైనా ప్రయత్నం చేశారా ?"...

అంటూ ఒకమనిషి దూరాన్నుంచి ప్రశ్నించింది. అందరూ అటువైపు తిరిగిచూచారు. ఆమె మొల్ల అని అందరూ తెలుసుకొన్నారు. మాలమాదిగల్లోని కుఱ్ఱవాళ్ళంతా ఆవిడ మాటలకు యీలలువేసి చప్పట్లుకొట్టారు.

ఆచారి ఆగ్రహావేశుడయ్యాడు. అవధాని తోక తొక్కిన తాచులాగా మండిపడ్డాడు. కనకయ్య ఉగ్రుడయ్యాడు. కేసన విచారగ్రస్తుడయ్యాడు. మొత్తానికి అక్కడ జేరిన జనంలో మొల్లవేసిన ప్రశ్నలు సమంజసమైనవేనన్న భావనతో గూడుకొన్నవాళ్లు సగానికిపైగా లేకపోలేదు.

"ఏమిటే – కుఱ్ఱముండా – వాగుతున్నావ్ ? చూస్తావేంట్రా కనకయ్యా – జుట్టుపట్టుకు నాలుగుతన్నక ?..." అన్నాడు రౌద్రాకారుడై అవధాని.

కఱ్ఱతీసుకొని కనకయ్య, మొల్లవైపు నడిచాడు. "కొట్టు ఏమాత్రం కొడతావో !" అంటూ ఆ పిల్లే కనకయ్యను సమీపించింది. "ఆపిల్లమీద చెయ్యిబడ్డదీ అంటే ఊర్కొనేది లేదు," అంటూ మాలమాదిగల్లో చాలామంది లేచారు – కఱ్ఱలు తీసుకొని. వ్యవహారం ముదిరిపోయిందని తెలుసుకున్న కేసన కూతురుకు అడ్డుపోయాడు. ఒక విధమైన కలకలం ఆ జనసమూహంలో పుట్టింది.

మొల్లను బట్టుకొని – కేసనను ఒక పక్కకు తోసి – తనను సమీపిస్తున్న మాల, మాదిగల్ని కఱ్ఱతో బెదిరిస్తూ – కనకయ్య ఆచారి దగ్గిరకు ఆపిల్ల నీడ్చుకొచ్చాడు. "ఊర్కొ

బావా - ఊర్కో-బావా," అంటూ కేసన కనకయ్యను వెంటాడాడు. తిక్కన యీదృశ్యాన్ని చూసి భోరునవడ్చాడు.

మొత్తానికి వ్యవహారం ముదిరిందని - మాలమాదిగలు కట్టెలతో తమను మోదడం ఖాయమని - భయపడ్డాడు ఆచారి.

"దాన్ని వదలరా కనకయ్యా," అంటూ అరిచాడు ఆచారి. కనకయ్య మొల్లను వదిలేశాడు. మాలమాదిగలు ఆగారు.

"ఏమిట్రా కేసనా ఏమిటి!... యిది మరీ పెచ్చుమీరి పోతూంది!... దీన్నేమైనా అదుపుఆజ్ఞల్లో పెడతావా - లేక పోతే - హంపీ నుంచి రాజభటుల్ని తెప్పించి తల చితక బాదిపించమన్నావా?" అడిగాడు ఆచారి ఉగ్రుడై.

విషాదపూరితుడైన కేసన 'క్షమించండి బాబూ' అంటూ ఆచారిని ప్రాధేయపడ్డాడు. "దానికి ఏంమాట్లాడాలో - ఎప్పుడు మాట్లాడాలో తెలియదు," అన్నాడు కేసన.

"తెలియదేమిట్రా - ముడ్డికిందికి పదహారేళ్లొచ్చాయి!... నీముఖంచూసి దాన్ని యివాళకు వదిలిపెడుతున్నా. నామాట విని దాన్ని తొందరగా ఒకయింటిదాన్ని చెయ్యి! అచ్చు పోసిన ఆంబోతులాగా యిల్లా ఊరిమీద వదిలేస్తే ఎల్లా? పెళ్లయితే దాని తిక్క బాగా కుదురుతుంది. పిల్లలతల్లయితే గాని దానికి ప్రపంచ మేమిటో తెలిసిరాదు," అన్నాడు ఆచారి కేసనతో - రొప్పుతూ, రోజుతూ.

అవధానిగూడ ఆచారిని సమర్థించాడు. "దీని మాటలు విన్నారంటే చెడతారు చెప్తున్నా," అన్నాడు కనకయ్య - మాల, మాదిగల్ని చూసి బెదిరిస్తూ. "ఏమి టోయ్ నువ్వుచేసేది - పూర్వంలాగా కాదు - ఒళ్లుదగ్గిరబెట్టుకు మసులుకో," అన్నాడు మాలమాదిగల్లోని కుఱ్ఱకారులో ఒకడు. ప్రత్యక్షంగా మాలమాదిగల్లో కొందరు కనకయ్యకు ఎదురుతిరగడం యిదే మొదటిసారి. కనకయ్య గుండె మొత్తానికి బిక్కుబిక్కుమంది.

వ్యవహారం ముదరకండా ఆచారి కనకయ్యను కొద్దిగా మందలించాడు. దాంతో మాలమాదిగలుకూడా వెనక్కు తగ్గారు. అక్కడచేరిన ఆడవాళ్ళంతా మొల్లను ఒకశక్తి స్వరూపిణికింద జమకట్టారు. ఆచారిభార్య సీతమ్మ, దేవదాసి రంగనాయకి - మొల్ల సామాన్యమనిషికాదని గ్రహించారు.

"రా తల్లీ - రా," అంటూ కేసన - ఆవేశంతో అట్టుడికిపోతున్న తన ప్రియపుత్రిక మొల్లను, మాలమాది గల్ని వెంటబెట్టుకొని తనయింటికి పోయాడు.

మొత్తానికి గ్రామపెద్ద లేర్పరచిన మూడురోజుల కార్యక్రమం ఆఖరుకు యీ రభసకిందికి దిగింది. ఆచారి నిజంగా వ్యధపడ్డాడు. "మీ కెందుకు మీరు చూస్తూఉండండి. యీ మాలమాదిగల ఆటల్ని ఎట్లా కట్టిస్తానో!" అన్నాడు కనకయ్య ఆచారితో. గ్రామపెద్దలంతా నిద్రముఖాలతో తమతమ యిళ్లకు పోయారు.

---

## 2

తెల్లవారింది. గోపవరం అగ్రహారంమీద అరుణ కాంతులు ప్రసరించాయి.

మహాభక్తుడు కేసన శ్రీకంఠమల్లేశ్వరుని విగ్రహం ముందు కూర్చొని - తన విచారాన్ని వెళ్ళబోసుకున్నాడు. తన కూతురు మొల్లకు భక్తి, జ్ఞాన ప్రపత్తులను కలుగజేయమని ఆయన ఆ దేవుణ్ణి ప్రార్థించాడు. ఆకున అందని, పోకన బొందని జీవితాన్ని గడపకండా మొల్ల ఒక యింటిదైతే చూచే భాగ్యాన్ని తనకు కల్గించమని ఆయన దేవదేవుని వేడుకున్నాడు.

ఇంటిబయట ఎప్పటిలాగా మొల్ల రోటిమీద కూర్చొని శూన్యంలోకి చూస్తూంది. ఆవిడ వెనక దూరా నున్న శ్రీరామదేవాలయ గోపురం కనబడుతూంది. ఆపిల్ల ఉన్నతభావోపాసకురాలుగాని - అందరూ అనుకుంటున్నట్లు పిచ్చిపిల్లగాదని - ఎత్తయిన ఆగోపురం సూచిస్తుంది.

దేవునికి హారతిచ్చి - ప్రసాదంపళ్లెం చేతోబుచ్చు కొని - కేసన వంటయింట్లోకి వెళ్లిపోయాడు - అంబలి కుండను పొయ్యిమీదనుంచి కింద దించడానికి.

రోటిమీద కూర్చొని శూన్యంలోకి చూస్తున్న మొల్లకు వెనకనుంచి ఒక గీతం వినపడ్డది.

ఇంటింట పెళ్ళిళ్ళు జరగాలిరా !
అందరూ జంటలై తిరగాలిరా!
ఇంటింట...
తెలివితేటలు పెరిగి పెద్దకావాలంటె
కులగోత్రములు వృద్ధిపొంది నిలవాలంటె
ఇంటింట...
ఏటి కెదురీతగా, యేకాకి బ్రతుకుగా
చేటుతెచ్చే బ్రహ్మచర్యాన్ని తొలగించి
ఇంటింట...
ప్రణయహీనపుప్రకృతి ప్రళయాన్ని తెస్తుంది,
ప్రణయమెరుగని బ్రతుకు చస్తుంది - అందుకే
ఇంటింట...

—ఇల్లా పాడుతూ తన వెనక నక్కినవాడు తనబావ తిక్కనని సునాయాసంగా తెలుసుకుంది మొల్ల. తను చేస్తున్న గల్లంతుకు కదలకుండా కూర్చున్న మొల్లముందు యిప్పుడు సాక్షాత్కరించాడు తిక్కన.

"ఏమే పిల్లా! ఏమిటంటావ్?... ఆచారిగారు నిన్నేంచెప్పాడు!... నన్ను పెళ్ళాడతానంటావా లేదా? ఇవాళ ఐసా పైసా ఏదో తేలిపోవాలి. మా అయ్యగూడా యీ విషయం యివాళ అటో యిటో తేల్చుకురమ్మన్నాడు. నా మటుకు నాకు - పెళ్ళాడితే నిన్నే పెళ్ళాడాలనుంది. లేక పోతే యీ జన్మలో హనుమంతుడులాగా ఘోటకబ్రహ్మచారిగా ఉండిపోతా. ఊఁ - చెప్పుమరి," అంటూ తిక్కన

మొల్లను తొందరపెట్టాడు. ఇంట్లోనుంచి కేసన తిక్కన మాటల్ని విన్నాడు. మొల్లను తిక్కన కిచ్చి పెళ్లిచేసి – పితృధర్మాన్ని నెరవేర్చుకోవాలని ఆయన కోరిక. ఆ శుభదినం కోసం ఆయన వెయ్యికళ్ళతో కనిపెట్టుకు కూచున్నాడు.

తిక్కన తనముందు చూపెడుతున్న చేష్టలకు మొల్ల ఒక వెకిలినవ్వు నవ్వింది.

"అయితే – బావా – నీకు పెళ్లికావాలా– అట్లాగే!" అంది మొల్ల. ఆ మాటతో తిక్కన హనుమంతుడిలాగా ఎగిరి ఒక్క కుప్పిగంతు వేశాడు. అతని ఆనందానికి అంతు లేదు. ఆ పిల్లకోసం అతను పాపం ఎన్నోఏళ్ళబట్టి తలకిందు లుగా తపస్సు చేస్తున్నాడు.

ప్రసాదం పళ్ళెంతో బయటికొచ్చిన మామను చూచి, "మామా – నిజంగా యివాళ మంచిరోజు!... మొల్ల తిరిగి మన ప్రపంచంలో బడ్డది. ఇక దాన్నిగురించి నువ్వేం బెంగపెట్టుకోకు. మన గ్రామంలో గూడా అల్లరి, గొడవలు అట్లాంటివేమీ ఉండవు," అన్నాడు తిక్కన.

"అల్లాగే నాయనా! నువ్వు, అది ఒకటి గావడం కంటే నాకింకేం కావాలి?" అన్నాడు కేసన – అమాయకపు ఆనందంతో.

తన చేతిలోఉన్న ప్రసాదాన్ని కేసన తిక్కనకు, మొల్లకు పెట్టాడు. పెళ్ళిగాబోతున్న సంబరంలో తిక్కన ఆ ప్రసాదాన్ని మూడుసార్లు కళ్ళకద్దుకొని నోట్లో వేసుకున్నాడు.

ఎప్పటిమో స్తరుగా మొల్ల - దాన్ని కళ్ళకద్దుకోకండా - తినేసింది.

తండ్రి, బావలు తనపెళ్ళిని గురించి మాట్లాడుతూంటే మొల్ల ఛట్టునలేచి లోపలికి వెళ్ళిపోయింది.

"మామా - చూశావా ! పెళ్ళిపేరెత్తేసరికి మొల్లకు సిగ్గు ఎట్లా పుట్టుకొచ్చిందో !... నిజంగా నా మొల్లంత చక్కనిచుక్క - యీ లోకంలోగాదు - మూడులోకాల్లో లేదని ఢంకామీద దెబ్బగొట్టి చెప్తా. దాన్నిగురించి రాత్రిం బగళ్లు నేను కంటున్న కలలు ఆ పరమాత్ముడికే ఎరుక. 'ఉత్త నీ ఆర్భాటమేగాని అది నిన్ను జేసుకుంటుందిట్రా పిచ్చోడా' అంటాడు మా అయ్య ఎప్పుడూను. ఇప్పుడే వెళ్ళి యీ సంతోషవార్తను మా అయ్యకు చెప్పొస్తా," అన్నాడు తిక్కన - ఆనందం పట్టలేక.

లోపలినుంచి మొల్ల తన రెండుచేతులు వెనకాలెట్టు కొని వచ్చింది.

"ఏం తల్లీ ! బావను పెళ్లాడతానని అన్నావుటగా!... అంతకంటే నాకింకేంకావాలమ్మా!... ఆ మూడుముళ్లూ పడితే నేను ముక్కుమూసుకు కూచుంటా. ఆ రోజుకోసం ఆ శ్రీ కంఠమల్లేశుణ్ణి అహర్నిశలు ప్రార్థిస్తున్నానమ్మా!"... అన్నాడు అమాయకుడు కేసన.

మామా ! యిప్పుడేవెళ్లి నువ్వు మా అయ్యతో మాట్లాడి మంచిరోజు చూసి ముహూర్తం బెట్టెయ్యి !...

ఏమంటావే పిల్లా ? సిగ్గా !... చెప్పవ్," అన్నాడు తిక్కన అటు మామను, యిటు మొల్లను చూచి.

"ఎప్పటిదాకానో ఎందుకు ? - యీ నిమిషంలోనే ముహూర్తం!" అంటూ ఆ మోటుపిల్ల - కాలుతున్న గరిటెను వెనకనుంచి మెల్లగాతీసి - తిక్కన చేతిమీద చుఱ్ఱున అంటించింది. దాంతో ఆ పిచ్చాడు గొల్లున గోలెట్టి - బాధ కాగ లేక - గంతులెయ్యడం సాగించాడు.

కూతురుచేసిన పనికి నొచ్చుకొని కేసన- తిక్కనను బట్టుకొని - పుండుమీద మందేసి కట్టుకట్టడం కోసం - లోపలికి తీసుకెళ్లాడు. వాతయొక్క బాధకంటే జరిగిన పరాభవం భరించలేక తిక్కన - కాలుగాలిన పిల్లిలాగా - గంతులేస్తూ - కేసనయొక్క పట్టు తప్పించుకొని - ఒంటిమీద గుడ్డుందో లేదో కూడా తెలియకండా - పారిపోయాడు.

"ఏంపని చేశావు తల్లీ!" అంటూ కేసన మొల్లను వాత్సల్యపూర్వకంగా అదిలించాడు.

"వాణ్ణి ఊర్కే పరీక్షచేశానయ్యా!... ఈ కాస్త బాధకే ఓర్చుకోలేకపోతే - రేపు పెళ్లయ్యాక - కుటుంబ బాధకేం ఓర్చుకోగలడు ?'' అంది మొల్ల - వికటంగా నవ్వుతూ.

జరిగిన పనికి ఎంతగానో విచారంచెంది కేసన - తన బావ కనకయ్యకు క్షమాపణ చెప్పుకొనడానికి - ఆయనింటికి వెళ్లాడు.

ఇంతలోనే పోలిగాడు రొప్పుతూ, రోజుతూ పరుగెత్తు కొచ్చి 'అయ్యా ఎక్కడమ్మా' అంటూ మొల్ల నడిగాడు. అతని గాభరా చూచి మొల్లకుకూడా భయం బుట్టింది. సంగతేమిటని అడిగింది.

"మా మాలపల్లి తగలబడిపోతున్నదమ్మా!... ఆచారి అవధాన్ల ప్రోద్బలంతో కనకయ్యే యీ పని చేశాడని మా వాళ్లంతా చెప్పుకుంటున్నారు," అంటూ పోలిగాడు భోరున ఏడిచాడు.

"అయితే పద – నేనొస్తా," అంటూ మొల్ల ముందు పరుగెత్తింది. కేసనజాడ తెలియని పోలిగాడుకూడా మాలపల్లివైపుకే పరుగెత్తుకుపోయాడు.

క్షమాపణ చెప్పుకోవడాని కొచ్చిన కేసనను బట్టు కొని కనకయ్య యిష్టమొచ్చినట్లు తిట్టేశాడు. "మాల మాదిగల్తో తిరుగుతూ – గ్రామపెద్దల కోపానికి గురవుతూ – కుమ్మరికులానికి కళంకం తీసుకొచ్చావు నువ్వు!... పైకి ఏం తెలియనట్లు నటిస్తూ నీ కూతురుచేత నా కొడుక్కు – వాతబెట్టించావు!... దీనికి తగ్గ ప్రతిఫలం నువ్వు త్వరలోనే అనుభవిస్తావు చూస్కో!..." అన్నాడు కనకయ్య – కుమిలి పోతున్న హృదయంతో. కేసన మాటల్ని ఆయన వినిపించు కోవడంలేదు.

'మాలపల్లికి నిప్పంటుకుంది' అంటూ కనకయ్య యింటిముందుగా జనం పరుగెత్తుతున్నారు. ఆ జనాన్ని చూచాడు కేసన. మాలపల్లివైపుచూస్తే ఆకాశానికి ఎగసిన

మంటలు ఆయనకు అగపడ్డాయి. వెంటనే ఆయన మాలపల్లి వైపుకు పరుగెత్తాడు. తనచేత్తో తనే మాలపల్లికి నిప్పంటించిన కనకయ్య - ఆ మంటల్నిచూసి - వికటాట్టహాసంగా నవ్వాడు.

కేసన మాలపల్లికి జేరుకొనేసరికి మొల్ల - మంటల్లో దూకి - పిల్లల్ని, పెద్దల్ని, గొడ్డుగోదల్ని - అందర్ని బయటికి తీసుకొస్తూంది. ఆమె చూపెడ్తున్న సాహసం యింతాఅంతా గాదు. పిల్లలకోసం తల్లులు, తల్లులకోసం పిల్లలు చేస్తున్న ఆర్తనాదాలు భూమ్యాకాశాలు నిండిపోతున్నాయి. కేసన గూడా పోలిగాడుతో చేరి మంటలార్పడానికి సహాయ పడ్డాడు. ఎన్నిబిందెల నీళ్లుపోసిన ఆమంట లెక్కడా తగ్గడం లేదు. అగ్నిదేవుడక్కడ వీరవిహారం చేస్తున్నాడా అనిపించింది...

ఝాముసేపట్లో మాలపల్లి సాంతం యింత బూడిదిగా రూపాంతరాన్ని పొందింది. ప్రాణాలతో, కట్టుగుడ్డల్తో, చేతికందిన చెంబుతప్పాలాల్తో బయటపడ్డ జనమంతా అక్కడున్న మర్రి చెట్టుకిందికి జేరింది. ఆమంటల్లో ఆచారి, అవధాని, కనకయ్యల స్వరూపాలు ఆ జనానికి అగపడ్డాయి. అట్టుడికిపోతున్నట్లు ఉడికిపోతున్నారు మాలమాదిగలంతా. కేసన తన ఆధ్యాత్మిక దృష్టితో వాళ్లకు కోపోపశమనం కల్గించడానికి ప్రయత్నించాడు.

"ఇదంతా మనకర్మ అనుకోవాలి. ఇంతకంటె మనం చేయవలసింది - చేయగలిగింది ఏంలేదు. ఏపాపం తెలియని మిమ్మల్నందరినీ యీవిధంగా హింసపెట్టినవాళ్లు తమతో ఏంకట్టుకుపోరు. ఇవాళగాకపోతే రేపయినా తమతప్పుకు

తాము పశ్చాత్తాపపడకండాపోరు. మీ హృదయాలు ఎల్లా క్షోభిస్తున్నాయో నాకు తెలుసు. ఈ ఉద్రేకపరిస్థితుల్లో మీరు ఏమాత్రం మనస్సు చెడగొట్టుకోవద్దు. ఎవ్వరినీ మీరుతిట్టొద్దు. ఎవరిపట్ల ద్వేషభావం చూపెట్టొద్దు. నాతో రండి! మాయింట్లోఉన్న గింజలతో మీకుఅంబలిగాచిపోస్తా. మీరంతా యివాళ మాయింట్లోనే తలదాచుకోండి. ఉన్న దాంట్లోనే మనం సంతృప్తిపడదాం," అంటూ కేసన వాళ్లకు హితోపదేశం చేశాడు.

ఇళ్లు కాలి ఏడుస్తున్న మాలమాదిగలకు – రేపనేది ఎల్లా గడుస్తుందా అని మొత్తుకుంటున్న ఆ కూలిజనానికి – కర్మసిద్ధాంతాన్నిగూర్చి తండ్రి చెబుతూంటే మొల్లకు కోపం ఎక్కడా ఆగడంలేదు. ఆమె కళ్ళు ఎఱ్ఱబారాయి. మహాశక్తి లాగా రూపుదాల్చిందా పిల్ల.

"మీరంతా మా అయ్య మాటవింటే యీ జన్మలో బాగుపడరు. రండి! – నాతో రండి!... మిమ్మల్ని యింత క్షోభపెట్టిన కనకయ్య, ఆచారి, అవధాన్ల పని బట్టిద్దాం. ఒకసారి మీ బలమేమిటో చూపెడ్తేతప్ప వాళ్ళు కాళ్ళ బేరానికి రారు. 'దేవుడే దిక్కు – యిదంతా మా కర్మ' అంటూకూర్చుంటే మీకు, మీ పిల్లలకు తిండి ఎక్కడనుంచొ స్తుంది?... మా అయ్య యివాళ పెట్టగలడు – రేపుపెట్ట గలడు – ఎల్లుండెక్కడనుంచి తీసుకొచ్చిపెడతాడు?... మళ్లీ జోలె, మీరు తయారుగావలసిందేగా!... నామాట విని అందరూ లేవండి!... నాతో రండి!... నేనే మీకు

దారిచూపెడ్తా!," అంటూ ఆవేశపూరితులైన వాళ్ళ రక్తాన్ని వేడెక్కించింది మొల్ల.

పోలిగాడు, రత్తయ్య మొదలయిన ఏ పదిమంది తల నెరిసినవాళ్ళకోతప్ప తక్కినవాళ్ళకు కేసన మాటలకంటె మొల్ల మాటలే బాగా రుచించాయి. 'పోదాం పదండ్రా' అంటూ ఆవేశంతో వాళ్లు మొల్లవెనక బయలుదేరారు.

"నా మాట వినండి! దౌర్జన్యానికి దిగకండి!... దానివల్ల మనకొచ్చే లాభాలకంటె ముట్టేనష్టాలే ఎక్కువున్నాయి," అంటూ కేసన వాళ్ళను వారించడానికి ప్రయత్నించాడు గాని ఏం ప్రయోజనం లేకపోయింది. "ఈ బాధ భరించేదానికంటే ఉండటమో, ఊడటమో తేల్చుకోవడం మేలు," అంది మొల్ల - తండ్రివైపుచూచి.

బక్కచిక్కిన బడుగుజీవులందరూ - గట్లు తెంచుకొని ఊళ్ల మీదబడ్డ మహాప్రవాహంలాగా - మొల్లవెనక నడిచారు. "అన్నిటికీ ఆ ఈశ్వరుడే ఉన్నాడు," అంటూ కేసన, పోలిగాడు, మరి యితర పెద్దలు మొల్ల పోయినవైపుకు చూస్తూ అక్కడే నిల్చుండిపోయారు.

తమ యింటివైపుకు కేకలు వేసుకుంటూ వస్తున్న మాలమాదిగల గుంపును ముందు చూచినవాడు తిక్కన. వాళ్ళందర్ని తనవెంట నడిపించుకొస్తున్న మొల్లను అతను పరకాయించి చూశాడు. అతని గుండెల్లో గుండెలు లేవు. ఎగిరి గంతేసి యింట్లోబడ్డాడు. "అయ్యా - మాలమాదిగలంతా మన యింటిమీది కొచ్చిపడ్డారు," అంటూ గావుకేక

బెట్టాడు తిక్కన. ఆదరాబాదరాగా కనకయ్య తలుపుతెరిచి చూచాడు. వెఱ్ఱికేకలువేస్తూ జనం తన యింటివైపు కొస్తూంది. తను ఎంత బలాఢ్యుడైనా వాళ్ళముందర ఆగలేనన్న అధైర్యం కనకయ్యకు పుట్టింది. లోపలకెళ్ళి దాక్కుంటే మటుకు వాళ్ళొదుల్తారా?... మొత్తానికి ధైర్యం తెచ్చుకొని, "ఏమిట్రా యిటొస్తున్నారు," అంటూ కనకయ్య వాళ్ళవైపుకు నడిచాడు. "ఈ వెధవే మీ యిళ్లు తగలబెట్టింది," అంటూ మొల్ల వాళ్ళను కనకయ్యమీదికి ఉసికొల్పింది. దాంతో వాళ్లు కనకయ్యమీద అమాంతంబడి - కాలుకు కాలు, చెయ్యికి చెయ్యి విరగగొట్టడం సాగించారు. కనకయ్యగూడా కొంతవరకు వాళ్ళతో పోరాడాడు. కాని లాభంలేదని తెలుసుకొని కనకయ్య యింట్లోకి పరుగెత్తుకువెళ్ళి - లోపల గొళ్ళెంబెట్టుకున్నాడు.

"వాడు మొగాడుకాదు - ఆడది!... లేకపోతే యింట్లో దూరి గొళ్లెమెందుకుపెట్టుకుంటాడు?" అంది మొల్ల - అపహాస్యం చేస్తూ. కొంతమంది తలుపు బద్దలుకొట్టి యింట్లో ప్రవేశించడానికి పోబోయారు. కాని మొల్ల వారిని వారించింది.

"చచ్చిన పామును గొడ్తే లాభమేముంది?... వాడు పిరికివెధవ!... కడుపు కక్కుర్తికోసం యీపని చేశాడు. వాడి నొదిలి పెట్టండి! దీనికంతా మూలకారకుడైన ఆచారి యింటికి పోదాంపదండి! అవధానికూడా అక్కడేఉంటాడు," అంది మొల్ల.

తలుపుచాటునుంచి పిరికిపంద కనకయ్య మొల్ల అన్న మాటల్ని విన్నాడు. వెంటనే దొడ్లోఉన్న మదురుగోడెక్కి-బయటికి దూకి - ఆచారిగారింటివైపుకు పరుగెత్తాడు.

అగ్రహారీకుడైన ఆచారి కేం తక్కువ? సుష్టుగా భోంచేసి - తాంబూలం సేవిస్తూ ఆనాటి ఉదంతాన్ని అవధానితో ప్రస్తావిస్తున్నాడు. కేసనకు శిష్యులైన మాల, మాదిగలకు తగినశాస్తి జరిగిందని - శైవమతం పిచ్చి యింతటితో వాళ్లను పూర్తిగా వదిలేస్తుందని - నిజంగా కనకయ్యచేసిన కృషి యింతా అంతా గాదని - అతని సాహసం ఆదర్శప్రాయమని - అతనికిదగిన పారితోషికం త్వరలో అందజేస్తే బాగుంటుందని అవధాని ఆచారికి సగర్వంగా నివేదించాడు. ఇంతలోకే కనకయ్య పరుగెత్తుకుంటూ వచ్చి - వెఱ్ఱి ఆవేశంతో మాలమాదిగలు తమయింటిమీదికి దాడోస్తున్నారని చెప్పాడు. ఆచారి, అవధాని భీతావహులయ్యారు. ఆవేశంలో వాళ్లు ఏదిబడ్తే అదే చేయగలరని - యిక అక్కడ తాము ఉండడం మంచిదిగాదని-అవధాని ఆచారికి సలహాయిచ్చాడు.

"ఎక్కడికి పోదామంటావ్ ?" అడిగాడు ఆచారి.

"ఎక్కడికేమిటి ? లేవండి! ... ఈ మహాప్రవాహాన్ని యీ పరిస్థితుల్లో మనం ఎదుర్కోలేం. వెంటనే హంపి వెళ్లిపోయి - రాయలవారికి బసవేశ్వరోద్యమం యొక్క ఉధృతం తెలిపి - రాజభటుల్ని మనకు అండగా తెచ్చుకొని - వీళ్ల భరతం బట్టిద్దాం. ఒక్కసారి యీ పనిచేస్తేగాని మనసత్తా ఏమిటో వీళ్లకు బోధపడదు. లేవండి - యింకా కూచున్నారేం

కొంపలంటుకుపోతుంటే!" అన్నాడు అవధాని - ఆపాద మస్తకం వణికిపోతూ.

"ఇల్లా యిప్పుడు మనం ఊరువిడిచి వెళ్ళడం మన ప్రతిష్ఠకు, గౌరవానికి భంగంకాదూ?... నలుగురూ మనల్ని చూసి నవ్విపోరూ?... వాళ్లది పాలపొంగు - వాళ్ళబొంద - వాళ్లేంచేస్తారు!," అన్నాడు - ఆచారి - మనస్సు చిక్కబట్టుకొని.

'గౌరవం' 'ప్రతిష్ఠ' - బాగా ఉన్నాయి మీ మాటలు. మీరున్నూ!... మహాప్రళయం వచ్చి మీద బడ్తూంటే మీ కేం తెలియడంలేదు. ఆనాడు రాక్షసులు వైకుంఠం మీదికి దండయాత్రొస్తే సాక్షాత్తు శ్రీమహావిష్ణువు ఏంచేశాడు?... సమయానికి పారిపోలా? "బ్రతికియుండిన సుఖములు బడయవచ్చు - మాధవా మనరథంబును మరల నిమ్ము" అంటూ కురుక్షేత్రంలో అర్జునుడనలా? రాజ భటుల్ని తీసుకొచ్చి వీళ్ళమదం అణుద్దాం. మళ్లా ఎప్పుడూ వీళ్లు తలెత్తకుండా చేద్దాం - లేవండి," అంటూ తొందర బెట్టాడు అవధాని. ఆచారికి కూడా అంతకంటే గత్యంతరం లేదనిపించింది.

దొడ్డిదారినుంచి బయటికొచ్చి - ఆచారి, అవధానులు - జోడెద్దులబండిలో హంఫీకి ప్రయాణం గట్టారు. దారిమధ్య ఏ ఉపద్రవం రాకండా చూడడానికి కనకయ్యను గూడా వాళ్లు తమవెంట తీసుకుపోయారు.

మొల్ల నాయకత్వంకింద యిక్కడ మాలమాదిగలంతా కోటలాంటి ఆచారి భవనందగ్గిర కొచ్చారు. లోపల

గడియేసుంది. తలుపులు బద్దలుగొట్టండంది మొల్ల. వీరావేశంతో వాళ్ళు ఆ తలుపుల్ని క్షణంలో ముక్కలుముక్కలు చేసేశారు. లోపల ప్రవేశించి ఆచారి, అవధాన్ల కోసం వెతికారు. వాళ్ళు ఎక్కడా కనపడలా. "గాదెకింద దాక్కున్నారేమో సూడండ్రా," అన్నాడొక్కడు. అందరూ చేరి గాదెను దొర్లించారు. అక్కడా కనబడలేదు. ఆచారి, అవధాని కాలికి బుద్ధిచెప్పారనుకున్నారు మాలమాదిగలు. బస్తాలలో పోసి మూతులు బిగించున్న ధాన్యం వాళ్ళ కంటబడ్డది. "వచ్చిన వాళ్ళం ఎట్లాగూవచ్చాం-ఎత్తండ్రా యీబస్తాలు," అన్నారు మాలమాదిగలు. ఎవరిశక్తి ననుసరించి వారు ధాన్యపు బస్తాలను ఎత్తుకున్నారు. పిల్లాళ్ళు, ఆడాళ్ళు ధాన్యాన్ని తమ గుడ్డల్లో మూటలుకట్టారు. ఇంతలోకే యింట్లో పనివాళ్ళు వాళ్ళకు అడ్డమొచ్చారు. కాని ప్రహారాలు తిని వాళ్ళు కాలికి బుద్ధిచెప్పారు. దొడ్లో తులసిపూజలో నిమగ్నురాలైన సీతమ్మకు యీ గలభా వినపడ్డది. వెంటనే ఆవిడ లోపలికొచ్చి చూచింది. ధాన్యాన్ని దోచుకుంటున్నారు మాలమాదిగలు. మొల్ల అక్కడ నిల్చోనుంది. ఆమెను చూచింది సీతమ్మ.

"వీళ్ళందరిని గలభాచెయ్యొద్దనిచెప్పు. వీళ్ళు ఏపరిస్థితుల్లో యిక్కడికొచ్చి, యీ దోపిడీకి దిగారో నాకు తెలుసు. నేను వీళ్ళను అడ్డుపెట్టను. ఏమనను. వీళ్ళకు కావలసినంత ధాన్యం గొడవచెయ్యకుండా తీసుకువెళ్ళమనిచెప్పు. కావాలంటే నాచేత్తో నేనేయిస్తా," అంది సీతమ్మ. ఆవిడ వదనంలో గంభీరత, దయాదాక్షిణ్యాలు తొణికిసలాడాయి.

సీతమ్మ మహాసాధ్వి అని - ఆచారికి ఆవిడకు నక్కకు స్వర్గలోకానికి ఉన్నంత తేడా ఉందని - మొల్లకు తెలుసు. ఆనాడు దేవాలయంలో తనపట్ల ఆవిడ మాట్లాడిన మాటల్ని తను ఎల్లామరిచిపోగలుగుతుంది ?

సీతమ్మ కోరిక ననుసరించి ఎవ్వరూ గొడవచేయొద్దని - కూలికింద తమకు ఆచారిదగ్గరనుంచి ముట్టవలసిన గింజల్నే మూటకట్టుకోండని - అంతకుమించి ఎక్కువ తీసుకుంటే పాపమని - ఆచారిలాగా కాకండా తమపట్ల అవ్యాజప్రేమను అగపరచిన సీతమ్మగారికి చేయెత్తి దండంబెట్టమని - మొల్ల వాళ్ళనుకోరింది. కష్టపరిస్థితుల్లోగూడా న్యాయాన్ని త్యజించని ఆ మాల మాదిగలు తమకు రావలసిన గింజల్నే మూటలుగట్టుకొని పండుముత్తైదువు, దయార్ద్రహృదయ సీతమ్మకు దండాలుబెట్టారు.

భోషాణంతీసి సీతమ్మ వాళ్ళకు డబ్బుకూడా పంచిపెట్టింది. "ఈ డబ్బుతో తాటాకులు, బొంగులు కొనుక్కొని మీ యిళ్ళను తిరిగికట్టుకోండి," అంది సీతమ్మ. ఆవిడకళ్ళల్లో నీళ్లు గిర్రున తిరిగాయి. "మాకీ డబ్బెందుకు తల్లీ," అన్నాడు అందులో ఒకడు. కాదుగూడదు ఉంచుకోమంది సీతమ్మ. వాళ్ళు మొల్లముఖం చూచారు. "పెద్దావిడ యిస్తుంటే వద్దనకూడదు," అంది మొల్ల.

కేకలు అల్లాంటివేమీ వెయ్యకండా ధాన్యపు మూటల్తో మాలగూడానికి వెళ్ళిపొమ్మని వాళ్లకు మొల్ల విజ్ఞాపన చేసింది. వాళ్ళూ అల్లాగే వెళ్లిపోయారు.

"ఆచారి ఎక్కడమ్మా ?" అడిగింది మొల్ల.

"వారెక్కడికెళ్ళారో నాకు తెలియదు," అంటూ జవాబిచ్చింది సీతమ్మ. ఆచారి ఆవిడకు నిజంగానే చెప్పకండా పోయాడు. చెప్తే ఆవిడ పోనివ్వదని ఆయనకు తెలుసు.

"బంగారం లాంటి భార్యయింట్లో ఎందుకుంటాడమ్మా ఆయన. శృంగారపురుషుడు. రంగనాయకి యింట్లో కులుకుతూ కూచున్నాడేమో!" అన్నాడు యింట్లోపనివాడు – కళ్ళు తుడుచుకుంటూ.

మొల్ల ఏదో ఆలోచిస్తూంది. సీతమ్మ ఆమెదగ్గిర కొచ్చి – తల నిమిరింది.

"మొల్లా ! నువ్వు అందరిలాంటి ఆడదానివి కాదని నాకు తెలుసు. చదువు, సంధ్యలు లేకపోయినా – కుమ్మరి కులంలో బుట్టినా – అందరూ నిన్ను పిచ్చిదనుకుంటున్నా – ధర్మబద్ధంగా, న్యాయసమ్మతంగా నువ్వు మాట్లాడుతావు. నీలో గొప్పశక్తి ఉంది. ఆ శక్తిని నువ్వు భుక్తికి సంబంధించిన సమస్యలకు గాకండా ముక్తికి సంబంధించిన సమస్యలమీాద ఎందుకు వెచ్చించవ్ ?... అన్యాయం, అక్రమం నువ్వు సహించవని నాకుతెలుసు. కాని హింస, దౌర్జన్యాలతో అన్యాయాన్ని, అక్రమాన్ని ఎదుర్కోగూడదన్న పరమ సత్యాన్ని నువ్వు తెలుసుకోవాలి. మీా అయ్య చూడు – శుద్ధసాత్త్వికుడు, భక్తుడు, మహాజ్ఞాని. అతను నిజంగా ఆ కులంలో బుట్టవలసినవాడు కాదు. ఆ అయ్యకడుపున పుట్టావు నువ్వు. అతనికున్న భక్తి, జ్ఞాన, వైరాగ్యప్రపత్తులను అల

వరచుకొని అయ్యకుదగ్గ కూతురువనిపించుకో," అంది సీతమ్మ. అమృతతుల్యమైన ఆ సీతమ్మ వాక్కులలోని అంతరార్థాన్ని మొల్ల గ్రహించకపోలేదు.

"అన్నట్టు నీ పెళ్ళెప్పుడమ్మా ?" అడిగింది సీతమ్మ.

మొల్లకు ఏంచెప్పాలో ఏం తోచలేదు. అసలు ఇతర ఆలోచనలకు ఆవిడ బుర్రలో యిప్పుడు తావులేదు. ఆచారి, అవధాని మొదలయిన గ్రామపెద్దలు చేసిన, చేస్తున్న అకృత్యాలు యింకా ఆవిడరక్తాన్ని ఉడికిస్తూనే ఉన్నాయి.

"వస్తానమ్మా," అంటూ మొల్ల అక్కడినుంచి వెళ్ళిపోయింది. ఆవేశంతో పోతున్న మొల్లనుచూచి సీతమ్మ తనలో తాను నవ్వుకుంది.

తలంటిపోసుకొని - పట్టుబట్టలు కట్టుకొని - పుణ్యాంగనలాగా అలంకరించుకొని - భక్తి పారవశ్యంతో - మురళీకృష్ణుని ముందు - రంగనాయకి గానంచేస్తూంది. ఆ గానాన్ని విన్నవాళ్ళు ఎవరు ముగ్ధులుకాకుండా ఉంటారు ?

ఆచారిని ఒక్కఊపు ఊపుదామని ఆవేశంతో వచ్చిన మొల్లకు ఆమె గానం ఎంతో హాయినిచ్చింది. ధ్యానముద్రలో నున్న రంగనాయకిని చూడడంతోటే మొల్లలో గూడా ఒక విధమైన భక్తి అంకురించింది.

ఇంట్లో గోడలమీదున్న చిత్రాలను చూచింది మొల్ల. ఆ చిత్రాలు రంగనాయకియొక్క భక్తి ప్రవత్తుల్ని విప్పి చెప్పాయి. రంగనాయకి వచ్చిబోగందికాదని - నిజమైన దేవదాసి అని మొల్ల కొంతవరకు గ్రహించగలిగింది.

ప్రార్థన అయ్యాక రంగనాయకి వెనక్కి తిరిగిచూసింది. మొల్ల అగపడ్డది. నిజంగా ఆవిడ ఆనందం యింతాఅంతా గాదు.

"అక్కడ కూర్చోఅమ్మా," అంటూ రంగనాయకి ఆ పిల్లకు ఆసనం చూపెట్టింది. మొల్ల కూర్చోలేదు.

"ఆచారి యిక్కడ లేడూ ?"

"ఆయన యిక్కడెందుకుంటారు మొల్లా ?"

"అయితే నువ్వు......"

అట్లా అడగడంలో మొల్ల భావాన్ని రంగనాయకి అర్థంచేసుకుంది. కాని ఆవిడ తొణకలేదు.

"నాకూ ఆయనకూ ఎల్లాంటిసంబంధం లేదమ్మా!... అదుగో — ఆ కృష్ణుడే నామగడు. నేను ఆయన చరణదాసిని-సరేనా ?" అంటూ చిరునవ్వు నవ్వింది రంగనాయకి.

మొల్ల నిజంగా ఆశ్చర్యపోయింది. దేవుణ్ణి భర్తగా స్వీకరించినవాళ్ళను ఆమె యింతవరకు వినలేదు; చూడలేదు. కాని మొల్లకొక సందేహం కలిగింది.

"అయితే నువ్వు రాతివిగ్రహాన్నా పెళ్ళాడావు ?" అంటూ ప్రశ్నించింది మొల్ల. ఆ ప్రశ్నలో అమాయకత్వం చిందులేసింది.

"అవును," అంటూ లజ్జ నభినయించి చిరునవ్వు నవ్వింది రంగనాయకి.

రంగనాయకి తియ్యనిమాటలు మొల్లలో మృదుత్వాన్ని రేకెత్తించాయి. ఆనాడు దేవాలయంలో జరిగిన

సంఘటనను, వినోదకార్యక్రమాల సందర్భంలో గ్రామమండపం దగ్గిర జరిగిన ఉదంతాన్ని ప్రస్తావించి, రంగనాయకి మొల్ల యొక్క న్యాయ, ధర్మ తత్పరతను ప్రశంసించింది.

"నువ్వు నిజంగా ధైర్యం కలదానివి. న్యాయంపట్ల, ధర్మంపట్ల నువ్వు చూపెడుతున్న నిరతిని ఎవ్వరూ పొగడకుండా ఊరుకోలేరు. నీ మానసిక ప్రవృత్తిని అర్థంచేసుకోలేనివాళ్లు నువ్వొక పిచ్చిపిల్లవని – సభ్యత తెలియని జీవివని – అనుకుంటారు," అంది రంగనాయకి. రంగనాయకి మాటలు ఆ పిల్లనెంతో ఉత్తేజపరిచాయి. పొగడ్తకు గురిఅయ్యేటంత శక్తి తనలోఉందా అని ఆ పిల్ల సందేహం.

"అయితే మొల్లా – నువ్వెప్పుడు పెళ్ళిచేసుకుంటావమ్మా? నీ మగడెవరు?..." అడిగింది రంగనాయకి నవ్వుతూ. మొల్ల యిప్పుడు పెద్ద ఆలోచనలో పడ్డది. ఏం జవాబివ్వాలో ఆమెకు తోచలేదు. రంగనాయకి ఆ విషయాన్ని మార్చింది.

"మొల్లా!... చూపులకు ఒక సామాన్యుడైనా మీ అయ్య ఒక మహాభక్తుడు. ఎంతగొప్పకవిత్వం వ్రాశాడు?... ఆయనకెంత ఉపాసనాబలంఉంది?... లేకపోతే మరొకళ్ళు అల్లాంటి కవిత్వం వ్రాయగలుగుతారా?... సత్యస్వరూపుడయిన ఆ తండ్రి మనస్సు నొప్పించకు. ఆయన చెప్పినట్లు నడుచుకొని – ఆ అయ్యకుదగ్గ కూతురు వనిపించుకో!" అంది రంగనాయకి.

మొల్ల మనస్సు ఎక్కడో ఉంది. సామాన్యమానవు రాలు దేవుణ్ణి పెళ్లిచేసుకోవడమేమిటి? ఈ రాతివిగ్రహాలేనా—అసలు దేవుడనేవాడు మరొకడున్నాడా? ఆమె మెదడును యీ సందేహాలు తొలిచేస్తున్నాయి.

"ఏమమ్మా– రంగనాయకి!... దేవుడున్నాడంటావా?" అడిగింది మొల్ల.

"దేవుడంటే ఏమనుకుంటున్నావమ్మా?... దేవుడంటే మహాశక్తి. శక్తిస్వరూపుడయిన ఆ దేవుడు సర్వాంతర్యామి· నీలో, నాలో అందరిలో ఉన్నాడు. భక్తి, శ్రద్ధలతో ఉపాసిస్తే ఆయన తప్పకండా అగపడతాడు," అంది రంగనాయకి - పరిపూర్ణవిశ్వాసంతో.

"మరి తన కళ్ళముందు అన్యాయాలు జరుగుతూంటే ఆయన ఎందుకు ఊరుకుంటాడు?... కనపడి దుష్టుల్ని శిక్షించగూడదు?" అంటూ తిరిగి ప్రశ్నించింది మొల్ల. ఆమెలో ఒకవిధమైన వేదాంతజిజ్ఞాస మొలకెత్తింది.

ఇద్దరికీ భౌతిక, ఆధ్యాత్మిక వాదాలమీద మామూలు ధోరణిలో చర్చజరిగింది. రంగనాయకి యొక్క తియ్యని హేతువాదం మొల్లలో పరివర్తనకు ప్రారంభోత్సవం సలిపింది.

కాని రాతివిగ్రహాలమీద మొల్లలో ప్రబలిన ఆగ్రహావేశాలు యింకా అణిగిపోలేదు. మహాజ్ఞాని అయిన తన తండ్రియొక్క తాళపత్రగ్రంథాన్ని ఆనాడు దేవాలయంలో అవధాని, ఆచారి ప్రభృతులు తగలెడ్తుంటే ఆ రాతిదేవుడు

చూస్తూ ఎందుకూరుకున్నాడు?... ఇదే ఆవిడను అప్పటి నుంచి వేధిస్తున్న ప్రశ్న.

"ఇంతకూ నువ్వెవరిని పెళ్లాడతావో చెప్పావుగాదు," అడిగింది రంగనాయకి - మొల్ల మనస్సు తెలిసికోవాలనే కుతూహలంతో.

"నువ్వెవర్ని పెళ్లాడావో - నేనూ ఆయన్నే పెళ్లాడుతా - సరేనా!" అంది మొల్ల - సమాధానపూర్వకంగా. ఆ సమాధానం రంగనాయకికి సంభ్రమాశ్చర్యాలు కలిగించాయి.

"కాని నేను పెళ్లాడడమే తటస్థిస్తే - నీ కంటె ఒక అడుగు ముందుకువేస్తా. రాతివిగ్రహాన్ని నా జన్మలో. చేసుకోను. నిజమైన దేవుణ్ణే పెళ్లాడుతా," అంది మొల్ల. ఆ మాటల్లో అమాయకత్వం తొణికిసలాడుతున్నా - అకుంఠిత కార్యదీక్ష, ఆత్మవిశ్వాసం కనుడుగట్టుకొని లేకపోలేదు.

తన మాట వినని మొల్లను భగవంతుడికే ఒప్పచెప్పిన కేసన - పోలిగాడు, రత్తయ్య మొదలయిన వాళ్ళను వెంటేసుకొని బూజయ్యచెట్టి యింటికి వెళ్లాడు. ఆచారియింట్లో జరిగిన గలభా చెట్టికి అప్పుడే తెలిసిపోయింది. కేసన పెద్దరికం కింద వాళ్ళు తనయింటిమీాదికి కూడా వస్తున్నారేమోనని బూజయ్యచెట్టి ఆపాదమస్తకం గజగజవణికిపోయాడు. కాని ఎల్లాగైనా కోమటిబిడ్డవడంచేత - నక్కవినయాలు చూపెడ్తూ - కేసనను ఆహ్వానించి - తియ్యనిమాటల్తో అతిథిసత్కారాన్ని కావించాడు.

ముత్తాతలు గట్టిన తనయింటిని - మూడుఎకరాల పొలాన్ని బ్రాహ్మయ్య శెట్టికి తాకట్టుబెట్టి - ఆయనదగ్గర కొంత డబ్బుపుచ్చుకున్నాడు కేసన. ఆ డబ్బు పోలిగాడికిస్తూ," మీకష్టకాలంలో నేను మీకుచేయగలిగిన సేవ యిదే! ఈ డబ్బు తీసుకుపోయి తాటాకులు, బొంగులు అల్లాంటివి కొనుక్కొని గుడిసెలు తిరిగి వేసుకోండి. భగవంతుడే మిమ్మ ఆదుకుంటాడు," అన్నాడు కేసన. పోలిగాడు వద్దన్నా ఆయన వినలేదు. డబ్బుతీసుకొని పోలిగాడు ఆ త్యాగమూర్తికి చేయెత్తి దండంబెట్టాడు. "నాకెందుకు నాయనా దండం - సర్వాంతర్యామి యయిన ఆ భగవానునికి సమర్పించు," అంటూ కేసన తన నమ్రతను వెలిబుచ్చాడు.

తనకూతురు మొల్ల ఎటుబోయిందో- ఏం కయ్యంతీసు కొస్తుందో ననుకుంటూ కేసన తనయింటికి జేరుకొన్నాడు. ఆవు 'అంబా' అంటూ ఆయనవైపు చూచింది. దాని మోఱ గోకి - మేతవేసి - లోపలికివెళ్లి అంబలిగాచుకొని - బయట కొచ్చి కుమ్మరిసారెదగ్గిర కూర్చున్నాడు కేసన - కులవృత్తిని పాటిస్తూ.

సారెతిప్పుతూ కుండలు చేస్తున్నాడేగాని ఆయన మనస్సంతా దుడుకుపిల్ల మొల్లమీదనే ఉంది. ఇంతలోకే విజయగర్వాన్ని సూచించే నడకతో, ముఖలక్షణాలతో మొల్ల అక్కడకొచ్చింది. ఎప్పటిలాగా పోయి రోటిమీద కూచుని మొల్ల శూన్యంలోకి చూచింది.

పిల్లదగ్గిరకెళ్ళి "ఏంచేసొచ్చావు తల్లీ?" అడిగాడు కేసన. ఇంట్లో ఉండకండా ఆచారి, అవధాని పరారయ్యారని- మాలమాదిగలు ఆ యింట్లో తమకు రావలసిన ధాన్యం ఎత్తుకుపోయారని ఆమె తండ్రితో సగర్వంగా చెప్పింది.

మొత్తానికి తను అనుకున్నంతపనీ జరిగింది. "ఎంత పాపం చేశావు తల్లీ!... మనమూలంగా పాప మా మాల, మాదిగలకు ఎల్లాంటికష్టాలు సంప్రాప్తమవుతాయో నీవేమైనా ఊహించావా?" అంటూ కేసన చింతాక్రాంతుడయ్యాడు.

"దీంట్లో పాపమేముందయ్యా!... ఇళ్లు కాలిపోయి 'అలో లక్ష్మణా' అంటూ ఏడుస్తున్నవాళ్ళు ఆచారియింట్లో జొరబడి ధాన్యం ఎత్తుకుపోవడం తప్పా?... కర్మఅంటూ కూర్చుంటే వాళ్ల పెళ్లాంబిడ్డలకు తిండెవరుపెడతారు?... మాల, మాదిగల శక్తి ఏమిటో యిప్పుడుగాని ఆచారికి, అవధానికి తెలిసిరాదు," అంది మొల్ల - తన మామూలు ధోరణిలో.

"నీకు చెప్పడం నాతరంగాదు. ఆ పరమాత్ముడే నీకు జ్ఞానోపదేశం చెయ్యాలి," అంటూ కేసన తన సహజవాత్స ల్యాన్ని చూపెడ్తూ - మొల్లను యింట్లోకి తీసుకుపోయి - కూచోబెట్టి అంబలి తాగించాడు.

ఆచారి యింట్లో మాలమాదిగలు జరిపిన 'దోపిడీ'ని గురించి ఊళ్లో రకరకాల వ్యాఖ్యలు బయలుదేరాయి. ఆచారి, అవధాని - కనకయ్యతో సహా - రాజభటుల్ని తీసుకురావడానికి హంపీకి వెళ్లినట్లుగూడా ఊరంతా పొక్కి

పోయింది. మొత్తానికి గోపవరానికి ఏదో ప్రళయం సంభవించ బోతున్నదంటూ అందరూ భయపడ్డారు.

శ్రీ కంఠమల్లేశుని కేసన, మురళీకృష్ణుని దేవదాసి రంగనాయకి, తులసెమ్మను సీతమ్మ - గోపవర గ్రామస్థులు ఎల్లాంటి సంక్షోభానికి గురిగాకండా ఉండేందుకు ప్రార్థించారు.

మొత్తానికి గోపవరఅగ్రహారంలో ప్రళయదుందుభిని మోగించిన మొల్ల ఎప్పటిమోస్తరుగా తన యింటిముందు రోటిమీద కూర్చొని - శూన్యంలోకి చూసింది. క్షణంలో కారుమేఘాలు ఆకాశాన్ని అలముకొన్నాయి. ఉరుములు ఉరిమాయి. ఝోరున వర్షం కురిసింది. గోపవరంలో పుట్ట బోతున్న విపరీతసంక్షోభానికి యివి సూచనలు కావుగదా!

# 3

ఆకాశాన్నంటే రాజసౌధం, ఆ సౌధంమీద గాలికి రెపరెపలాడుతున్న పతాకం విజయనగరసామ్రాజ్యరమారమణి యొక్క వైభవాన్ని చాటుతున్నాయి.

రాజప్రాసాదంలోని రాయలసభాస్థలి అత్యంతరమణీయంగా ఉంది. పైన ధర్మచక్రం, దానికి కిందుగా రాయల రత్నఖచితసింహాసనం, దానికి కిందుగా బారులుతీర్చిన ఆసనాలు కళావిలసితంగా అగపడుతున్నాయి. అదిగో అది మహామంత్రి తిమ్మరుసు కూర్చునే ఆసనం!... అవిగో అవి అష్టదిగ్గజాలు అలంకరిచే పీఠాలు! సామంతులు, దండనాథులు మరి యితరసిబ్బంది కూర్చోడానికి ఉచితస్థలాల్లో ఆసనాలు ఆ సభాస్థలిలో ఏర్పాటుకావింపబడున్నాయి.

ఇంతకూ రాజసభాస్థలిలో ఆసనాలన్నీ ఖాళీగా ఉన్నాయి. ఎవ్వరూ లేరు. ఆంధ్ర, కన్నడ రాజ్యరమారమణుడు రాయలు దిగ్విజయయాత్రకు వెళ్లాడు. రాజసభాస్థలికి దగ్గిరగాఉన్న గదిలో నలుగురు వ్యక్తులు మాట్లాడుతున్నారు. అందులో ఒకాయన రాయల న్యాయశాఖాధికారి. మరొకాయన శతవృద్ధు, వైష్ణవమతగురువు తాతాచారి. తక్కిన యిద్దరూ గోపవరంనుంచొచ్చిన ఆచారి, అవధానులు.

తాతాచారి రాయలకు గురుతుల్యుడు. ఆయన హయాంలోనే వైష్ణవులకు రాయలచేత అనేకాగ్రహారాలిప్పించాడు. గోపవరఅగ్రహారంకూడా అందులో ఒకటి.

ఆచారిపతైన అవధాని గోపవర పరిస్థితుల్ని న్యాయశాఖాధి కారికీ, తాతాచార్లకు వివరించి చెప్తున్నాడు.

"అవును. వర్ణాశ్రమధర్మాలను మంటగలపడానికీ, సనాతన సాంప్రదాయాలను సాగనంపడానికి దుష్టశక్తులిప్పుడు విజృంభించాయి. శైవమతంపేర విద్రోహకరశక్తులిప్పుడు ప్రబలి - మాలమాదిగల్ని రెచ్చగొట్టి, కులాలన్నిటిని ఏకంచేయడానికి సమకట్టాయి. ఉన్నవాడు, లేనివాడనే భేదాలను సృష్టించి గ్రామసుస్థిరజీవనానికి యిప్పుడు దెబ్బ గొడుతున్నాయి. బసవేశ్వరోద్యమం యొక్క గాలి గోపవర అగ్రహారానికికూడా తగిలింది. ఈ సామ్రాజ్యానికి గ్రామాలు వెన్నెముకల్లాంటివన్న విషయం మీకు తెలియందిగాదు. గ్రామాలలో శాంతి, భద్రతలకు ముప్పువాటిల్లితే రాజ్యసౌష్ఠవానికీ తప్పకండా ఆఘాతం కలుగుతుంది. అందుచేత దయచేసి రాజభటుల్ని కొందరిని వెంటనే మా గోపవరానికి పంపమని దేవరవారికి విన్నవించుకోడాని కొచ్చాం. రాయలవారు దిగ్విజయయాత్రకు వెళ్లారు. మరి మీరు గోపవరంలోని విషమపరిస్థితిని గమనించి - వెంటనే భటుల్ని అక్కడకు పంపాలని మా ప్రార్థన," అన్నాడు అవధాని.

రాయలు, మంత్రులు, దండనాథులు, మరి యితర ముఖ్యులు రాజధానిలో లేరని, వారిని సంప్రతించకండా యీ విషయంలో తానేమీ జోక్యంకలిగించుకోవడానికి వీలు లేదని న్యాయశాఖాధికారి ముందర అన్నాడుగాని - తాతాచారి ముఖంచూసి - విషమపరిస్థితుల్ని గుర్తించి - పదిమంది

రాజభటుల్ని – గోపవరంలోని తిరుగుబాటును అణిచేందుకు పంపించడానికి ఒప్పుకున్నాడు. రాజముద్రగల ఫర్మానాతో పదిమంది సైనికులు కత్తులు, కఠారులు తీసుకొని – గుర్రాల నెక్కి యిప్పుడు ఆచారి, అవధాని వెంటగోపవరానికి బయలు దేరారు. మరునాటి ఉదయానికి వాళ్ళంతా గోపవరంచేరారు.

ఆచారి తనభవనంలో ప్రవేశించి ఒక్కసారి చూసుకొన్నాడు. తలుపులు పగిలిఉన్నాయి. వస్తువులన్నీ చెల్లాచెదరుగా పడేసున్నాయి. గాదెల్లో ధాన్యం ఎగిరిపోయింది. ఇంట్లో పనివాళ్ళొచ్చి – ఆయన లేనప్పుడు జరిగిన సంఘటనను ఆయనకు వివరించారు. ఆచారికి అవమానం, కోపం ఒక్క పెట్టున వచ్చాయి.

భర్తవచ్చాడని తెలిసి సీతమ్మ లోపలినుంచి వచ్చింది. ఏమిటిదంతా అన్నట్లు ఆయన ఆవిడను చురచురచూశాడు. మాలమాదిగలు చేసినదాంట్లో తప్పేంలేదని – పాపం వారి పరిస్థితులు వారినల్లా చేసేందుకు ప్రేరేపించాయని – వాళ్ళను చూస్తే తనకే జాలి కలిగిందనీ – వాళ్ళకు తను కొంత డబ్బుగూడా యిచ్చానని – ఆవిడ భర్తతో చెప్పింది. ఆచారికి అరికాలిమంట నెత్తిమీదకొచ్చింది.

ఆయన రాజభటుల్ని, అవధానిని తనసమక్షానికి పిలిచాడు. "ఇల్లాఉన్నాయి యీ ఊరిపరిస్థితులు. ధర్మం, న్యాయం, సత్యం అడుగంటాయి. మాలమాదిగలు మా ఇంట్లోకివచ్చి మా యింటిని అపవిత్రం చేశారు. ధాన్యమంతా దోచుకెళ్లారు. అవధానితోపాటు మీరు ముందు మాలగూడానికివెళ్లి దోపిడీ

చేయబడ్డ ధాన్యాన్ని, యితరవస్తువుల్ని లాక్కురండి! ఎవ్వడైనా అడ్డమొస్తే మెక్కెలు విరగదన్నండి! ఈ తిరుగుబాటుకు కారకులైన మొల్లను, కేసనను అరదండాలతో గ్రామమండపానికి తీసుకురండి! మీ సమక్షంలో వారిని విచారించి - వారికి తగినదండన విధిస్తాను," అన్నాడు ఆచారి - మండిపడుతూ.

అవధాని దారిచూపించాడు. రాజభటులు మాలగూడానికి వెళ్లారు. మాలమాదిగలు తిరిగి కట్టుకున్న గుడిసెల్లో దూరి ధాన్యాన్ని, దసకాన్ని బట్టుకున్నారు. అడ్డమొచ్చినవాళ్ళనల్లా చితకబాదిచారు.

రాజభటులు మాలగూడెంమీద పడ్డారన్న వార్త విన్న కేసన అక్కడికి పరుగెత్తుకుంటూ వచ్చాడు. అమాయకులయిన వాళ్ళను బాధపెడుతున్న రాజభటుల్ని చూచి, "పాపం వాళ్ళనేం చెయ్యకండి. నేనే వీళ్ళను రెచ్చగొట్టాను. నన్ను పట్టుకొని - వీళ్ళ నొదిలెయ్యండి!... మీ కిష్టమొచ్చినట్లు నన్ను దండించండి!" అన్నాడు కేసన. ఈ సంక్షోభానికంతా కారకుడు వీడేనని కేసనను అవధాని రాజభటులకు వేలెట్టి చూపాడు. రాజభటులు కేసనకు అరదండాలువేసి గ్రామమండపంవైపుకు లాక్కుపోయారు.

మొల్ల కీ విషయం తెలిసింది. శరవేగంతో ఆమె రాజభటుల్ని సమీపించింది. "మం అయ్యా నొదిలెయ్యండి! ఆయన కేం తెలియదు. నేనే దీనికంతా కారకురాలను. నన్ను బట్టుకోండి," అంది మొల్ల.

అవధాని ఆజ్ఞ ననుసరించి రాజభటులు మొల్లకు గూడా అరదండాలు వేశారు. "ఆ పిల్ల నొదిలెయ్యండి బాబూ - అది పిచ్చిది," అంటూ కేసన రాజభటులకు మొఱ బెట్టాడు. ఆ మొఱ వాళ్లు వినే పరిస్థితుల్లో లేరు.

గ్రామమండపంముందు కేసనను, మొల్లను అరదండా లతో నిల్చోబెట్టారు రాజభటులు. ఊరు, ఉహామంతా వీళ్లను చూచేందుకు అక్కడ అప్పుడే చేరింది. ఆచారి, అవధాని, బొజ్జయ్యచెట్టి, శరభరాజు, సుబ్బారెడ్డి పంచాయితీ పెద్దల హోదాతో - మండపంలో కూర్చొని - న్యాయ విచారణకు ఉపక్రమించారు. అధికారరీత్యా రాజభటులు అక్కడే నిల్చున్నారు. వాళ్లు అక్కడే ఉండడం మూలాన పంచాయతీపెద్దలకు యిప్పుడేం భయం కలగడంలేదు.

మాల మాదిగలంతా దూరాన నిల్చొని - తమకోసం కష్టాలపాలయిన కేసనను, మొల్లను చూచి కళ్లే నీరుబెట్టు కున్నారు.

సీతమ్మ, రంగనాయకీ గూడా స్త్రీజనంలో సముచిత స్థలాలలో కూర్చొని న్యాయవిచారణను తిలకించారు. గరిక్షవాతతో బాధపడుతున్న తిక్కనగూడా ఒకమూల కూర్చొని - మొల్లను కోరచూపులు చూచాడు.

అగ్రహారీకులు, గ్రామపంచాయితి పెద్ద, నియంత అయిన రామాచారి అధికారరీత్యా నేరంయొక్క వివరాలను కేసనకు తెలిపాడు.

"ఈ ఊళ్లో నువ్వు శైవమతం పేరట మాలమాదిగల్ని నీ దాసులుగా చేసుకున్నావు. వాళ్లకు వీరశైవమతం కూడా యిచ్చావు. నీ కూతురు ద్వారా వాళ్ళందర్నీ రెచ్చగొట్టి అగ్రజాతులమీద దాడి వెడలదీశావు. ఊళ్లో దోపిడీలు చేయించావు. బసవేశ్వరోద్యమానికి యీ ఊళ్లో నువ్వు ప్రతినిధిగా ఉండి – గ్రామంయొక్క శాంతి భద్రతలకు ముప్పు తీసుకొచ్చావు. ఒకవిధంగా చూస్తే దేశంయొక్క శాంతి భద్రతలకే నువ్వు ఎసరుబెట్టావు. ఇవన్నీ అల్లాఉంచి నీ కూతురుచేత కనకయ్య కొడుకు, వెఱ్ఱిబాగులవాడు అయిన తిక్కనకు గరిటెవాత పెట్టించావు. పచ్చపచ్చగాఉన్న గోపవర అగ్రహారానికి అన్నివిధాలా నువ్వు చిచ్చుబెట్టావు," అన్నాడు ఆచారి న్యాయస్థానపీఠంనుంచి – అధికారపూర్వకంగా కేసనను చూస్తూ. కేసన ఏం జవాబుచెప్పకండా ధ్యానముద్రలో ఉన్నాడు. తను ఏంచెప్పినా ఏంలాభంలేదని ఆయనకు తెలుసు.

ఈ నేరంలో నిందితురాలు తానని – ఏపాపం తెలియని తన అయ్యను గ్రామమండపానికి తీసుకొచ్చి – అల్లా నిలబెట్టడం భావ్యంకాదని – మొల్ల మోటుతనంగా ముందుకొచ్చి ఆచారికి సమాధానం చెప్పబోయింది.

"ఒసేయ్ – నిన్నెవరడిగారే?... ఆచారిగారు మీ అయ్యను సంజాయిషీ అడుగుతున్నారు. నోరుమూసుకొని అక్కడుండు! చూశావా వాళ్ళని! ఎముకల్లో సున్నం లేకుండా కొడతారు – వెఱ్ఱివేషాలు వేశావంటే – జాగ్రత్త!"

అని మొల్లను అదిల్చాడు అవధాని - రాజభటుల్ని ఆమెకు చూపెడుతూ.

మాల మాదిగల్లోనుంచి పోలిగాడు - తనకళ్ళముందు జరుగుతున్న దారుణాన్ని చూచి సహించలేక - దిగ్గున లేచాడు.

ఆచారికి చేయెత్తి దండంపెట్టి "బాబయ్యా - నా మనవి వినండి! కేసనబాబుగాని, మొల్లమ్మగాని మమ్మల్ని మీామీాదికి ఉసికొల్పలేదు. మేం వీరశైవం పుచ్చుకోనూలేదు. ఇళ్లు తగలబడిపోతే ఆవేశంతో మావాళ్లు మీాయింటికివచ్చిన మాట నిజం. వాళ్లైనా దోపిడి, అల్లాంటివేమీా చెయ్యలేదు. తమకు రావలసినకూలిగింజల్ని మూటగట్టుకు తెచ్చుకొన్నారు. మాకొంపలకు నిప్పంటించినవాళ్లెవరో ఆరా తీయకండా - మాకు సహాయపడ్డ కేసన, మొల్లను మండపందగ్గిరకు లాక్కొచ్చారు. రాజభటులచేత మావాళ్లందర్నీ తన్నించారు. ఇంతచేసినా మాకు మీామీాద పగేం లేదు. మేం తప్పుచేశామని మీారు తలిచే పక్షంలో మమ్మల్ని మీా యిష్టమొచ్చినట్లు చేయండి. అందుకు మేం సిద్ధగాఉన్నాం. కాని ఏపాపంఎరుగని ఆ జీవుల్నిద్దరిని వదిలెయ్యండి! ..." అంటూ పోలిగాడు ఆచారిని ప్రాధేయపడ్డాడు.

"ఒరేయ్ పోలిగా! ... పెళ్లాం బిడ్డలు గలోడివి - నీకేం బతకాలని లేదుట్రా ?...నీకెందుకు నువ్వు కిక్కురుమనకుండా కూచో!..." అంటూ సుబ్బారెడ్డి పోలిగాణ్ణి బలవంతంచేసి కూర్చోబెట్టాడు - అతని దగ్గిరకుపోయి.

ఆవేశపూరితురాలైన మొల్ల మళ్లీ మాట్లాడ బోయింది. కళ్లు తెరిచి కేసన ఆమెను చూచాడు."

"నేనున్నాగా తల్లీ యిక్కడ - నువ్వేం మాట్లాడబోకమ్మా," అన్నాడు కేసన.

సీతమ్మ, రంగనాయకి మాట్లాడడానికి లేవబోయేసరికి ఆచారి వాళ్లిద్దర్నీ ఉరిమిచూచాడు. భగవంతుడే న్యాయాన్యాయాలు పరిశీలిస్తాడనుకుంటూ వాళ్ళు నోరుమెదపకండా కూర్చుండిపోయారు.

అపరబుద్ధమూర్తి కేసన గ్రామపెద్దల్ని, అక్కడచేరిన జనసమూహాన్ని ఒక్కసారి కలయజూచాడు. ఆఖరుకు ఆచారిమీద ఆయన తనదృష్టిని కేంద్రీకరించాడు. ఆ దృష్టిలో ప్రశాంతత ఉట్టిపడుతూంది. కోపం, ద్వేషం, మోహం మొదలయినవాటికి ఆ దృష్టిలో చోటులేదు.

"మీరు మహాపండితులు, అగ్రహారీకులు, యీ గ్రామ పెద్దలు. కులంలోగాని, గుణంలోగాని, మీరు మాకంటె గొప్పవారు. ఈ మాలమాదిగలకు నేను వీరశైవం యిచ్చానని -- వాళ్లను నేను దోపిడీచేయడానికి ఉద్బోధపరిచానని - ఈ ఊళ్లో బసవేశ్వరోద్యమానికి నేను ప్రతినిధి నని - మీరు నామీద నేరం మోపారు. బుద్ధిపూర్వకంగా యీ పనుల్లో నేను వేటినీ చెయ్యలేదు. ఆ శ్రీరామచంద్రుని సాక్షిగా చెబుతున్నాను. కాని మాలమాదిగల్లో కొందరు - తమ యిళ్ళు తగలబడిపోవటంవల్ల - ఆగ్రహావేశ పరవశులయి మీయింటికి వచ్చినమాట నిజం. వాళ్లు అల్లాచేయడం తప్పని

మంచికో - చెడుకో - మొల్ల పెళ్లి విషయంలో ఆచారి చూపెడుతున్న శ్రద్ధ, ఉత్సుకత కేసనకు మంచివిగానే తోచాయి.

"బాబూ - మీరు నిజం సెలవిచ్చారు. తిక్కనను గాకపోయినా మా కులంలో మరెవ్వరినైనా పెళ్లాడమని దానికి రాత్రింబగళ్ళు చిలకకు చెప్పినట్లు చెబుతున్నా. ఇప్పటికే వయస్సు మీరిపోయింది. తండ్రినైన నేను దాన్ని త్వరలో ఒక అయ్య చేతిలో బెట్టి - నా విధ్యుక్త ధర్మాన్ని నేను నిర్వర్తించాలని చూస్తున్నా. కాని అది నా మాట వినకండా వచ్చింది. పెళ్లిమాటెత్తుతే అది భగ్గున మండి పోతున్నది. పెళ్లి విషయంలో సాక్షాత్తు ఆ యీశ్వరుడే దానికి జ్ఞానోపదేశం చేయాలి," అన్నాడు కేసన - మొల్ల వంక పితృవాత్సల్యంతో చూస్తూ.

తన పెళ్లిసంగతి తర్జనభర్జనలకు గురవుతూంటే మొల్ల ఓర్చుకోలేకపోయింది. ఆమె ఆచారివైపు తిరిగింది.

"నన్ను పెళ్లిచేసుకోమనడానికి నువ్వెవరివి?... నా జీవితానికి నేనే కర్తను. పెళ్లిచేసుకోవాలో - చేసుకోకండా ఉండాలో - ఒకవేళ చేసుకుంటే ఎవరిని చేసుకోవాలో - నాకు తెలుసు. నీకుగాని - యీ ఊళ్లోఉన్న మరెవ్వరికిగాని- నా సొంతవిషయంలో జోక్యంకలిగించుకోడానికి హక్కు లేదు," అంది మొల్ల - చురచురచూస్తూ.

అవధానికి ఆ మాటలు వింటూంటే ఒళ్ళు మండి పోయింది. ఏదో శిక్షవేసి తండ్రిని, కూతుర్ని ఊళ్లోనుంచి

సాగనంపక – దాని పెళ్లి విషయంలో లేనిపోని శ్రద్ధతీసుకొని- దానిచేత నాలుగుమాటలూ పడుతున్న ఆచారిమీద అవధానికి చిరాకు కలిగింది. ఆ చిరాకులో ఆయన ఆచారిని చూచాడు. అవధాని మనస్సుగ్రహించిన ఆచారి ఒకనవ్వు నవ్వాడు.

"అల్లా నవ్వుతారేం ఆచార్లగారు మీరు ?... ఈ ప్రపంచంలో ఎవ్వరూ యింతవరకు చెయ్యని – యికముందు చెయ్యబోని – మహాపాపం చేసింది యిది. రామాలయంలోని గర్భగుళ్లోకి ప్రవేశించి దేవుణ్ణి అపవిత్రంచేసింది. ఏంతెలియని మాలమాదిగల్ని మన మీదికి ఉసికొలిపింది. ఊళ్లో నానా హంగామా చేస్తున్నది. ఇది పిల్లని మీరు జాలి తలవగూడదు. చిన్నపామునైనా పెద్దకర్రతో కొట్టాలన్నారు పెద్దలు. గోపవరఅగ్రహారం యొక్క పరువు, ప్రతిష్ఠలు చిరస్థాయిగా ఉండాలంటే – యీ ఊరిపేరు నలుగురినోళ్లల్లో బడి నానకండా ఉండాలంటే – దీనికి తగినశిక్ష విధించాలి. దీనితోపాటు వాడికికూడా దండన యివ్వాలి. ఇదీ నాఅభిప్రాయం. తరువాత మీయిష్టం," అన్నాడు అవధాని – తన అల్పబుద్ధిని చూపెడ్తూ.

కర్ర విరగకండా, పాము చావకండా ఉండే ఫక్కీలో తన అభిప్రాయాన్ని యిచ్చాడు కోమటిబిడ్డ బొజ్జయ్యచెట్టి. శరభరాజు, సుబ్బారెడ్డి తాము చెప్పేదేంటో తమకే తెలియకండా అభిప్రాయాలిచ్చారు.

అందరి అభిప్రాయాలు విన్నాడు ఆచారి. మొల్లను, కేసనను శిక్షవేసి ఊళ్ళోనుంచి పంపిస్తే – మాలమాదిగలు మరీ రెచ్చిపోయి అశాంతిని కలిగిస్తారని ఆయన ఊహ. రాజ భటుల సహాయంతో ఊరి నెంతకాలం తన అదుపాజ్ఞల్లో పెట్టుకో గలుగుతాడు?. మొల్ల ఒక యింటిదైతే ఊళ్ళో గొడవలేవీ ఉండవని ఆచారి ధృఢవిశ్వాసం.

"ఒసేయి మొల్లా! ఇంతకుముందు నీ మాటల ధోరణి చూస్తే మొత్తానికి పెళ్ళాడాలనే కోరిక నీలో ఉన్నట్లు నే తెలుసుకోగలిగాను. పోనీ తిక్కన అక్కర్లేకపోతేమానె – ఎల్లాంటివాడు గావాలంటావు నీకు? ఇంద్రుడా, చంద్రుడా – లేక మన్మధుడా......" అడిగాడు ఆచారి.

మొల్ల కళ్ళు ఎఱ్ఱబారాయి. అచారి తనను గేలి చేస్తున్నాడు. ఒకవిధమైన పిచ్చి ఆవేశం ఆమెలో ఉత్పన్న మయింది.

"నేను మానవమాత్రుల్ని పెళ్ళిచేసుకోను. దేవుణ్ణి పెళ్ళాడతా – సరేనా?" అంది మొల్ల. నిజంగా ఆమాట ఆమె అనాలని అనలేదు.

ఆ మాటకు అందరూ ఫక్కున నవ్వారు. ఆమె ఆవేశం మరింత రెచ్చింది.

"నిజం చెప్పావు మహాశక్తీ!... నిన్ను దేవుడు తప్ప మానవమాత్రు డెవ్వడూ సంబాళించుకోలేడు," అని తిక్కన వెటకారంగా ఆమెకు ఒక్క నమస్కారం చేశాడు.

తిరిగి అందరూ గొల్లున నవ్వారు.

"అయితే దేవుడున్నాడని అంటావ్!" అన్నాడు ఆచారి.

"ఉంటేనే!" అంది మొల్ల.

మళ్లీ అందరు ఒక్కసారిగా నవ్వారు. వాళ్ళ నవ్వు ఆమెను ఒకవిధంగా సవాలిచ్చింది. ఆవిడలోని పిచ్చిఆవేశం ఎంత పైకివెళ్లాలో అంతపైకి వెళ్ళింది. రాతిదేవుణ్ణి పెళ్లాడిన రంగనాయకిని ఆమె ఒకమారు చూసింది. 'గొప్పమాటన్నావు' అన్న భావాన్ని సూచిస్తూ రంగనాయకి ఆమెనుచూసి చిరునవ్వు నవ్వింది. మొల్ల సీతమ్మ ముఖం చూసింది. 'నువ్వు అంతదానివే' అన్నభావం ఆవిడ ముఖంలో ప్రస్ఫుటమయింది. అందరూ చేరి తన కూతుర్ని పిచ్చిదాన్ని చేసి ఆడిస్తున్నారని కేసన కళ్లుమూసుకొని - శ్రీకంఠమల్లేశుణ్ణి ప్రార్థించాడు.

"ఇది హాస్యాలకు, వేళాకోళాలకు సమయం గాదు. కేసనా - నీకు వారంరోజులు గడువిస్తున్నా. నిన్ను నువ్వు రక్షించుకోవాలంటే - దాన్ని నువ్వు కాపాడుకోవాలంటే - యీఊరికి ఏవిధమైన అప్రతిష్ట దానిద్వారా రాకండా ఉండాలంటే - వారంరోజుల్లోగా దాన్ని ఎవరికో ఒకరికిచ్చి పెళ్లిచెయ్యి. పెళ్లిఅయితే దానితలబిరుసుతనం, మొరటుతనం, పిచ్చిఆవేశం పూర్తిగా తగ్గిపోతాయని నా విశ్వాసం. తక్కిన వాళ్ళంతా దీన్ని సామాన్యమానవురాలిగా చూడకూడదని నాకు సలహాయిస్తున్నా - నేనింకా దాన్ని ఒకపిల్లగానే చూచి యిల్లా చెప్తున్నా. వారం రోజులలోపల నువ్వు దాన్ని ఎవరికైనా యిచ్చి పెళ్ళిచెయ్యకపోతే నువ్వు శిక్షకు

పాలుగావలసొస్తుంది. నీ యిల్లూ, గొడ్డూగోదా స్వాధీనం చేసుకొని - కట్టుగుడ్డలతో నిన్ను, దాన్ని యీ ఊరినుంచి తరిమేస్తాం. మళ్లా ఎదురుతిరిగారంటే హంపీకి వర్తమానం పంపి నిన్ను, దాన్ని వధ్యశిలకు పంపించేస్తాం. మీయిద్దరూ బాగా ఆలోచించుకోండి!... తరతరాలనుంచి నీ కుటుంబం యీ అగ్రహారంలో ఉండడంచేత నేను యీ విధంగా దయా, దాక్షిణ్యాలు చూపెట్టక తప్పిందిగాదు," అంటూ ఆచారి - కేసన మీది నేరంలో - తన కడపటి తీర్పు యిచ్చాడు.

ఇల్లు తనకు యీవరకే తాకట్టుబెట్టాడని బొట్టయ్య చెట్టి ఆచారికి విన్నవించాడు. తన బాకీ ఎక్కడ పోతుందో అని ఆయనభయం. "నీ డబ్బుకేం భయంలేదులే," అని ఆచారి చెట్టికి అభయప్రదానం చేశాడు.

ఆచారి నుద్దేశించి, "తమరు న్యాయశాస్త్రప్రకారం ఏ తీర్పివ్వాలో ఆ తీర్పు యిచ్చారు. మిమ్మల్ని నేనేం అసను. అది ఒక యింటిదైతే దానిలోని దుడుకుతనం, ఆవేశం సమసి పోతుందని మీరు వెలిబుచ్చిన అభిప్రాయంతో నేనూ సంపూర్ణంగా ఏకీభవిస్తున్నా. అన్నిటికీ ఆ పరమాత్ముడే ఉన్నాడు," అన్నాడు కేసన.

చేతులకున్న అరదండాలను తీసేసి - వాళ్ళను వదలి పెట్టవలసిందని ఆచారి రాజభటులకు చెప్పాడు. వాళ్ళు అల్లాగే చేశారు.

మాల, మాదిగల వైపుకు తిరిగి ఆచారి, "మిమ్మల్ని యీసారికి క్షమిస్తున్నా. మళ్లీమరొకసారి ఆ కుట్టముండ చెప్పి

నట్టు ఏమైనా చేశారంటే మీప్రాణాలు మీకు దక్కవు," అన్నాడు – అధికారపూర్వకంగా.

ఊళ్లో సంక్షోభం ప్రస్తుతం సమసిపోయిందని – ఒకవేళ తిరిగి కల్లోలం పుట్టే వాళ్ళు రావలసొస్తుందని – తమ కృతజ్ఞతాపూర్వక వందనాలను వైష్ణవమతగురువులు తాతాచార్ల గారికి అందజేయవలసిందని – యిక వాళ్ళు హంపీకి తిరిగి పోవచ్చునని – అన్నాడు ఆచారి – రాజభటుల్ని ఉద్దేశించి. ఆచారికి నమస్కారంచేసి రాజభటులు హంపీకి ప్రయాణమయ్యారు. న్యాయసభ అంతటితో ముగిసింది.

ధర్మానికి, అధర్మానికి – హింసకు, శాంతికి – జరుగుతున్న యీసంఘర్షణను యింతవరకూ తిలకిస్తున్న సూర్యుడు పడమటి సముద్రంలో గ్రుంకులిడడానికి వెళ్ళిపోయాడు.

"రా తల్లీ – రా," అంటూ కేసన మొల్లను తనవెంట యింటికి తీసుకుపోయాడు.

పొద్దస్తమానం పొలాలమీద చచ్చేచాకిరీచేసిన కష్టజీవులంతా పెళ్ళాంబిడ్డలతో – కలో, గంజో తాగి పడుకునేటందుకు – తమ తమయిళ్ళకు చేరుకుంటున్నారు. ఆవులు, గేదెలు మొదలయిన చతుష్పాదజీవులు అక్కడక్కడ మేసి తిరిగి తమయిళ్ళకు వచ్చేస్తున్నాయి. కలకలారావాలతో పక్షులు తమ పిల్లల్ని చూసేందుకు గూళ్ళల్లోకి వచ్చిపడుతున్నాయి. క్రమక్రమంగా నిశాంగన నల్లని తనజుట్టు విరియబోసుకొని నాట్యమాడడం సాగించింది.

ఆనాటిరాత్రి తన యింట్లో – శ్రీకంఠమల్లేశుని ముందు ఆముదపుదీపాన్ని వెలిగించాడు కేసన. వంటయింట్లోకి వెళ్ళి చోడిఅంబలి కాచాడు. 'అమ్మాయి' అంటూ బయట కొచ్చి చూశాడు. రోటిమీద కూర్చొని – శూన్యంలోకి చూస్తూ – ఏదో ఆలోచిస్తూంది ఆ పిల్ల. ప్రేమపూర్వకంగా తండ్రి కూతుర్ని లోపలికి తీసుకుపోయి అంబలితాగించాడు. అంబలి తాగుతున్న దేగాని మొల్ల మనస్సు ఎక్కడో ఉంది. అది కనిపెట్టకపోలేదు కేసన.

రెండు కుక్కిమంచాలను వాల్చి – వాటిమీద బొంతల్ని, దిండ్లను పడేశాడు కేసన. "మంచంమీద పడుకో తల్లీ," అంటూ కేసన కిందకూచున్న మొల్లను లేపాడు. మొల్ల లేచి మంచంమీద కూచుంది. ఆ రోజున ఆ పిల్ల అసామాన్యపు దీర్ఘాలోచనలో మునిగిపోయింది. "ఇంకా ఆ గ్రామమంటపం దగ్గిర జరిగిన గొడవనేగురించి ఆలోచిస్తున్నావా తల్లీ," అన్నాడు కేసన. మొల్ల వద్దనుంచి జవాబు లేదు. ఆ గొడవమీదనుంచి ఆమె మనస్సును మరల్చడం కోసం ఆమె తల్లిని గురించి కేసన చెప్పసాగాడు.

"ఒకనాడు – పొద్దుగూకేవేళ – మీ తాతగారి ఊరి నుంచి గోపవరానికి నేనూ, మీ అమ్మ, వస్తున్నాం. మార్గ మధ్యంలో ఒక అడవుంది. నువ్వు అప్పుడు మీ అమ్మ కడుపులో ఉన్నావు. చిమ్మచీకటిబడుతూంది. ఎంతనడచినా దూరంతగ్గడంలేదు. మీ అమ్మ నెప్పులు పడడం ప్రారంభించింది. ఏంచేస్తాను నేను?... శ్రీ కంఠమల్లేశుణ్ణి ప్రార్థించి

మీ అమ్మను దగ్గరగా ఉన్న ఒక కొండగుహలోకి చేర్చాను. మీ అమ్మ ఆ దేవుడి దయవల్ల ఏవిధమైన బాధపడకుండా నిన్ను అక్కడ ప్రసవించింది. బయట శబ్దం ఏదో అయితే నేనూ, మీ అమ్మ వెలుపలికి వచ్చాం. ఎదురుగ్గా ఉన్న అడవి తగలబడిపోతూంది. ఇక అక్కడుంటే ప్రమాదం సంభవిస్తుందని గబగబ గుహలోకి వెళ్ళాం. నీమీద నాగేంద్రుడు పడగవిప్పుకొని ఆడుతున్నాడు. "మా పిల్లను మాకు యివ్వు తండ్రీ," అంటూ మేము ఆ నాగేంద్రుడికి దణ్ణంబెట్టాం. ఏం చేయకుండా ఆ నాగేంద్రుడు తనదారిన తాను పోయాడు. 'మా అమ్మ గొప్పదవుతుంది' అంటూ మీ అమ్మ నిన్నెత్తుకొని ముద్దాడింది. నిన్ను తీసుకొని ఆ చీకట్లో మేమిద్దరం అడవిదాటి – గోపవరంలోకొచ్చిపడ్డాం. తరువాత రెండు, మూడు రోజులకు మీ అమ్మకు కడుపునెప్పొచ్చింది. దాంతోనే అది శాశ్వతంగా ఆ రాత్రి కన్ను మూసింది. చచ్చే ముందు 'నా తల్లి గొప్పదవుతుంది. నాగేంద్రుడు దానిమీద పడగవిప్పుకు ఆడాడు' అంది మీ అమ్మ. 'పిల్లను మీ చేతిలో బెట్టి పోతున్నా – ఎట్లాచూసుకుంటారో' అంటూ మీ అమ్మ నిన్ను నాకిచ్చిపోయింది. అప్పటినుంచి – తల్లిలేని కొరత లేకుండా – నిన్ను నేను పెంచుకొచ్చా," అన్నాడు కేసన. అల్లా చెప్తూంటే ఆయన కళ్ళల్లో నీళ్లు గిఱ్ఱునతిరిగాయి.

'నా తల్లి గొప్పదవుతుంది' అంటూ తనను గురించి తన తల్లి అన్నమాటలు మొల్ల మనస్సును కలచివేశాయి. ఆమెలోని ఆలోచన యిప్పుడు మరింత ఉధృతమయింది.

కదలకండా, మెదలకండా ఉన్న ఆ పిల్లను పడుకోబెట్టి దుప్పటిగప్పి, దీపాన్ని కొంచెం తగ్గించి, తనుగూడా మరో మంచం మీద ఒత్తిగిల్లాడు కేసన.

కేసనకు కొంచెం కునుకుబట్టిందో లేదో – మొల్ల ఛటుక్కున లేచింది.

"అయ్యా," అని పిలిచింది మొల్ల. "ఏమిటే తల్లీ," అంటూ కేసన ఆమెదగ్గిరకొచ్చి కూర్చున్నాడు – నిద్రలో ఆమె ఉలిక్కిపడ్డదేమోననుకొని. ఇవాళ మొల్లవైఖరి ఆయనకు భయసంభ్రమాలను కలిగించింది.

"ఏమిటమ్మా యివాళ యింతదీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?... నీ పెళ్లివిషయంలో ఆచారిగారన్నమాట లేనా?... నీ మనస్సులో ఉందేమిటో చెప్పుతల్లీ," అంటూ కేసన ఆమెతలను ముద్దుబెట్టుకున్నాడు.

"అయితే దేవుడున్నాడంటావా అయ్యా?" అంది మొల్ల. "లేకేమమ్మా–ఉన్నాడు," అని కేసన జవాబిచ్చాడు.

"ఎక్కడుంటాడయ్యా – ఆయన – ఎట్లాఉంటాడు?" అడిగింది మొల్ల. "ఎందుకమ్మా యీప్రశ్నలన్నీ నీకు?... ఇవి వేదాంతులకు, విరాగులకు సంబంధించిన ప్రశ్నలు. ఈ వయస్సులో నీకీ జిజ్ఞాస ఉండగూడదు. మనవాళ్లల్లో – ఏకుఱ్ఱాణ్ణో పెళ్లాడి – కాపురంచేసి – గృహస్థజీవితం గడుపు. అప్పుడు నీకు దేవుడు తప్పకండా అగపడతాడు," అన్నాడు కేసన.

"అయితే అయ్యా - పెళ్ళిచేసుకుంటే దేవుడు అగపడతాడంటావా ?"

"తప్పకుండా తల్లీ!... మగడేగా పెళ్ళానికి దేవుడు!"

"ఆ దేవుడు నాకక్కర్లేదయ్యా!..."

ఇల్లా తరిచితరిచి కూతురు ఎందుకడుగుతున్నదో కేసనకు అర్థంగావడంలేదు.

"అయితే అయ్యా - అసలు దేవుణ్ణి మనం ఎట్లాచూడగలుగుతామంటావు ?" అడిగింది మొల్ల - వేదాంతజిజ్ఞాసతో.

ఆ ప్రశ్నకు కేసన చిరునవ్వు నవ్వాడు. చిన్నతనపు ప్రశ్న అని ఆయనభావం. ఆమెకు నచ్చజెప్పడంకోసం "మనింట్లో దేవుడున్నాడుగదమ్మా" అన్నాడు కేసన. ఆ దేవుడు రాతిదేవుడంటూ తన నిరసనభావాన్ని చూపెట్టింది మొల్ల. కేసన ఆ మాటను కొద్దిగా నొచ్చుకున్నాడు.

"నిజమైన దేవుణ్ణి ఎవ్వరూ చూడలేరు తల్లీ! ఆయన నిరాకారుడు, నిరంజనుడు. కొన్నివందల ఏళ్లు అడవుల్లో తపస్సుచేసిన మహాఋషులుగూడా ఆయన్ని చూడలేరు," అన్నాడు కేసన.

"అయ్యా - ఆ సంగతి అట్లాఉంచు. నువ్వు కవివి. పురాణాలు, యితిహాసాలు ఎన్నోచూచావు. చిన్నతనంలో అసలైన దేవుణ్ణి చూచినవాళ్ళ కథలేమైనా నువ్వుచదివిన వాటిల్లో అగపడ్డాయా ?" అంటూ అడిగింది మొల్ల.

మొత్తానికి కూతురు గొప్పప్రశ్న వేసిందని తండ్రి కనిపెట్టాడు. ఇప్పుడు ఆయన సమాధానం యివ్వకుండా

తప్పించుకోలేకపోయాడు. సులభంగా ఆమెకుఅర్థ మయ్యేటట్లు ధ్రువోపాఖ్యాన్ని చెప్పాడు కేసన. ఆ కథను వింటూవింటూ మొల్ల కన్నుమూసింది. "ఇంతకూ నీ పెళ్లిసంగతి ఏమాలో చించుకున్నావో పొద్దున్నే నాకు చెప్పాలి," అన్నాడు కేసన – ఆమెమీద దుప్పటికప్పుతూ.

భగవంతుణ్ణి ఒకమాటు ధ్యానించుకొని కేసన తన మంచంమీదికెళ్లి నిద్రపోయాడు.

మొల్ల కన్నుమూసింది. గ్రామమండపందగ్గిర తన మాటలకు అక్కడివాళ్ళందరూ నవ్విననవ్వు ఆమెకు విన పడ్డది. వాళ్ల స్వరూపాలు గూడా ఆమెకు తనమానసవీధిలో అగపడ్డాయి. రంగనాయకి ఆమెకు గోచరించింది. సీతమ్మ గూడా ఆవిడకు అగపడ్డది. క్రమక్రమంగా ఆ రూపాలన్నీ ఆమె మానసవీధిలోనుంచి తొలగిపోయాయి. ఆమెలోని ఆత్మ, అంతరాత్మలు వివాదకు దిగాయి. పెళ్ళిచేసుకోమని – అయ్య మాట విని ఆయన్ను సంతోషపెట్టమని ఆత్మ చెప్పింది. 'మీ అమ్మ ఆశయాన్ని – నువ్వు గ్రామపెద్దలముందు మాట్లాడిన మాటల్ని నీ చేతల్లో అగపరుచు' అంటూ అంత రాత్మ ఆమెను ఉద్బోధపరిచింది. ఆత్మమాటలకంటే అంత రాత్మ ఉద్బోధలోనే ఆమెకు ఎక్కువబలం అగపడ్డది. 'దేవుణ్ణే పెళ్ళిచేసుకుంటా' అని తను అన్నమాట ఆమె చెవుల్లో గింగురు మంటూ ప్రతిధ్వనించింది.

మంచంమీదనుంచి లేచింది మొల్ల. గాఢనిద్రలో ఉన్న అయ్యను చూచింది. ఆయన ముఖంమీద బ్రహ్మ

తేజస్సు తాండవిస్తూంది. ప్రశాంతంగా ఉన్న ఆ అయ్య ముఖంచూస్తే ఆమెలో ఒకవిధమైన జాలి పుట్టుకొచ్చింది. అయ్య తనను ఎంత గారాబంగా పెంచాడు ?... తను ఎంత మొరటుగాను, దుడుకుగాను, పెంకెగాను ప్రవర్తించినా అయ్య తనను ఎంత ప్రేమతో చూచాడు ?... ఆయన నిజంగా ప్రేమస్వరూపుడు. ఆయన నిజంగా అహింసామూర్తి. క్షమ అంటే ఆయన. ఆయన అంటే క్షమ. ఆయనను చూస్తూంటే ఆమె కళ్లవెంట నీళ్లు జలజల రాలాయి. కాని ఆశయం మాటేమిటి ? తన సవాలుసంగతేమిటి ?... ఇవన్నీ జ్ఞాపకం వచ్చి ఆమె చిత్తాన్ని కఠినం చేశాయి. ఇంతవరకు ఎప్పుడూ, ఎవరికీ దండంబెట్టని ఆమెచేతులు ఒక్కమారుగా దగ్గిర కొచ్చాయి. తండ్రికి భక్తిపూర్వకంగా దండం పెట్టింది మొల్ల. 'క్షమించయ్యా,' అన్నభావం ఆ దండంలో లేకపోలేదు. కళ్ల నీళ్లు తుడుచుకొని – తలుపు గొళ్లెంతీసుకొని – వెనక్కు తిరిగి ఒక్కసారి చూచి – మొల్ల చీకట్లోబడి నడవసాగింది.

ఆనాడు అమావాస్య. ఆ కారుచీకట్లో తను ఎల్లాపోతున్నదో – ఎక్కడికి పోతున్నదో – ఆమెకే తెలియదు. ఆమెలోని మహాశక్తి, ఆమెలోని అకుంఠిత కార్యదీక్ష, ఆమెలోని ఆత్మవిశ్వాసం ఆమెను ముందుకు నడిపిస్తున్నాయి.

నడిరాత్రి కోడి 'కొక్కొరొకో' అంటు కూసింది. మొల్ల గోపవరగ్రామంయొక్క పొలిమేరల్ని దాటి వెళ్లి పోతూంది. కొత్తగా బిచ్చానికి బయలుదేరిన బుడబుక్కల

వాడి ఢమరుకస్వనమంత ఎక్కడో దూరాన్నుంచి ఆమెకు వినపడుతూంది.

వేకువజామయింది. కోడి తిరిగి కూసింది. కేసన నిద్రనుంచి లేచాడు. చేతులు జోడించి ఒకమారు ఆయన పరమాత్ముణ్ణి ధ్యానించాడు. మొల్ల మంచం వైపు చూచాడు. అక్కడ మొల్ల లేదు. ఎప్పుడూ పొద్దెక్కితేగాని లేవనిపిల్ల యివాళ పొద్దుపొడవకముందే లేవడానికి కారణం ఆయనకు దురూహ్యంగా ఉంది. రాత్రి ఆమె మాట్లాడిన మాటలు ఆయనలో భయ, సందేహాలను రేకెత్తించాయి.

కూతురుకోసం ఆయన గ్రామంలో వెదికాడు. కనపడ్డ ప్రతిస్త్రీని, ప్రతిపురుషుణ్ణి తన మొల్లను గురించి అడిగాడు. అందరూ "మాకు తెలియదంటే మాకు తెలియ"దన్నారు. మాలగూడానికి వెళ్ళి కేసన పోలిగాడితో యీ విషయం చెప్పాడు. పోలిగాడు విచారపడ్డాడు. 'ఒకవేళ మొల్ల ఆత్మహత్య చేసుకోలేదుగదా' అన్న అనుమానం కేసనను యిప్పుడు పట్టుకుంది. కేసన, పోలిగాడు గ్రామంలోని చెరువులు, బావులు వెతికారు. ఎక్కడా మొల్ల జాడ వాళ్ళకు అగుపడ లేదు.

ఇంతలోకే ఊరు, ఊరంతా పాకిపోయింది యీ వార్త. అమ్మలక్కలంతా ఎవరికి తోచినరీతిగా వారు యీ వార్తమీద వ్యాఖ్యలను సలిపారు.

రంగనాయకికి, సీతమ్మకు యీ వార్త తెలిసింది. వాళ్ల విచారం యింతా, అంతాగాదు. తమ యిష్టదైవాలయిన

మురళీ కృష్ణునకు, తులసెమ్మకు 'మొల్లను రక్షించు' అంటూ వాళ్ళు సాగిలబడి మొక్కారు.

ఎక్కడా తన కూతురుజాడ తెలియని కేసన తిరిగి తనయింటికి జేరాడు. రోలువైపుచూస్తే మొల్ల ఆయన కళ్ళల్లో పొడగట్టింది. ఆయన గుండె నీరయిపోయింది. లోపలికివెళ్ళి – ఆయన శ్రీకంఠమల్లేశుని ముందు సాగిలబడి, "నాతల్లిని – నామొల్లను రక్షించు తండ్రీ," అని ప్రార్థించాడు.

మొల్ల ఊరినుంచి వెళ్లిపోయినవార్తను చర్చించడానికి పెద్దలంతా గ్రామమండపంలో సమావేశమయ్యారు. గోప వరానికి పీడ తొలిగిపోయిందన్నాడు అవధాని. "ఇక వాడున్నాడు – వాడి భరతంగూడా మనం పట్టకతప్పదు," అంటూ కేసన నుద్దేశించి అవధాని, ఆచారిని హెచ్చరించాడు.

"వాడిపని నేను చూసుకుంటానండీ – వాడిప్పుడు కోరలుతీసినపాము – అదంతా నాకొదిలెయ్యండి," అన్నాడు బొజ్జయ్యచెట్టి – చిగురించిన ఆత్మవిశ్వాసంతో.

ఆచారి ఆలోచనలో పడిపోయాడు. మొల్ల సాధారణజీవి కాదని ఆయనకు తెలుసు. ఇంతకూ అది ఎక్కడికి పోయినట్లు?...

"ధర్మమేవ జయతే!... ఆచార్లగారూ – చేసుకున్న వాళ్లకు చేసుకున్నంత మహాదేవ!... దానికర్మం అది అనుభ వించింది. అది మళ్లీ ప్రాణంతో యీ ఊళ్లో అడుగుబెట్టడం ఘన్న. అనుమానాలు, భయాలు అల్లాంటివేం పెట్టుకోకండా మనం యివాళ హాయిగా విశ్రాంతితీసుకోవచ్చు," అన్నాడు అవధాని – యింకా ఆలోచనలోనే ఉన్న ఆచారితో

## 4

కనుగొనదలచిన మనసా!

దేముడు

కనబడితీరును తెలుసా!

"కలడ"ను ధృఢవిశ్వాసము కావలె

"తిలకించెద" నను దీక్షయుండవలె

కనుగొన......

మమత చీల్చికొని, మనసు నిల్పికొని

శ్రమలకోర్చి యాత్మార్పణసలిపి

కనుగొన......

అతనిశక్తి కెనలేదు, లేదు లే

దతడు లేని తా వసలని నమ్మా

కనుగొన......

– యీ తత్వాన్ని తన ఏకతారమీద పాడుతున్నాడు ఆ సన్యాసి– నిర్మానుష్యప్రదేశంలో ఒక చెట్టుక్రింద కూచొని. ఆయన నిమీలితనేత్రాలు ఆయనలోకే తొంగిచూస్తున్నాయి. భౌతికప్రపంచం ఆయనకు అగపడటంలేదు.

జిజ్ఞాసతో ముందుకు నడుస్తున్న మొల్ల యీ తత్వాన్ని విన్నది. ఆమెకు ఒకవిధమైన ఆనందం కలిగింది. ఆడబోయిన తీర్థం ఎదురైనట్టుంది ఆమెకు. సన్యాసిదగ్గిర కొచ్చి కూర్చుంది ఆమె – పాటవింటూ.

కొంతసేపయ్యాక సన్యాసి మొల్లను చూచాడు. ఆమె ఆకారం ఆయనకు వింతగా తోచింది. "ఎవరమ్మా నువ్వు – ఎక్కడికివెళ్తున్నావు? అడిగాడా సన్యాసి.

"నే నొక కుమ్మరిపిల్లను. దేవుణ్ణి చూడడంకోసం బయలుదేరా. నువ్వా దేవుణ్ణిగూర్చి పాడుతూంటే – నీ కాయన సంగతి తెలిసుంటుందని యిక్కడకొచ్చా. మరి ఆయన ఎక్కడుంటాడో చెప్పగలవా ?" అని అడిగింది మొల్ల – సన్యాసిని.

ఆమె స్వరూపాన్ని చూసి సన్యాసి ఫక్కున నవ్వాడు. "నువ్వొక పిచ్చిదానిలాగా ఉన్నావు. ఏకాగ్రచిత్తులైన మహర్షులు – జితేంద్రియులైన మహర్షులు ఆయన్ను చూడ గలుగుతారు. నీలాంటివాళ్లు, నాలాంటివాళ్లు ఆయన్ను కనుక్కోలేరు. పాపం నువ్వు చిన్నపిల్లవు. ఏమీ తెలియక యిల్లా బయలుదేరినట్లున్నావు!... నీ వాలకంచూస్తే నీకింకా పెళ్లవనట్లు అగుపిస్తూంది. పిచ్చిపిచ్చికోర్కెలొది లేసి – తిన్నగా మీఊరికెళ్లి, లక్షణంగా పెళ్లి చేసుకొని– పిల్లల్ని కను," అన్నాడు ఆ సన్యాసి.

సన్యాసిమాటలు ఆమె పట్టుదలను మరింత దృఢం చేయడానికి ఉపకరించాయి. "ముందువేసిన అడుగును వెనక్కుతీసే తత్వం గాదు నాది," అంది మొల్ల – ఆవేశంతో.

ఆమె సాధారణపు పిల్లగాదని – మొత్తానికి దీక్షతో బయలుదేరిన ఘటమని తెలుసుకొన్నాడు సన్యాసి. "అయితే నువ్వు దేనికి దేవుణ్ణిచూడడానికి బయలుదేరావు ?" అంటూ సన్యాసి ప్రశ్నించాడు.

"ఆయన్ను పెళ్లిచేసుకోవాలని," అంది మొల్ల – తన పిచ్చిఆవేశంతో. సన్యాసికి ఆమెనుచూస్తే జాలికలిగింది.

"నేనొక మాట చెప్తా విను. దేవుడు నిరాకారుడు. నిరంజనుడు. భౌతికంగా ఆయన్ను నువ్వు చూడలేవు. ఒక రూపాన్ని నీకళ్ళల్లో చిత్రించుకో. ఆరూపంకోసం నువ్వు అహర్నిశలు కృషిచేస్తే – నీ కర్మపరిపక్వమయితే – అది నీకు భౌతికంగా అగుపడుతుంది. 'యద్భావం తద్భవతి' అన్నారు పెద్దలు," అన్నాడు సన్యాసి.

ఇరవయిఏళ్ల బాలకుమారుడుగా దేవుడు తనకు అగపడాలని కోరుకుంటున్నట్లు ఆమె సన్యాసితో చెప్పింది. "అయితే ఆస్వరూపాన్నే నువ్వు చూస్తూ – ముందరికి వెళ్లు. ఏ అవాంతరాలొచ్చినా వెనక్కు తగ్గకు. శాంతికి నిలయమైన ఆ అడవివైపుకుపో. అక్కడే నీకు నీకళ్ళల్లో చిత్రించుకున్న స్వరూపంమీద ఏకాగ్రత లభిస్తుంది. ఏకాగ్రచిత్తంతో ఆయన్ను ధ్యానిస్తే – ఆయన నీకు తప్పకుండా ప్రత్యక్షమవుతాడు. కాని ఒక్కవిషయం. ముందుకు పోకండా – యింద్రియాలకు లొంగిపోయి – వెనక్కు తిరిగిచూశావంటే నువ్వు చేస్తున్న కృషిఅంతా వృధాఅవుతుంది. ఎండనకండా వాననకండా, చీకటి అనకండా, వెలుతురనకండా నువ్వు ముందుకు పోతున్నదానివి పోతూనేఉండాలి. పోతూ పోతూ 'దేవుడూ' అంటూ బిగ్గరగా పిలవాలి. అల్లా పోంగా, పోంగా – పిలవంగా, పిలవంగా – దేవుడు నీ పిలుపుకు జవాబిచ్చి – అగపడతాడు," అని చెప్పాడు సన్యాసి.

ఆ సన్యాసిమాటలు ఆమెకు తారకమంత్రసదృశంగా

తోచాయి. మొల్ల లేచి ముందుకు నడిచింది – 'దేవుడూ', 'దేవుడూ', అని బిగ్గరగా పిలుస్తూ.

పుట్టల్ని, గుట్టల్ని, పొదల్ని, దాటుతూ మొల్ల ముందుకు సాగిపోయింది. ఎంతదూరంపోయినా – ఎన్ని పిలుపులు పిలిచినా – తన కేకల ప్రతిధ్వని తప్ప ఆమెకు యితరధ్వనులేమీ వినిపించటంలేదు.

పోయిపోయి అడవిలో ప్రవేశించింది మొల్ల. కాళ్లకు ముళ్లు గుచ్చుకుంటున్నాయి. ఆమె ఆ బాధను లెక్క చెయ్య లేదు. రాళ్లు రప్పలు ఆమె కడ్డొచ్చాయి. వాటినికూడా సరకు చెయ్యకుండా ఆమె శరవేగంతో ముందుకు లంఘించింది – 'దేవుడూ' అంటూ కేకలేస్తూ.

దారిలో ఒక పెద్దకొండ యిప్పుడావిడకు అడ్డొచ్చింది. ఆకొండ ఎక్కింది మొల్ల. ఆమె కేకలకు గుహల్లోని సింహాలు, పెద్దపులులు బయటికొచ్చాయి. భయోత్పాతమయిన అరుపులు అరిచాయి అవి. ఆ అరుపులు ఆమె చెవి కెక్కలేదు. అకుంఠిత కార్యదీక్షతో, మొక్కవోని సాహసంతో – తను చిత్రించు కొన్న స్వరూపంమీద దృష్టి లగ్నంచేసి – మొల్ల ఆ కొండ ఎక్కింది. త్వరలో శిఖరానికి చేరుకుంది. అక్కడినుంచి ఆమె అటువైపు చూచింది. బ్రహ్మాండమైన కార్చిచ్చు అడవిని దహించేస్తూంది.

ఆ కారుచిచ్చు తనవైపుకే వస్తున్నట్లు ఆవిడ భావించింది. వెనక్కు తగ్గలేదు. సన్యాసి చెప్పిన తారకమంత్రం ఆవిడ చెవుల్లో ప్రతిధ్వనించింది. 'దేవుడూ' అని కేకలేస్తూ ఆవిడ

కార్చిచ్చుకు అభిముఖంగా పోయింది. ఆమె దేహమంతా కంపించిపోతూంది. ఒళ్ళంతా రక్తసిక్తమయింది.

కొంతదూరంపోయాక ఆవిడకు కళ్ళు అగపడలేదు. అయినా ఆవిడ ముందరికి లంఘించింది. గొంతు సన్నగిల్లింది. నరాలు పట్లుతప్పాయి. 'దేవుడూ' అంటూ ఆవిడ ఒక పెద్ద కేక వేసింది. 'ఓయ్' అంటూ సమాధానం వచ్చిం దావిడకు. పోతున్న ప్రాణం ఆవిడలో మళ్లీ కుదటబడ్డది. ఆ ధ్వని ఏవైపునుంచొచ్చిందో ఆ వైపుకు ఆవిడ నడిచింది. ఎంత దూరం నడిచినా — కార్చిచ్చు ఆవిడకు తగలలేదు. కేక వేసిన వ్యక్తిని ఆవిడ చేరుకోలేదు. ముందుకు వెళ్లింది, వెళ్ళింది మొల్ల. ఆఖరుకు ఆమె ఒక గుహలోకి అడుగుబెట్టింది. ఆమె ప్రాణాలు తావులు దప్పాయి. మూర్ఛొచ్చింది. ముందుకు అడుగువెయ్యలేక 'దేవుడూ' అంటూ ఆ మహాశక్తి అక్కడ పడిపోయింది.

అడవిలో దేవుడికోసం కూతురు యిల్లా అల్లల్లాడుతూ ఉంటే గోపవరంలో తండ్రి కేసన — నిద్రాహారాలు లేకండా — శ్రీకంఠమల్లేశుని ముందు సాగిలబడిపోయాడు. దేవునిముందు దివ్యజ్యోతి వెలుగుతూంది.

మహాభక్తుడు కేసనయొక్క ప్రార్థనకు ఎంతబలముంది ? అడవిలోని కార్చిచ్చు క్రమక్రమంగా తగ్గిపోయింది. ఆఖరుకు అది ఒక చిన్నజ్యోతిగా రూపుదైకొంది. ఆ జ్యోతిలోనుంచి యిరవయిఏళ్ళ యువకుడొకడు బయలుదేరాడు. అతనిది

దివ్యసుందర విగ్రహం. తలమీద అగ్నిశిఖ వెలుగొందు తూంది. వేషం అతనొక కోయకుర్రాడని తెలుపుతూంది.

మొల్ల పడిపోయిన గుహలోకి అడుగెట్టాడు. కోయ పిల్లవాడు. చీకట్లో అక్కడున్న ఆముదపు దీపం వెలిగించి, గుహంతా కలయజూచాడు. స్పృహతప్పి పడున్న మొల్ల అతని కంటబడ్డది.

దగ్గరకెళ్ళి 'లేలే' అంటూ అతను మొల్లను లేపాడు. ఆతని చేతి స్పర్శతో ఆమెకు చైతన్యం వచ్చింది. దిగ్గున లేచింది మొల్ల.

"ఎవరు నువ్వు ?... నన్నడక్కుండా, పెట్టకండా - నా గుహలో ఎందుకు ప్రవేశించావు?" అని గద్దించాడు ఆ యువకుడు.

దుడుకుపిండపు ధోరణిలో అతనల్లా ప్రశ్నించేసరికి మొల్లకుకూడా పట్టరానంత కోపం వచ్చింది.

"నువ్వెవరు ?... ఈ గుహ నీదని ఎక్కడన్నా రాసి పెట్టుందా ? గప్‌చిప్‌గా వెళ్ళిపో !... లేకపోతే ఏంకావాలో అదే జరుగుతుంది," అంది మొల్ల - ఆవేశంతో.

ఇద్దరిమధ్య మాటలు ముదిరాయి. ఒకరికొకరు ఏ విధంగాను తీసిపోవడంలేదు. ఒకరిని చిత్తుచెయ్యడానికి యింకొకరు ప్రయత్నించారు. క్రమక్రమంగా మాటలు చేతల్లోకి దిగాయి. కోయకుర్రాడు మొల్లను బయటికి నెట్టాడు.

ఆ యువకుడు సామాన్యుడుగాడని, మాటల్లో, చేతల్లో తనను మించినవాడని మొల్ల యిప్పుడు తెలుసుకుంది.

ఆమెలోని మొరటుతనం, ఆవేశం తగ్గిపోయాయి. "అసలు నువ్వెవరవో చెప్పవు?" అంటూ దీనంగా మొల్ల అతన్ని సమీపించింది.

"అల్లారా దారికి," అన్నాడు ఆ యువకుడు - విజయ గర్వంతో. "మా నాన్న నన్ను 'దేవుడూ' అని పిలుస్తాడు. మా అమ్మ నాకు 'అగ్గి' అని పేరెట్టింది."

'దేవుడు' - యీ పేరు ఎంత బాగుంది?... దేవుడు కోసమేగా తను యిన్ని తిప్పలుబడ్డది?... మరి యీ 'దేవుడు' తను కాంక్షిస్తున్న దేవుడా - లేక - దేవుడని పేరుబెట్టుకొని తనను మోసంచేయడానికొచ్చిన కోయకుఱ్ఱాడా?... ఈ ప్రశ్న ఆమెను వేధించింది.

అతను నిజమైన దేవుడో, కాదో తెలుసుకోవడానికి మొల్ల అతనిమీద సునిశితమైన తన ప్రశ్నలబాణాలను వదిలింది. తను ఎవరైందీ ఆమెకు అర్థంగాకండా చెప్పాడు ఆ యువకుడు - తన చాతుర్యాన్ని ప్రదర్శిస్తూ.

అతను నిసలైన దేవుడైనా, కాకపోయినా మొత్తానికి అతని మోహనమూర్తి ఆమెను ఆకర్షించింది. అతని మాటలు ఆమెకు అమృతతుల్యంగా ఉన్నాయి.

"అసలు నువ్వెవరవు? - యీ అడవిలో కెందు కొచ్చావు?" అని అతను మొల్లను ప్రశ్నించాడు.

"మానవమాత్రుణ్ణి గాకండా దేవుణ్ణి పెళ్లి జేసుకో వాలనే ఉద్దేశంతో యీ అడవికొచ్చాను. ప్రతిజ్ఞ, దీక్షలు

నన్ను యీవిధంగా ప్రేరేపించాయి," అని మొల్ల సమాధాన మిచ్చింది.

ఈ మాటలకు ఆ యువకుడు పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వాడు. 'దేవుడు' 'పెళ్లి' - యీ రెండుమాటల్ని అతను పదే పదే ఉచ్చరించాడు. తనను ఆటలు బట్టిస్తున్నందుకు అతన్ని ఆవిడ చురచుర చూసింది.

"అసలు పెళ్లంటే ఏమనుకుంటున్నావు ?" అడిగాడు. కోయకుఱ్ఱాడు.

పెళ్లంటే - ఏమిటో చెప్పలేక ఆమె నాలుకవెళ్ల బెట్టింది. చిన్నప్పటినుంచి ఆమె పెరిగిన పెరుగుడు, తిరిగిన తిరుగుడు ఆమెకు స్త్రీత్వాన్ని అబ్బచేయలేకపోయాయి.

పెళ్లంటే ఏమిటో చెప్పలేక తికమక పడుతున్న మొల్లనుచూచి ఆ యువకుడు జాలిపొందాడు.

"పెళ్లంటే ఏమిటో చెప్పలేకపోతున్నావునువ్వు. మరి నేను చెప్తా విను. పెళ్లంటే ప్రకృతి, పురుషుల సంయోగం. రెండు ఆత్మల అనుసంధానం. ఇంతకూ నిజమైన స్త్రీయే పెళ్లియొక్క పరమార్థాన్ని గుర్తించగలుగుతుంది. నువ్వు నిజమైన స్త్రీగా నాకు అగుపించడంలేదు. నీ బాహ్యస్వరూపంలో, ఆంతరంగిక స్వరూపంలో స్త్రీత్వం వెల్లివిరియాలి. స్త్రీత్వానికి కొన్ని లక్షణాలున్నాయి. 'బొట్టు,' 'కట్టు,' 'జుట్టు,' - యివి బాహ్యస్వరూపానికి చెందినవి. వీటిల్లో నీలో గొప్పమార్పు రావాలి. తరువాత ఆంతరంగికంగా నీలో స్త్రీత్వం పెంపొందాలి. అంటే ఏకాగ్రత, జితేంద్రియత్వం

నీకు అబ్బాలి. బాహ్యంగా, ఆంతరంగికంగా నువ్వు స్త్రీత్వాన్ని పొందాక – అప్పుడు నువ్వు పెళ్లి·విషయం ఆలోచించాలి. ఆ పెళ్లి గూడా నువ్వు దేవుడితో చేసుకోవా లనుకుంటున్నావు. ఇది అల్లాటప్పా వ్యవహారం కాదు. దీనికి కథ, కమాయిషు చాలాఉంది," అన్నాడు ఆ యువకుడు.

మొత్తానికి ఆ యువకుడు తనకు విజ్ఞానజ్యోతిని చూపెడ్తున్నట్టు ఆమె భావించింది. అతను చెప్పిన లక్షణాలను అలవఱచుకొని – నిజమైన స్త్రీత్వాన్ని బాహ్యంగాను, ఆంత రంగికంగాను పొంది – అతని సహాయంతో – నిజమైన దేవుణ్ణి పెళ్ళిచేసుకోవచ్చు ననుకుంది మొల్ల.

"నువ్వు చూస్తే అన్నివిషయాలు తెలిసినవాడులాగా అగపడుతున్నావు. ముందు నా బాహ్యస్వరూపంలో– అంటే నా కట్టులో, బొట్టులో, జుట్టులో – నేను ఏ యే మార్పులు ఎల్లా తెచ్చుకోవాలో చెప్తే అల్లాచేస్తా – ఆ తరువాత నా ఆంతరంగిక స్వరూపానికి సంబంధించిన మార్పుల్ని చెప్పువు గాని. ఈ కీకారణ్యంలో నీకంటె నాకు తోడు ఎవ్వరూ లేరు. నీవు చెప్పినట్లు చేస్తానని ఒట్టుపెట్టుకుంటున్నా," అంటూ మొల్ల అతని పాదాలు పట్టుకుంది.

మొల్లలో క్రమక్రమంగా వస్తున్న పరివర్తనానికి ఆ యువకుడు సంతోషించాడు.

"నాకేదో నీకంటె ఎక్కువ తెలుసుననుకుంటున్నావు. నిజంగా నీకెంత తెలుసో – నాకూ అంతే తెలుసు – దేవుణ్ణి చూడ్దామని నేను – పెళ్లిచేసుకోవాలని నువ్వు తహతహ

పడుతున్నాం. మనిద్దరం ఒకబాటనే పట్టాం. నాచేతనయినంత వరకు నిన్ను నాతో ముందుకు నడిపించుకుపోతా. మరేం దిగులుపడకు. రేపటినుంచి నీకు పాఠాలు ప్రారంభిస్తా. పాపం బాగా అలిసిపోయినట్లు అగపడుతున్నావు. నీ ఒళ్లుగూడా నుగ్గునుగ్గు అయిపోయింది. ఇవాళ పూర్తిగా విశ్రాంతితీసుకో," అంటూ ఆ యువకుడు ఆమెకు పళ్ళను, కొండతేనెను యిచ్చాడు. అతని సరసన కూచొని ఆవిడ వాటిని తీసుకుంది. ఇప్పుడు ఆమెకు ఎంత హాయిగాఉంది ?

చెయ్యి పట్టుకొని ఆ యువకుడు మొల్లను గుహాలోకి తీసుకుపోయాడు. అక్కడ దీపాన్ని వెలిగించాడు. "ఇక్కడ నువ్వు పండుకో – అక్కడ నే పండుకుంటా – నీకేం భయం లేదులే !" అంటూ ఆ యువకుడు ఆమెకు ధైర్యంచెప్పాడు.

మొల్ల పడుకుంది. అతనూ ఆమెకు దూరంగా పడుకున్నాడు. అతని మోహనమూర్తి ఆమెలో స్త్రీత్వాన్ని ఉత్పన్నం చేసింది. ఆమె మనస్సు పరిపరివిధాల పోయింది. నిద్రపట్టింది. గోపవరం – తనతండ్రి కేసన – దేవదాసి రంగనాయకి – సీతమ్మ – తనను రెచ్చగొట్టిన ఆచారి, అవధానులు– తనను పిచ్చిదాన్నిగా చేసి ఎగతాళిబట్టించిన గ్రామప్రజలు – తనకు అడవికి మార్గం చూపెట్టిన సన్యాసి- అందరూ ఆవిడకు కల్లో అగుపడి – ఆమె కార్యదీక్షకు ఊపును, ఊతను యిచ్చారు.

ఇంతకూ ఆ యువకుడు – ఆ మోహనమూర్తి – ఎవడై యుంటాడు ?

## 5

పతివ్రతల్లో రెండు రకాలు. ఏ పరిస్థితుల్లోను పతికి ఎదురుచెప్పకండా ఉండేవాళ్ళు ఒకరకం. పతి తప్పుదారిన నడుస్తూంటే – మంచిమార్గంలో పెట్టడానికి నయాన, భయాన చెప్పేవాళ్లు మరోరకం. సీతమ్మ యీ రెండోరకానికి చెందిన పతివ్రత. తన భర్తలో అహంకారాన్ని పోగొట్టడమే ఆవిడ జీవితపరమావధి.

తులసిపూజ ముగించుకొని సీతమ్మ – యింట్లో తాళ పత్రగ్రంథాలు తిరగేస్తున్న భర్తదగ్గరకొచ్చి – భక్తిపురస్సరంగా ప్రసాదం యిచ్చింది. ఆ ప్రసాదం పుచ్చుకుంటూ ఆయన ఆవిడను చుఱచుఱ చూచాడు. ఆవిడ చిన్నబుచ్చుకుంది.

"నీకు ఎన్నోసార్లు చెప్పాను – మగవాళ్ల విషయాల్లో జోక్యం కలిగించుకోవద్దని. కాని నువ్వు వినవు. స్వాతంత్ర్యం యిచ్చినందుకు పదిమందిలోగూడా నువ్వు నాకు నీతులు చెప్తాన్తావు!... పూజలు, పునస్కారాలు చేస్తావు – ఏం లాభం?... మగని మనస్సును ఏ మాత్రం నొప్పించకండా ఉన్నావిడే పతివ్రత!" అన్నాడు ఆచారి.

మగని తప్పుల్ని సరిదిద్దగలిగిన ఆవిడే తనదృష్టిలో పతివ్రత అంది సీతమ్మ. దాంతో ఆచారికి మరీ కోపం వచ్చింది.

"నీ వల్ల నాకు సుఖం ఆవగింజంతకూడా కలగడంలేదు. శృంగారం మాట అల్లావుంచి నువ్వు గొడ్రాలువు. మన వంశం

నీతో, నాతో అంత మొందాలసిందే!... నిన్ను కట్టుకున్నందు వల్ల నా కేమాత్రం యీ జీవితంలో శాంతి లేదు," అన్నాడు ఆచారి - చికాకుపడుతూ.

అక్రమాలు, అన్యాయాలు చేస్తున్నవాళ్ళకు అశాంతి తప్పదంది సీతమ్మ. తన జీవితంలో తనేమి అక్రమాలు చేశాడో వివరించి చెప్పమన్నాడు ఆచారి.

కేసనను, మొల్లను ఆయన ఎల్లా హింసించాడో - అదంతా ఏకరువుబెట్టింది సీతమ్మ. మగని లోటుపాట్లను వెదకి, ఆయనకు అశాంతినిచ్చే ఆవిడ పతివ్రత అనబడదని ఆచారి ఉద్ఘాటించాడు. సీతమ్మ ఛట్టున రామాయణ మహా కావ్యాన్ని తీసుకొని - అందులో రావణునకు మండోదరి నీతు లుపదేశిస్తున్న ఘట్టాన్ని చదివింది. ఆచారి తోక తొక్కిన తాచులాగా లేచాడు.

"అయితే నన్ను రావణునితో పోలుస్తున్నావా?" అన్నాడు ఆచారి.

"ఒకరు పోల్చడమేమిటి - మీ అద్దంలో మీరే చూచుకుంటే మీకావిషయం చక్కగా బోధపడుతుంది," అంది సీతమ్మ.

ఆచారి ఉగ్రుడయ్యాడు. తన చేతికఱ్ఱను తీసుకొని సీతమ్మను కొట్టబోయాడు. సమయానికి అవధాని అక్కడకు వచ్చాడు. అవధానిని చూచి ఆచారి ఒకవిధమైన సిగ్గుతో వెనక్కు తగ్గాడు. ఆచారి, ఆయనభార్య మధ్య ఎప్పుడూ జరుగుతున్న రభస అవధానికి తెలియకపోలేదు.

"మీరు లేవండి ఆచార్లగారూ!... కేసనకు మన మిచ్చిన వారంరోజుల గడువు యీనాటితో తీరిపోయింది. గ్రామమండపందగ్గిర తక్కినపెద్దలు మనకోసం కాచుకో నుంటారు," అన్నాడు అవధాని. ఇద్దరూ కలిసి గ్రామ మండపానికి వెళ్ళారు.

అక్కడ శరభరాజు, బొబ్బయ్యచెట్టి, సుబ్బారెడ్డి యిదివరకే చేరారు. వెట్టిరాముడు కేసనను మండపంముందు నిల్చోబెట్టాడు. ఆచారి, అవధాని రావడంతోటే న్యాయసభ ప్రారంభమయింది.

కనకయ్య, తిక్కనగూడా మండపందగ్గిరకు అప్పుడే చేరారు. మాలమాదిగలు పోలిగాడితో అక్కడికొచ్చారు.

మొల్లకు పెళ్ళిచెయ్యకండా – రహస్యంగా దాన్ని ఎక్కడికోపంపి – దయా, దాక్షిణ్యాలతో తనుయిచ్చిన అవకాశాన్ని దుర్వినియోగంచేసి – తన ఆజ్ఞను ఉల్లంఘించి నందుకు ఆచారి కేసనమీద ఉగ్రుడయ్యాడు.

"బహుశా మామ పిల్లదాన్ని దేవుణ్ణి పెళ్లిచేసుకు రమ్మని పంపించుంటాడు," అన్నాడు తిక్కన ఎకసక్కెంగా.

అక్కడివాళ్ళంతా గొల్లున నవ్వారు. కూతురు జాడ తెలియక, నిద్రాహారాలు పూని మంచంపట్టిన కేసనకు యీ హేళన గోరుచుట్టుమీద రోకటిపోటుగా ఉంది.

"బాబూ – నేను నిర్భాగ్యుణ్ణి. నా ఆశాజ్యోతి కూతురు గూడా నన్నువిడిచి వెళ్లిపోయింది.. అది చచ్చిందో, బతికుందో తెలియదు. ఇంక యీ ప్రపంచంలో నా కెవ్వరూ

తేరు. మీ ఆజ్ఞ నుల్లంఘించానని నేను ఒప్పుకుంటున్నా. మీ కిష్టమొచ్చిన దండన నాకు విధించండి. పెద్దలు మీరు; మీ రేంచేసినా నేను సంతోషపూర్వకంగా స్వీకరిస్తా." అన్నాడు కేసన - వైరాగ్యభావంతో - ఆచారినీ చూసి.

ఇంతకుముందు యివ్వబడ్డ తీర్పు ప్రకారం కేసనయొక్క యిల్లు, యింట్లోసామగ్రి, పొలం జప్తుకు గురికావాలని - కేసన యీ ఊరునుంచి కట్టుగుడ్డలతో వెళ్లిపోవాలని అవధాని ఉద్ఘాటించాడు.

"మరి నా అప్పుమాటేమిటి ?" అన్నాడు బొజ్జయ్యచెట్టి- దీనమొగంవేసి.

"తనకు తాకట్టుబెట్టిన యింటిని, పొలాన్ని బొజ్జయ్య చెట్టి తీసుకోవచ్చు. గొడ్డు, గోదను - యింట్లో తప్పాల సామగ్రిని న్యాయస్థానం జప్తుచేస్తుంది,". అంటూ ఆచారి అధికారరీత్యా తన తీర్పును పునరుద్ఘాటించాడు.

"అల్లాగే వెళ్ళిపోతాను బాబు - కాని, నాదొకమనవి. ఇంట్లో శ్రీకంఠమల్లేశ్వరుని విగ్రహాన్ని, దీపారాధన కుందిని నా వెంట తీసుకుపోవడానికి అనుమతి నివ్వండి. ఇంతకంటె మీ పెద్దల్ని నేను కోరేదేం లేదు," అంటూ నివేదించాడు కేసన.

ఇంట్లోనుంచి పూచికపుల్లను కూడా కేసన బయటికి పట్టుకెళ్లడానికి వీలులేదన్నాడు అవధాని.

అహింసామూర్తి, చిక్కి-శల్యావశిష్టుడయిన కేసనను చూస్తే ఆచారికి నిజంగా జాలివేసింది. ఎల్లాగయినా కేసన మొల్ల అంత హానికరమైన జీవి కాదు. కేసనను యింకా

హింసించడం చచ్చినపామును యింకా చంపడమవుతుందని భావించాడు ఆచారి. "కేసనా!... నువ్వుపోయి మాలపల్లిలో ఉండొచ్చు. నీవుకోరిన ప్రకారం శ్రీకంఠమల్లేశునివిగ్రహాన్ని, దీపారాధన కుందిని నీవెంట తీసుకుపోవచ్చు. కాని నీకు ఒక హెచ్చరిక యిస్తాను. మాలపల్లిలో శైవమతప్రచారం చేశావంటే అక్కడనుంచి కూడా నిన్ను వెళ్ళగొడ్తాం. మాల, మాదిగలు ఎప్పుడూ, ఎవరిమీదా తిరుగుబాటు చేయకుండా చూసే బాధ్యత నీది," అన్నాడు ఆచారి - తన ఉదారతను చూపెడుతూ.

ఆచారి ఉదారతనుచూస్తే అవధానికి అరికాలిమంట నెత్తికొచ్చింది. కేసనను చుట్టుపక్కల ఉండనిస్తే - ఎప్పుడైనా తనకు, యితరగ్రామపెద్దలకు ఏదోవిధంగా ముప్పుతీసుకొస్తాడని ఆయన భయం.

"మాలపల్లిగూడా గోపవరంలో చేరిందేగా ?" అన్నాడు అవధాని - కటకటబడుతూ. "మాలపల్లి గోప వరంలో చేరిందిగా"దన్నాడు ఆచారి గంభీరంగా.

అగ్రహారపు న్యాయస్థానంనుంచి ఆచారియిచ్చిన తీర్పు పోలిగాడికి ఎంతో ఆనందాన్నిచ్చింది. కేసన కనీసం మాల పల్లిలో ఉండడానికైనా ఆచారి ఒప్పుకున్నందుకు పోలిగాడు ఆయనకు చేయెత్తి దండంబెట్టాడు.

న్యాయసభాకార్యక్రమం గ్రామమండపంలో ముగిసింది. "రా కేసనబాబూ," అంటూ పోలిగాడు, మాలమాదిగలు కేసనను తీసుకుపోయారు.

ఇంటికి పోవడానికి ఆచారి లేచాడు. "మళ్లీ మీ యింటి కెందుకు?... అక్కడ మీకూ, మీ భార్యకూ ఎప్పుడూ ఏదో గొడవేగా!... ఇల్లారండి - రంగనాయకి యింటికి వెళ్దాం - కొంతకాలక్షేపమన్నా అవుతుంది," అన్నాడు అవధాని. ఆచారికి కూడా అల్లాగే తోచింది.

ఇద్దరూ కలిసి రంగనాయకి యింటికి వెళ్లారు.

మురళీకృష్ణుని తన నిజనాధునిగా భావించి - ఆయన మ్రోల భక్తిపురస్సరంగా నృత్యంచేస్తున్న రంగనాయకి వారిద్దరికి స్వాగతమిచ్చింది.

"రంగనాయకీ! ఎందుకు నీకు యీ యౌవనంలో యీ భక్తిప్రసక్తులు!... దేవదాసి వయినంతమాత్రంచేత నీ యౌవనాన్ని యిలా గంగపాలు చేసుకోవలసిందేనా?... ఇల్లా ఐహిక వాంఛలకు నువ్వు దూరంకావలసిందేనా?... ఏం తప్పులేదు. మహాపండితుడు, వేదశాస్త్రపారంగతుడు, గోసవరపు అగ్రహారీకుడు, రసికాగ్రేసరుడు అయిన రామాచారిగారు నీ రూపలావణ్యాలను చూచి మోహ పరవశుడయ్యాడు. ఎక్కడో పరలోకసుఖాలకోసం యిహలోక భోగాలను ఎందుకు త్యజిస్తావు!... ఆచారిగారి ప్రాపు సంపా దించుకో. సుఖంగా ఉండు. మీ యిద్దరిమధ్య నేను యిక్కడ ఉండదలుచుకోలేదు. వెళ్ళిపోతున్నా," అంటూ పీఠికను ఏకరువుపెట్టి అవధాని మెల్లగా రంగంనుంచి నిష్క్రమించాడు.

కామలోలుడయిన ఆచారి తన 'శృంగారలీలాతరంగిణి' నుంచి కొన్నిశ్లోకాలు ఎత్తి చదివి - రంగనాయకి హృద

యాన్ని చూఱగొనటానికి ప్రయత్నించాడు. కాని ఆయన ప్రయత్నాలు బూడిదలోపోసిన పన్నీరవుతాయి. ఆయన చిత్తవైకల్యానికి చింతించి రంగనాయకి ఆయన్ను సన్మార్గంలో పెట్టడానికి ఎంతో ప్రయత్నించింది. కాని కామాంధుడయిన రామాచారి మన్మథబాధకు లోనయ్యాడు. అక్కడనుంచి కదలనంటూ ఆచారి రంగనాయకి ప్రణయానుభూతికి అఱ్ఱులు సాచాడు.

కామాతురుడైన రామాచారి రంగనాయకి యింట్లో మన్మథ వికారచేష్టల్ని ప్రదర్శిస్తూఉంటే – యిక్కడ కేసన యింటిముందు విషాదాంతనాటకం ప్రారంభమవుతుంది.

శరభరాజు, బొజ్జయ్యచెట్టి, సుబ్బారెడ్డి, కనకయ్య, తిక్కన, పోలిగాడు మొదలయినవాళ్లంతా కేసన యింటిముందు జేరారు. బొజ్జయ్యచెట్టి యింటిని, పొలాన్ని అప్పుకింద స్వాధీనపరచుకున్నాడు. శరభరాజు, సుబ్బారెడ్డి గొడ్డుగోదని, యింట్లోఉన్న చెంబు తప్పాలను వశపరచుకొన్నారు – పంచాయతీపక్షాన.

పూర్వులు ఏనాడో కట్టిన యింటిని వదిలిపెట్టి మహాభక్తుడు కేసన కట్టుగుడ్డలతో – శ్రీకంఠమల్లేశుని విగ్రహాన్ని, దీపారాధనకుందిని తీసుకొని – బయటకొచ్చి రోటిని ఒక్కమారు చూచాడు. ఎప్పుడూ దానిమీద కూర్చొని – శూన్యంలోకి చూస్తుండే తనప్రియపుత్రిక మొల్ల ఆయనకళ్లల్లో మెలిగింది. ఆయన కళ్లవెంట అశ్రువులు జలజల రాలాయి.

అందరికీ ఒక్క నమస్కారం బెట్టి - 'అంబా' అని అరుస్తున్న ఆవును దువ్వి - కేసన పోలిగాడితో మాలపల్లికి వెళ్ళిపోయాడు. అక్కడవాళ్ళంతా కేసనను తమ ఆత్మీయుడుగా భావించి - ఆయనకు అపూర్వస్వాగతాన్ని యిచ్చారు. కేసన వాళ్ళల్లో తనూ ఒకడయిపోయి - వాళ్ళసేవలో నిమగ్నుడయ్యాడు.

కామాతురులకు, మహాభక్తులకు ఎంతభేదం ఉంది ? మహాభక్తుడు కేసన మాల, మాదిగలకు స్వార్థరహితమైన సేవచేస్తూ - వాళ్ళకు భుక్తికి, ముక్తికి సంబంధించిన విషయాల మీద తన అమూల్యసందేశాన్ని యిస్తూంటే - రామాచారి యింద్రియాలోలుడై రంగనాయకి యింట పడిగాపులు కాస్తున్నాడు. స్వర్గమంటే యిక్కడే ఉందని - అది ఎక్కడో ఉందని భ్రమించడం బుద్ధిహీనుల పనని - ఆచారి రంగనాయకికి నచ్చజెప్పడానికి విశ్వప్రయత్నం చేశాడు. ఇంద్రియాలను స్వాధీనం చేసుకొని - తన శరీరాన్ని దేవుని కర్పితంచేసిన రంగనాయకి- ఆయన మనస్సు మార్చుడానికి ధర్మసూక్తుల్ని చెప్పింది. అవి ఆయన చెవికెక్కవు. రాత్రయినా ఆచారి ఆవిడయింట్లోనే ఉండిపోయాడు.

"స్వామీ ! మీరు వేదాలు, శాస్త్రాలు - అన్నీ చదివారు. మీరు మహాపండితులు, కర్మనిష్ఠాగరిష్ఠులు. మీకు తెలియని వేమీ లేవు. అల్లాంటి మరిమీరే ఒక సామాన్య మానవుడిలాగా యింద్రియాలకు లోబడి - అగ్నిసాక్షిగా పెళ్లాడిన భార్యనొదిలిపెట్టి - నాబోటి దానియింట్లో

ఉండడం న్యాయమేనా?... సంఘం మిమ్మల్ని, నన్ను ఏమను కుంటుంది ?... మీ భార్య మిమ్మల్ని, నన్ను శాపానికి గురి చెయ్యదూ ? దయఉంచి నన్ను నరకకూపంలోకి తొయ్య కండి. కాటికివెళ్లేటంతవరకు నేను 'దేవదాసి' గానే ఉండిపోవ డానికి ప్రతిజ్ఞ పట్టాను. నా ప్రతిజ్ఞను వమ్ముచెయ్యకండి," అంటూ ఆమె రామాచారిని పరిపరివిధాల వేడుకుంది. ఎవరేమనుకొన్నా ఆచారికేం ఫరవాలేదు. ఆమె పొందు - నాశించి - అక్కడే ప్రాణాచారంబడడానికి ఆయన నిశ్చయించు కొన్నాడు. తన శీలాన్ని చెడగొట్టుకోకండా - ఆయనలో ఎప్పటికైనా పరివర్తనం తీసుకొచ్చేందుకు - రంగనాయకి ఆచారి తన యింట్లోనే ఉండిపోవడానికి అంగీకరించింది. ఇంద్రియ లోలుడయిన ఆచారికి ఆవిడ అల్లా ఒప్పుకోవడమే మహాద్భాగ్యంగా అగుపించింది.

మాలపల్లిలో పోలిగాడు కేసనకు ఒక గుడిసె నిచ్చాడు. కేసన ఆ గుడిసెలో కాలం గడుపుతున్నాడు. మాలగూడానికి మధ్యగానున్న ప్రదేశంలో ఒక రావిచెట్టు, వేపచెట్టు కలిసున్నాయి. వాటిచుట్టు ఒకఎత్తయిన అరుగుకట్టారు మాల,మాదిగలంతా. కేసన తన శ్రీకంఠ మల్లేశవిగ్రహాన్ని ఆచెట్లకింద ప్రతిష్ఠించి - దానికి నిత్యనైవేద్య దీపారాధనలు సాగించాడు. ప్రతిదినం ఆయన మాల, మాదిగలతో చేరి అక్కడ భజనలు చెయ్యడం మొదలెట్టాడు. రాత్రిపూట ఏకాంతంగా గుడిసెలో పండుకొన్నప్పుడు

ఆయనకు తనపిల్ల మొల్ల కళ్ళల్లో మెదులుతుంది. ఆమె ఎక్కడుందో! ...

అక్కడ అడవిలో మొల్లకు, కోయకుఱ్ఱాడికి అవినాభావసంబంధం ఏర్పడ్డది. ఒకరిని విడిచి ఒకరు ఉండలేకపోయారు.

"మరి నాకు నిజమైన స్త్రీ లక్షణాలు ఎల్లాఉంటాయో - వాటి నలవరచుకొని దేవుణ్ణి ఎలాచూడగలుగుతానో - చెప్తానన్నావుగదూ - మరెప్పుడు పాఠాలు ప్రారంభిస్తావు?" అడిగింది మొల్ల - ఒకనాడు ఆకోయకుఱ్ఱాణ్ణిపట్టుకొని.

మొల్లలో అహంకారం, ఆవేశం, మగలక్షణాలు నశిస్తున్నా యని - క్రమక్రమంగా ఆమె తన ప్రభావాన్ని గుర్తించగలుగుతూందని - కోయకుఱ్ఱాడు గ్రహించాడు.

ఒకరోజు - అతని ఆదేశానుసారం - మొల్ల పళ్లు తోముకొని - అక్కడున్న కొలనులో శుచిగా స్నానంచేసింది. ఆ కోయకుఱ్ఱాడు చెట్లచాటునుంచి ఒక పట్టుచీర, రవికెను తీసుకొచ్చి - ఆమెను కట్టుకోమన్నాడు. వికృతంగాను, మోటుగాను ఎప్పుడూ కట్టుకోడానికి అలవాటుపడ్డ మొల్ల ఆ చీర, రవికెలను సాంప్రదాయసిద్ధంగా ధరించలేకపోయింది.

ఆమెకు చీర ఎల్లాకట్టుకోవాలో, రవికె ఎల్లా తొడుక్కోవాలో నేర్పాడు ఆ కుఱ్ఱాడు. బాహ్యస్వరూపానికి సంబంధించిన బొట్టు, కట్టు, జుట్టులో, ఆమెలో అతను పరిపూర్ణమైన మార్పు తీసుకొచ్చాడు. నొసట వెడల్పాంటి కుంకుమబొట్టు పెట్టి - జుట్టులో కొండపూలు తురిమితే ఆవిడ

నిజంగా సాక్షాత్తు మహాలక్ష్మిలాగా ఉంది. "పోయి నీ ప్రతిబింబాన్ని నీళ్ళల్లో చూచుకో," అన్నాడు కోయకుట్టవాడు. ఆ ప్రకారమే చూచుకుంది మొల్ల. తనలో ఎంత మార్పొచ్చింది?... ఆవిడను ఆవిడే గుర్తుపట్టలేకపోయింది. ఇప్పుడావిడ నిజంగా పద్మినీజాతిస్త్రీగా రూపొందింది.

ఇప్పుడు నేను పరిపూర్ణత్వాన్ని, పరిపక్వతను పొందా ననుకుంటున్నా. మరి నాకు దేవుణ్ణి చూపెట్టనూ?" అడిగింది మొల్ల అమాయికంగా.

"ఇంతవరకు నీ బాహ్యస్వరూపంలోనే మార్పొచ్చింది. మరి నీ ఆంతరంగిక స్వరూపంకూడా మారాలని నేను చెప్పలా? అప్పుడే మరిచిపోయావా?... ముందు నీకు వాక్శుద్ధి అబ్బాలి," అన్నాడు కోయకుట్టవాడు. ఆమె మాట్లాడే మాటల్ని సరిదిద్ది ఆమెభాషలో మార్పుతీసుకొచ్చాడు. సరస్వతీ ఆకురసం పోసి అతను ఆమెకు వాక్శుద్ధిని కలిగించాడు. చదవడం, వ్రాయడం కూడా అతను ఆమెకు నేర్పాడు. సంగీతం, నృత్యంమీద కూడా అతను ఆమెకు అభిరుచి కల్పించాడు.

పవిత్రమైన ప్రేమతత్వం అర్థంచేసుకోనేందుకు, అతడు మొల్లకు చెట్టుమీదున్న పక్షుల జంటల్ని చూపెట్టాడు. ఆడది మగదాని సమక్షంలో ఎల్లా లజ్జ నభినయిస్తుందో చూసింది మొల్ల. అల్లా చేయమని ఆమెను ఆదేశించాడు కోయకుట్టాడు. అల్లా అభినయించడానికి ఆమె ప్రయత్నించింది. కాని సాధ్యంకాలేదు. ఎల్లాసిగ్గు నభినయించాలో

అతనే ఆమెకు చూపెట్టాడు. అతన్ని అనుకరించి మొల్ల కొంతసేపటికి కృతకృత్యురాలయింది.

ఉత్తమజాతిస్త్రీ లక్షణాలను తనలో పెంపొందించుకొన్న మొల్ల – ప్రేమతత్వాన్ని ఆమూలాగ్రంగా అర్థంచేసుకొన్న మొల్ల – ప్రణయోన్మాదినిగా తయారయిన మొల్ల, "మరి యిక నాకు దేవుణ్ణి చూపెట్టవూ" అంటూ అతన్ని కోరింది.

"అప్పుడేనా," అన్నాడు కోయకుఱ్ఱవాడు. యోగ సమాధిలో కూర్చొని పంచాక్షరీమంత్రం పఠించమన్నాడు – ఎల్లా కూర్చోవాలో చూపెట్టి. మొల్ల అల్లాగే కూర్చుని మంత్రం పఠించింది. ఆమె నిజమైన యోగసమాధిలో ఉందో, లేదో పరీక్షించడానికి అప్పుడప్పుడు అతను ఆమెను పేరుతో పిలిచాడు. యోగసమాధి సరిగ్గా కుదరక ఆమె అతనికి 'ఆఁ' అంటు జవాబిచ్చింది. "యోగసమాధిలో నీకు పరిపక్వదశ అబ్బలేదు," అంటూ అతను మళ్లీమళ్లీ ఆమెను యోగ సమాధిలో కూర్చోబెట్టాడు. క్రమక్రమంగా ఆవిడ యోగసమాధిలో లీనమయిపోయి – సర్వాన్ని మరిచి పోయింది. ఇంద్రియనిగ్రహం, ఏకాగ్రత యిప్పుడు ఆమెకు పూర్ణంగా అలవడ్డాయి.

కొంతసేపయ్యాక కోయకుఱ్ఱాడు మొల్లను కళ్లు తెరవ మన్నాడు. అల్లాగే తెరిచింది మొల్ల! "రెప్పవాల్చకుండా అల్లాచూస్తూ రెండు గడియలుండాలి," అన్నాడు కోయకుఱ్ఱ వాడు. "అమ్మో బాబో," అంది మొల్ల. "అయితే నీకు

దేవుణ్ణి పెళ్ళిచేసుకోవాలని లేదా?" అడిగాడు కోయకుట్టువాడు. "అదెల్లా?" అంది మొల్ల రోషంతో. అయితే ప్రయత్నం చేయమన్నాడు. ప్రయత్నంచేసి ఆమె అందులో కృతకృత్యురాలయింది.

రెప్పవాల్చకుండా తననుచూస్తున్న మొల్ల సమక్షంలో కోయకుట్టువాడు పాడుతూ, నృత్యంచేస్తూ ఆమెకు దశావతారాల ఘట్టాలు చూపెట్టాడు. ప్రపంచంయొక్క వివిధ పరిణామదశలను ఆ అవతారాలు విశదీకరించాయి. ఆమె విజ్ఞానచక్షువు యిప్పుడు వికసించింది. భక్తి, జ్ఞాన ప్రపత్తులు యిప్పుడు ఆవిడకు బాగా అలవడ్డాయి.

అన్ని అవతారాలలో మానవజన్ముడైన శ్రీరాముని అవతారం ఆమె హృదయం హత్తుకుంది. సత్యసంధుడైన శ్రీరాముడు ఆమెకు అన్నివిధాలా నచ్చాడు.

తన లీలల నన్నిటిని చూపెట్టి కోయకుట్టువాడు "యిప్పుడెల్లా ఉన్నావు మొల్లా," అంటూ అడిగాడు. "నాకు జ్ఞానభిక్షపెట్టి, తేజోవిరాజితమైన జ్యోతిని చూపెట్టావు. నాలోని మానవత్వాన్ని పోగొట్టి నాకు దివ్యత్వాన్ని ప్రసాదించావు," అంది మొల్ల భక్తిపురస్సరంగా. "ఇంతవరకూ నువ్వు కోయకుట్టాడివని - దేవుడంటూ పేరుపెట్టుకొని నన్ను భ్రమింపజేస్తున్నావని నేననుకున్నా. నా కళ్లకు కప్పిన మైకం తొలగిపోయింది. నా మానసవీధిలో నేను చిత్రించుకున్న స్వరూపానికి, నీ స్వరూపానికి ఏమీ తేడా లేదు. నీవే నిజమైన

దేవుడివి. మరి నన్ను పెళ్ళిచేసుకోవూ ?" అంది మొల్ల - ఉప్పొంగిన శరీరంతో.

"కామానికి దాసురాలివై అల్లాఅంటున్నావా ?" అడిగాడు కోయకుఱ్ఱవాడు.

"అల్లా ఎప్పుడూ గాదు. ప్రకృతి పురుషుల సంయోగ వాంఛ నన్ను అలా అనడానికి ప్రేరేపించింది. పవిత్రమైన ప్రేమతోనే నీలో ఐక్యంగావాలని నేను అభిలషిస్తున్నాను," అంది మొల్ల.

"నీకు తల్లి ఉందా?" అడిగాడు కోయకుఱ్ఱవాడు. లేదంది మొల్ల. "మరి తండ్రి ?" తిరిగి ప్రశ్నించాడు అతను. ఉన్నాడంది ఆమె.

మానవజన్మ ఎత్తిన ప్రతిజీవి నెరవేర్చవలసిన విధ్యుక్త ధర్మాలనుగూర్చి అతను ఆమెకు బోధించాడు.

"ప్రతివ్యక్తికి నలుగురు దేవుళ్లుంటారు. (1) తల్లి (2) తండ్రి (3) గురువు (4) దేవుడు. క్రమానుగుణ్యంగా వీళ్ళను సేవించి ప్రతివ్యక్తి వీళ్ళ ఆశీర్వాదాలను అందుకోవాలి. నీకు తల్లి లేదన్నావు - బాగానే ఉంది. మరి నీ తండ్రికి నువ్వుచెయ్యవలసిన సేవ చేశావా ? సల్పవలసిన శుశ్రూష సలిపావా ?...... లేదు. నిన్ను నాదాన్నిగా చేసుకునే ముందు నీ తండ్రికి సేవచేసి, ఆయన ఆశీర్వాదాన్ని పొందాలనుంటుంది. దైవంలో నువ్వు ఏకంకావడానికి నువ్వు ఆశించే ముందు నీ పితృదైవాన్ని సంతోషపెట్టాలనుంటుంది", అన్నాడు ఆ కోయకుఱ్ఱవాడు.

తన పితృదైవంపట్ల చిన్నప్పటినుంచీ తను ఎట్లా మెలిగిందీ యిప్పుడు తెలుసుకుంది మొల్ల. కాని పెళ్లాడకండా తన ముఖం తనతండ్రికి, గ్రామపెద్దలకు ఎట్లా చూపెట్టడం ?.

"నువ్వు చెప్పిందంతా నిజం. నేను కాదనను. కాని దేవుణ్ణి పెళ్లాడతానని ఊరిమీద సవాలుచేసొచ్చాను. నేనొక యింటిదాన్నయితే చూడాలని నా తండ్రి అభిమతం. 'నీ తండ్రి యొక్క ఆశీర్వాదాన్నిపొందు' అని నువ్వు యిప్పుడు చెప్పావు. మరి తండ్రి అభిమతం తీర్చడానికయినా నిన్ను నేను పెళ్లాడాలసిందేగా !" అంది మొల్ల - తార్కికదృష్టితో.

"అవును. నువ్వు చెప్పింది నిజం. ఏనాడు నువ్వు రామాలయంలో - గర్భగుడిలో ప్రవేశించి - నన్ను అంటుకున్నావో - ఆనాడే నాతో నీకు సంపర్కం కలిగింది. అప్పటి నుంచి నువ్వు పరిశుద్ధురాలవై - నా హృదయాన్ని చూరగొన్నావు. నేను నిన్ను యిప్పుడు పెళ్ళికూతుర్నిమాత్రం చేస్తా. నువ్వు ఊరికి తిరిగి వెళ్ళి - నీ తండ్రికి శుశ్రూషచేసి - ఆయన్ను సంతోషపెట్టి - ఆయనకు కీర్తి సంపాదించి పెట్టాక నిన్ను గోపవరప్రజలందరి సమక్షాన పెళ్లాడతాను. అంటే నిన్ను నాలో ఐక్యం చేసుకుంటాను," అన్నాడు కోయకుర్రవాడు. అందుకు ఆమె అంగీకరించింది.

కోయకుర్రవాడు మొల్లను స్వయంగా అలంకరించి - బుగ్గన ఎప్పటికీ చెరిగిపోని కాటుకబొట్టు పెట్టాడు. ఈ శుభకార్యానికి పంచభూతాలు సాక్షీభూతులయ్యాయి. భూమి

కంపించింది. అగ్ని ప్రజ్వలించింది. గాలి వీచింది. ఆకాశా న్నున్న మేఘాలు ఉరిమాయి. పర్జన్యుడు వర్షించాడు.

తనను పెళ్లికూతురుగా చేసిన కోయకుఱ్ఱవాడికి ఆవిడ సాష్టాంగదండప్రణామం చేసింది. అల్లాచేయడం ఆమె జన్మలో యిదే మొదటిసారి.

ఆమె సమక్షంలో ఆ కోయకుఱ్ఱవాడు అగ్నిగా రూపొందాడు. అతనెవరో యిప్పు డావిడకు బోధపడ్డది. అగ్ని రూపంతో అతను తిరిగి అడవిమీద పడ్డాడు. మొల్ల ఆ అగ్నికి చేయెత్తి దండంపెట్టి గోపవరానికి బయలుదేరింది.

అడవికి వచ్చినప్పుడు ఆమెలోఉన్న అహంకారం, ఆవేశం యిప్పుడు మటుమాయమై పోయాయి. ఇప్పుడావిడ ఉత్తమజాతి స్త్రీ - దివ్యత్వమందిన స్త్రీ - నిజమైన శక్తి స్వరూపిణి.

అడవిలోనుంచి గోపవరానికి బయలుదేరిన మొల్లకు పితృదైవం కేసన అగపడుతున్నాడు. తన మూలంగా ఆ అహింసామూర్తి ఎన్నికష్టాలకు లోనవుతున్నాడో!...

మాలగూడెంలో కేసన రామదండుకు అంకురార్పణ గావించాడు. గూడెంలోనివాళ్ళకు అన్నివిధాలా సేవచెయ్యడమే రామదండుయొక్క ముఖ్యోద్దేశం. ఆయన నాయకత్వం కింద మాలవారందిగలంతా శుచిగా స్నానం చెయ్యడం, మద్య మాంసాలు సేవించకండా ఉండడం, తమలో తాము పోట్లాడు కోకండా ఉండడం, తీరికసమయాలలో భక్తికి కావలసిన

కుటీరపరిశ్రమలను ఏర్పాటుచేసుకోవడం, సమిష్టిక్షేమానికి అందరూ పాటుబడడం నేర్చుకున్నారు.

మాలమాదిగల సర్వతోముఖాభివృద్ధికి కేసన పథకాలేర్పాటుచేసుకొని, అహర్నిశలు కృషిచేస్తూంటే — మహాపండితుడు రామాచారి — తన యింటికి వెళ్ళకండా — రంగనాయకి యింట్లోనే పీఠం వేసుకుకూర్చున్నాడు. ఇహలోక వాంఛలకు ఆయన ప్రతినిధి. రంగనాయకి పరలోకవాంఛలకు ప్రతినిధి. మరి యీ యిద్దరికి పొత్తెల్లా కలుస్తుంది ?

రోజులతరబడి యింటికి రాకండా — తన భర్త రంగనాయకి యింట్లో మకాం బెట్టినందుకు పతివ్రత సీతమ్మ ఎంతో ఖేదం చెందింది. మగని మనస్సును — మంచికైనా — తను నొప్పించినందుకు ఆవిడ ఎంతో మనోవ్యధ అనుభవించింది.

ఒకరాత్రివేళ సీతమ్మ రంగనాయకి యింటికొచ్చి — తనకు పతిభిక్ష పెట్టమని — ఆవిడను ప్రాధేయపడ్డది. సీతమ్మ తనను అపార్థం చేసుకుందని రంగనాయకి గ్రహించింది.

“నువ్వు నాకు తల్లివంటిదానవు. నేను గణికనని — నీ భర్తను నేను నా వలలో వేసుకున్నానని నువ్వు పొరబడుతున్నావు. నేను గణికనుగాను. దేవదాసిని. మనోవాక్కాయకర్మల్లో నేను దేవదాసిని. ఆ మురళీకృష్ణుడే నా భర్త ! ... నీ భర్త వేరే గదిలో ఉన్నాడు. ఆయనను నిరభ్యంతరంగా మీయింటికి తీసుకు వెళ్లొచ్చు తల్లీ,” అంది రంగనాయకి — వినయ విధేయతలతో.

ఈ యిద్దరి సంభాషణను విన్న ఆచారి లోపలనుంచి వచ్చాడు. తన సుఖానికి అంతరాయాన్ని కల్గించడానికొచ్చిన సీతమ్మను చూచి ఆయన చీదరించుకున్నాడు. ఆయన ఆమెను కసిగికొట్టబోయాడు. ఈ దృశ్యాన్ని చూచిన రంగనాయకికి ఒకవిధంగా కోపం వచ్చింది.

"ప్రాజ్ఞులు మీరు. మహాపండితులు మీరు. ఏది తప్పో, ఏది మంచో తెలుసుకోవలసిన బాధ్యత మీది. మీ భార్య శీలవతి. ఆవిడ నిజంగా పతివ్రత. ఆవిడ మనస్సును క్షోభ పెట్టడం మీకు భావ్యంకాదు. నేనొక గణికను. నాయింట్లో మీరిల్లా ఉంటే ఉళ్లో వాళ్ళందరూ ఏమనుకుంటారు ?... నా పరువు, మీ పరువు మట్టిపాలవ్వదూ ?.." అంది రంగనాయకి.

ఆవిడ మాటల్ని వింటూంటే ఆచారికి జ్ఞానోదయం కలిగింది. రంగనాయకి తుచ్ఛసుఖాలకు లోబడే వ్యక్తిగాదని-పరీక్షాముఖాన - యిప్పుడాయన తెలుసుకోగలిగాడు. ఇక ఆ యింట్లో వుండడం భావ్యంకాదనుకుని రామాచారి సీతమ్మతో తన యింటికి వెళ్లాడు. సీతమ్మ ఎంతో సంబరపడ్డది. రంగనాయకియొక్క గుణగణాలను ఆవిడ లోలోపల ఎంతో ప్రశంసించుకుంది.

---

## 6

ఆ నాడు శ్రీకృష్ణజయంతి. తలంటిపోసుకొని, పట్టు చీర కట్టుకొని, ఆభరణాలన్నీ పెట్టుకొని రంగనాయకి తన యిష్టదైవమైన మురళీకృష్ణుని ముందు నృత్యం సలుపుతూంది. మధురతరమైన తన కంఠంఎత్తి యిలా పాడుతూంది :

"నేను" "నాద"ను గర్వమును గూల్చి దేవ!
నేను నీలో చేరు జ్ఞానమ్ము నీవ!
అఖిలేశ ! నినుజూడ నాత్మచక్షువు వలయు
అహమిక హరింపనిది అది వరింపదు... గాన
నేను నాదను...
అపరభారతి రామలింగాభిధానుండు
అస్మద్గురూత్తముం డాహ్లాదముం బొంద
నేను నాదను...

నృత్యం అయిపోయాక ఆవిడ విగ్రహానికి హారతి యిచ్చింది. ఇంట్లో దాసి సరసు లోపలికి పరుగెత్తుకొచ్చి "ఎవరో మీ యింటికి పల్లకీమీద వస్తున్నారమ్మా" అని ఆవిడకు చెప్పింది. రంగనాయకి – ఆయన ఎవరైఉంటారా అని లోపల తర్కిస్తూ – వీధిగుమ్మం దగ్గిరకు వెళ్లింది. పల్లకీ వచ్చి ఆవిడ యింటివద్ద ఆగింది. పల్లకీనుంచి మహాతేజస్వి ఒకాయన దిగాడు. ఒంటిమీద కప్పుకున్న విలువగల కాశ్మీర శాలువ – ముఖంలో వెలుగొందుతున్న బ్రహ్మవర్చస్సూ – ఆయనొక మహాకవీశ్వరుడని చాటుతున్నాయి.

రంగనాయకి ఆయన్ను పరకాయించి చూచింది. ఆవిడ ఆనందం యింతా అంతా గాదు. జగద్విఖ్యాతినందిన తెనాలి రామలింగ మహాకవి ఆయన. భక్తిపారవశ్యంతో పూజ్యులైన తన గురువులు రామలింగకవికి ఆమె అర్ఘ్యపాద్యాదులిచ్చి - లోపలికి ఆహ్వానించింది. తనవద్ద కొంతకాలం శిష్యరికం చేసిన రంగనాయకిని చూడడంతోటే ఆయనకు చెప్పరాని ఆనందం కలిగింది.

లోపలికి వచ్చాడు తెనాలిరామలింగకవి. పంజరంలో ఉన్న రామచిలుక 'రామా - రామా' అంటూ ఆయనకు స్వాగతం పలికింది. సుఖాసీనుడయిన రామలింగకవి రంగనాయకియొక్క యోగక్షేమాలు కనుక్కున్నాడు.

"దిగ్విజయయాత్ర సల్పి - పుణ్యక్షేత్రాలు చూచి - రెండు పనులమీద నేను మీ ఊరొచ్చాను. ఒకటి: విఖ్యాతినందిన గోపవరపు శ్రీరామదేవుణ్ణి సందర్శించడం - రెండు: నా ప్రియశిష్యురాలు రంగనాయకి ఎల్లాఉందో కనుక్కోవడం," అన్నాడు రామలింగకవి - మందహాసంతో.

తన గురువులు తనపట్ల అల్లాంటి అవ్యాజప్రేమను అగపఱచినందుకు తన్ను తాను అభినందించుకొంది రంగనాయకి.

ఎన్నోఏళ్ళయింది గురువు, శిష్యురాలు కలుసుకొని: విజయనగరరాజ్యాన్ని గురించి - రాయల పాండిత్య ప్రకర్షను గురించి - వాళ్ళిద్దరూ ముచ్చటించుకొన్నారు.

మాటలధోరణిలో గోపవరం అగ్రహారమని - వైష్ణవ మతోద్ధారకులు, రాయలకు గురుతుల్యులు అయిన తాతాచార్లగారి ప్రాపుతో రామాచార్లగారు యీ అగ్రహారం పొందాడని - ఆచార్లగారు మహాపండితులు, వేదశాస్త్ర పారంగతులు, కవిశేఖరు లని - వారు అన్నిహక్కులతో యీ అగ్రహారంమీద పెత్తనం చలాయిస్తున్నారని - రామాలయానికి వారే ధర్మకర్తలని - రంగనాయకి రామలింగకవికి చెప్పింది.

అల్లాంటి పండితునితో, కవితో ఆరోజు గోష్ఠిసలిపి కాలం గడుపుదామని - ఆయన అనుజ్ఞతో శ్రీరామదేవాలయాన్ని సందర్శిద్దామని - అభిలషించిన తెనాలి రామలింగకవి "రామాచారిగారిని నేను చూడాలనుంది," అన్నాడు.

రామలింగకవి రాకను చెప్పి - ఆచారిగారిని అక్కడకు తీసుకురమ్మని రంగనాయకి తన దాసి సరసును ఆయన యింటికి పంపించింది.

అక్కడ ఆచారి అవధానితో కవితాగోష్ఠిలో మునిగున్నాడు. సుష్టుగా తిని కూర్చున్న ఆయనకు యింకా పనేముంటుంది? తన 'శృంగారలీలాతరంగిణి' నుంచి ఆయన అవధానికి కొన్ని శ్లోకాలు టీకాతాత్పర్యసహితంగా చెబుతున్నాడు. అవధాని ఆచారి పాండిత్యాన్ని వేనోళ్ల శ్లాఘిస్తున్నాడు.

సరసు అక్కడికొచ్చింది. తెనాలి రామలింగకవి రాకను గూర్చి చెప్పి, "రంగనాయకమ్మగారు తమర్ని అక్కడికి

దయచేయమన్నారు," అంటూ ఆచారికి నివేదించింది. తెనాలి రామలింగకవి యొక్క ప్రతిభ ఆచారికి తెలియకపోలేదు. వెళ్ళి ఆయనను కలుసుకుందామనుకున్నాడు ఆచారి. కాని ఆయన్ను తప్పుదోవలుపట్టించే సైంధవుడు అవధాని ఆయనకు అడ్డపడ్డాడు.

"మీరేమిటి – భోగంది రంగనాయకి యింటికి వెళ్ళి తెనాలి రామలింగణ్ణి కలుసుకోవడమేమిటి?... తనే మహా కవినన్న అహంకారం ఆ తెనాలి రామలింగడికి ఎంతుందో మీకు తెలియని విషయంగాదు. అదీకాకండా రామలింగడు– బ్రాహ్మణుడు కదా – అంతమాత్రం జ్ఞానముండొద్దా – అతనికి?... అగ్రహారీకులు, మహాపండితులు, స్వచ్ఛమైన బ్రాహ్మణులు యిక్కడ మీరుంటే – మీ యింటికి రాకండా– అతను ఆ భోగందాని యింటికి వెళ్ళడం దేనికి?... నిజంగా అతను మిమ్మల్ని పరాభవించాడు. ఈ పరాభవం మీది కాదు – ఊళ్ళో ఉన్న మా అందరిదీను. అవసరముంటే అతనే మీ దగ్గిరకొస్తాడు. మీ రక్కడకు వెళ్ళొద్దని నా వినయ పూర్వకమైన సలహా. మరోకమాట. ఇది మీరు వినేఉంటారు. అతను వైష్ణవద్వేషి. అందుకనే 'శివరాత్రి మహాత్మ్యం' అన్న గ్రంథాన్ని వ్రాసి వైష్ణవులపట్ల తనకున్న ద్వేషభావాన్ని వెళ్ళగక్కాడు," అన్నాడు అవధాని – ఆచారిని రెచ్చగొట్టడానికి.

ఆచారి యిప్పుడు ఆలోచనలోపడ్డాడు. రామలింగకవి తన యింటికిరాకండా దేవదాసి రంగనాయకి యింటికి వెళ్ళి

నందుకు ఆయన కినుక చెందాడు. అవధాని మాటలు విన్న సరసు కటకటబడ్డది.

లోపలినుంచి యీ సంభాషణ వింది సీతమ్మ. భర్త సమక్షానికొచ్చి - శ్రోత్రియుడు, కవీశ్వరుడు అయిన రామలింగని కలుసుకొని - ఆయన్ను తమయింటికి గౌరవపురస్సరంగా ఆహ్వానించమని సలహా చెప్పింది. "నువ్వువెళ్లు లోపలికి," అని గద్దించాడు ఆచారి. భర్తయొక్క మూర్ఖత్వానికి చింతిస్తూ ఆవిడ లోపలికి వెళ్లిపోయింది.

"ఇంతకూ తమరు ఏమీ సెలవిచ్చారుగాదు," అంటూ సరసు ఆచారి నడిగింది. ఆచారి ఏమీ చెప్పలేకపోయాడు.

"నేను చెప్తానంటే ఆయన నమ్ముతాడేమిటి? తనకు అవసరమని తోస్తే ఆ తెనాలిరామలింగణ్ణి - సాంప్రదాయసిద్ధమయిన మర్యాదల్ని పాటిస్తూ - గ్రామమండపంలోని న్యాయస్థాన పీఠందగ్గర ఆచారిగార్ని కలుసుకోమను. అతనిలో ఏదన్నా పస ఉంటే కవనంలో ఆచారిగారిని అక్కడే ఎదుర్కోమను. కావాలంటే ఊళ్లో వాళ్ళంతా వచ్చి ఆచారిగారి తాహత్తేమిటో, రామలింగని బండారమేమిటో ప్రత్యక్షంగా తెలుసుకోగలుగుతారు," అంటూ చెప్పాడు అవధాని సరసుతో.

ఇంతకూ అవధానే అనవసరంగా జోక్యంకలిగించుకొని కయ్యానికి కాలు దువ్వుతున్నాడని - అసలు ఆచారి అభిప్రాయ మేమిటో తెలుసుకోవాలని సరసు ఆయన ముఖం చూచింది. ఆచారి ముఖంకూడా అవధాని వెలిబుచ్చిన [illegible] బయటపడుతున్నట్లు అగపడ్డది.

సరసు రంగనాయకి యింటికి వచ్చింది. అవధాని ఆచారి పక్షాన మాట్లాడిన మాటలన్నీ రంగనాయకికి, తెనాలి రామ లింగకవికి సవిస్తరంగా చెప్పింది. విషయం యింత ముదిరి నందుకు రంగనాయకి విచారించింది. తన కవిత్వాన్ని, తనను అంత చులకనగా చూసిన ఆచారిమీద రామలింగకవి ఉగ్రు డయ్యాడు. పైగా తను అసలైన బ్రాహ్మణుడు కాడని అవధాని అన్నందుకు రామలింగకవి రోషపడ్డాడు. ఆనాటి సాయంత్రం ఆచారిని గ్రామమండపంలోనే ఎదుర్కోడానికి రామలింగకవి నిశ్చయించుకున్నాడు.

ఈ నిశ్చయం ఆచారికి రంగనాయకి సరసు ద్వారా కబురంపింది. తెనాలి రామలింగనికి, రామాచారికి ఆనాటి సాయంత్రం గ్రామమండపంలోని సభాస్థలిలో కవిత్వపోటీ జరుగుతుందని అవధాని ఊరంతా దండోరా వేయించాడు. ఆచారియొక్క పాండిత్యం ఊళ్లో వాళ్ళందరికీ తెలియాలని అవధానియొక్క ఉత్సుకత.

ఆనాటి సాయంత్రం ఊళ్లో ఉన్న పురుషులు, స్త్రీలు — అందరూ గ్రామమండపందగ్గిర చేరారు. తెనాలి రామలింగకవి పేరు విన్నారేగాని వాళ్లల్లో ఆయన్ను ఎవ్వరూ ప్రత్యక్షంగా చూడలేదు. ఆయన రూపురేఖలు ఎల్లాఉంటాయో చూడ డానికని ప్రత్యేకంగా వచ్చిన వాళ్లు ఆ జనసమూహంలో చాలమందున్నారు.

కులాలవారీగా, స్త్రీ పురుష భేదాల ననుసరించి అందరూ ఎక్కడ కూర్చోవలసినవాళ్లు అక్కడ కూర్చున్నారు.

మాల మాదిగలు కూడా వచ్చి - కొంచెం దూరాన ఉండి పోయారు. వాళ్ళల్లో కేసనగూడా లేకపోలేదు. రామలింగ మహాకవి పేరు, రచనలు ఆయన్ను అక్కడికి తీసుకొచ్చాయి.

దేవదాసి రంగనాయకి, ఆచారిభార్య సీతమ్మగూడా యీ సమావేశానికి విచ్చేశారు. కనకయ్య, తిక్కనగూడా హాజరయ్యారు.

అవధాని, శరభరాజు, బొబ్బయ్యచెట్టి, సుబ్బారెడ్డి గ్రామమండపంలోని న్యాయపీఠంమీద ఆసీను లయ్యారు. ధర్మచక్రం కిందుగా ఉన్న ఉన్నతాసనంమీద అగ్రహారీకుడు ఆచారి ఉపవిష్టుడయ్యాడు. అధికారదర్పం ఆయనలో మూర్తీభవించి అగపడుతూంది.

సకాలానికి సభాస్థలికి తెనాలిరామలింగకవి విచ్చేశాడు. ఉన్నతాసనంమీద ఉపవిష్టుడయిన అహంకారస్వరూపుడు ఆచారికి గౌరవపురస్సరంగా నమస్కారం బెట్టడానికి ఆయన చేతులు నిరాకరించాయి. వచ్చి ఆయన అక్కడ నిల్చుండి పోయాడు. ఆచారి తెనాలిరామలింగకవిని తీక్ష్ణంగా చూచాడు.

“అగ్రహారీకుడనైన నాకు - అన్నివిద్యల్లోను నీతో సరి సమానుడైన నాకు - నువ్వు గౌరవమర్యాదలను చూపెట్టక పోవడంచేత - బ్రాహ్మణుడవై యుండి బోగందానింట్లో బస చెయ్యడంచేత - నీకు నేను యీ మండపంలో కూర్చోడానికి చోటివ్వడం లేదు. కవిత్వంలో నన్ను నీవు ఓడించగలిగితే నీకు

యీ మండపంలో ఆసనమిస్తాను," అన్నాడు ఆచారి – అధికార దర్పంతో.

కవితాప్రపంచంలో వీరవిహారం సలిపి – దిగ్దంతుల్లాంటి కవులందరిని తన పాదాక్రాంతుల్ని చేసుకున్న తెనాలి రామలింగకవికి ఆచారి మాటలు రోషావేశాలను కలిగించాయి.

క్రమక్రమంగా ఆచారికీ, తెనాలి రామలింగనికి వాదోపవాదాలు హెచ్చాయి. కవిత్వలక్షణాలమీద, సాంప్రదాయాల మీద వాళ్ళిద్దరికీ చరిత్రాత్మక సమరం జరిగింది. హెచ్చుస్థాయిలో జరుగుతున్న చర్చలో ఉపయోగింపబడుతున్న వారిద్దరి పదజాలాన్ని సభికుల్లో చాలమంది అర్థంచేసుకోలేక పోయారు. కాని రామలింగని వాక్చాతుర్యంలో గర్భీకృతమై యున్న పదఘాటిని వాళ్లు హర్షించగలుగుతున్నారు. అనర్గళంగా – గంగాప్రవాహసదృశంగా – రామలింగని నోటినుంచి వెలువడుతున్న మాటలు వాళ్ళను హర్షాశ్చర్యచకితుల్ని చేస్తున్నాయి. ఆచారి వాదన వాళ్ళకు పేలవంగా అగుపించింది. ఆచారి రామలింగని ఎదుర్కోవడంలో గుడ్డొచ్చి పిల్లనెక్కిరించి నట్లుగా వాళ్ళ కగపడ్డది. వాళ్ళిద్దరి ముఖాలు – ఆంగిక విన్యాసాలు – చూచి అందులో ఎవరిది పైచేయో వాళ్లు గ్రహించగలుగుతున్నారు.

"ఇదిగో నేను శృంగారంమీద వ్రాసిన మహాకావ్యం. దీనిలోని శ్లోకాలను చదివి, ప్రతిపదార్థంచెప్పు," అన్నాడు ఆచారి – తన 'శృంగారలీలాతరంగణి'ని ఆయనచేతి కందించి.

రామలింగడు ఆ కావ్యాన్ని అటూయిటూ తిరగేశాడు. దాంట్లో ఉన్న శ్లోకాలలో ఉదాహరణగా రెండు, మూడిటిని తీసుకొని – వాటిల్లో కవిత్వలక్షణాలు, వ్యాకరణసూత్రాలు పూర్తిగా దెబ్బతిన్నాయని ఆయన సహేతుకంగా ఋజువు పరిచాడు. సభికులంతా రామలింగని పాండితికి హర్షధ్వానులు సలిపారు.

ఆ కావ్యాన్ని అవతలపారేస్తూ, "ఇది కావ్య మంటావా ?... కవిత్వంయొక్క ప్రాథమిక లక్షణాలుగూడా నీకు తెలియవు," అని గర్జించాడు రామలింగడు. అది నిజంగా మేఘగర్జన.

కవితాప్రపంచంలో హిమాలయ శృంగంమీదున్న రామలింగని ఆచారి ఎదుర్కోలేక తడబిడబడ్డాడు. ఆయన శరీరం వణికిపోతూంది. తన అగ్రహారంలో – తనను మహాకవి, పండితుడు అని శ్లాఘిస్తున్న ప్రజల సమక్షంలో – తను ఓడిపోతున్నందుకు ఆచారి సిగ్గు, లజ్జ పొందాడు.

"ఆ మండపంలోని వేదికనుంచి దిగు – యింకా దిగవేం ?... ఆ ఆసనంమీద కూర్చోడానికి నీకు అర్హతలేదు. అన్ని హక్కులతో నీకు యీ అగ్రహారాన్ని యివ్వడంలో రాయలు తప్పుపని చేశాడు," అన్నాడు రామలింగకవి – రోషంతో. అల్లాఅని ఆయన వేదికమీది కెక్కాడు. కంపిస్తున్న శరీరంతో ఆచారి మండపంనుంచి కిందికి దిగాడు – కోఱలు తీసిన పాములాగా. అవధాని కిక్కురుమనకండా – నెత్తిమీద గుడ్డవేసుకొని – ఆచారిని అనుసరించాడు. భయంతో వణికి

పోతున్న శరభరాజు, బొజ్జయ్యచెట్టి, సుబ్బారెడ్డి చల్లగా మండపంనుంచి కిందికి జారారు.

అంతకుముందు ఆచారి కూర్చున్న స్థానాన్ని యిప్పుడు రామలింగకవి ఆక్రమించాడు. ఆయన ముఖంలో బ్రహ్మ తేజస్సు వెలుగొందుతూంది.

రామలింగని దృష్టి అమాంతం అక్కడ కూర్చొనున్న బ్రాహ్మణుల మీదికి వెళ్లింది. "కనీసం కవిత్వంయొక్క ప్రాతిపదిక సూత్రాలను తెలిసినవాళ్లు మీలో ఎవరైనాఉంటే ముందుకు రావచ్చు," అని సవాలుచేశాడు రామలింగకవి. ఆచారి అపజయాన్ని ప్రత్యక్షంగా చూసి - అసలే గొంతు లూడిపోయిన ఆ బ్రాహ్మణులు ఆయన సవాలుకు గజగజలాడి పోయారు. వాళ్ళల్లో ఒక్కడైనా లేచి ముందుకొచ్చిన పాపానపోలేదు. "ఇక్కడచేరిన యితర కులాల్లో ఎవరైనా కవిత్వం చెప్పగలవాళ్లున్నారా ?" అని ప్రశ్నించాడు రామలింగడు - ఒక్కసారి జనసమూహాన్ని కలయచూచి.

మాల, మాదిగలు కేసన ముఖం చూచారు. తక్కిన వాళ్లు గూడా కేసనవైపే తమ చూపుల్లు నిగిడ్చారు. రామలింగని దృష్టి ఆయనమీదికి పోయింది. "తమరు మహాత్ములు. మీ పాదధూళిలో నే నొక రేణువును. కవిత్వం చెప్పగలనని నేను మీ ముందు నిలబడగలనా ?... నా మీదుండే అభిమానంమీద వీళ్లు నన్ను తమకు చూపెట్టారు. అంతకంటె ఏంలేదు," అన్నాడు కేసన రామలింగనితో. అల్లా అనడంలో ఆయన వినయవిధేయతలు ఉట్టిపడ్డాయి.

"కవిత్వపోషణకు భాషాప్రియుడు, కళాప్రియుడు నైన రాయలు యీ అగ్రహారాన్ని యివ్వడంలో చాల తప్పు చేశాడని యిప్పుడు ఋజువయింది. ఒకప్పుడు కవులకు, వేదాంతులకు, పండితులకు, యీ గోపవరం పెట్టింది పేరని విన్నాను. ఇప్పుడు వాళ్ళంతా నశించారన్నమాట. రాయల సామ్రాజ్యంలో సరియైన కవిత్వం చెప్పగలవాడు ఒక్కడూ లేని ఊరు యింతవరకూ నేనెక్కడా చూడలేదు. అల్లాం టప్పుడు యీ గోపవరం తగలడిపోయి - మట్టిదిబ్బగా ఎందుకు రూపొందగూడదని నేను ప్రశ్నిస్తున్నా," అన్నాడు రామ లింగడు - తన సహజావేశంతో. ఆయన మాటలకు అందరూ భయవిహ్వాలులయ్యారు. బ్రాహ్మణులంతా సిగ్గుతో తలలు వంచుకున్నారు.

"అల్లా ఎప్పుడూ కాదు - కానేరదు," అంటూ ఒక కేక దూరాన్నుంచి రామలింగనికి వినపడ్డది. అదొక గొప్ప శక్తివంతమైన కేక. రామలింగడు ఉలిక్కిపడ్డాడు. రామ లింగనితోపాటు అందరూ ఆ కేక వెలువడ్డవైపుకు తమ దృష్టిని పోనిచ్చారు.

దూరాన ఒక ఆడది వాళ్ళకు అగపడ్డది. ఆమె ముఖంలో తేజస్సు ఉట్టిపడుతూంది. ఆమె ఎవరో ఎవ్వరూ పోల్చుకోలేకపోయారు.

తనకు పరిచయమున్న కంఠంలాగా తోచడంతో ఆ వేసన తన దృష్టిని ఆమెమీదికి సారించాడు. ఆయనలో ఆతురత హెచ్చింది. కట్టును ఊతగా పట్టుకొని - శల్యావ

శిష్యుడు కేసన ఆమెవైపుకు పదిబారలు పోయాడు. చూస్తే ఎవరోగాదు - ఆయన ఆశాజ్యోతి - ఆయన ప్రియపుత్రిక మొల్ల. అయినా ఆయన తనను తనే నమ్మలేకపోయాడు. పూర్వానికీ, యిప్పటికి ఆమె రూపురేఖల్లో ఎంత గొప్ప మార్పొచ్చింది ?...

తన పిల్లను గుర్తుబట్టడంతోటే కేసనకు పంచప్రాణాలు లేచొచ్చాయి. "నా మొల్లవేనా నువ్వు ?" అంటూ ఆయన ఆమెను అమాంతం కావిలించుకున్నాడు. "అవునయ్యా," అని ఆమె గద్గదస్వరంతో జవాబిచ్చింది. ఆమె చేతులు తండ్రి పాదపద్మాలమీదికి పోయాయి. భక్తిపూర్వకంగా ఆమె తండ్రికి ప్రణమిల్లింది.

అల్లా ఆ కేకవేసింది ఎవరోగాదు, మొల్లని యిప్పుడందరికీ తెలిసిపోయింది. గ్రామపెద్దలందరికీ - ముఖ్యంగా ఆచారి, అవధానులకు - ఆమెను చూడడంతోటే సంభ్రమాశ్చర్యాలు కలిగాయి.

"ఎవరది," అంటూ అడిగాడు రామలింగడు. "అది కుమ్మరిముండ బాబూ - కేసనకూతురు - యీ మధ్యనే ఊరొదిలిపెట్టి వెళ్ళింది. మళ్ళీ తిరిగొచ్చింది. అదొకపిచ్చిది," అని సమాధానమిచ్చాడు రామలింగనికి అవధాని - మొల్లను హేళనచేస్తూ.

"పిచ్చిదా - అందుకనే అల్లా అరిచింది," అంటూ ఉపశాంతిని పొందాడు రామలింగడు.

"ఎవరు పిచ్చివాళ్ళు – నేనా మీరా ?" అంది మొల్ల – గంభీరంగా. "అయితే ఏమిటో అంటావు ?" అడిగాడు రామలింగడు.

"మొల్ల బొందిలో ప్రాణముండగా గోసవరానికి మీ రనుకున్నంత దుర్గతి పట్టదు. ఇక్కడివాళ్లు ఎవ్వరూ కవిత్వం చెప్పలేకపోతే నే ఉన్నా," అంది మొల్ల.

"కుమ్మరికులంలో బుట్టావు. అందులో ఆడదానివి. నేను నీతో ఏ విషయంలోను వాదించదలుచుకోలేదు," అన్నాడు రామలింగడు – ఆమెను గేలిచేస్తూ.

"ఏ కులంలో పుడ్తేఏం ?"... గుణం ప్రధానం. నేను ఆడదాన్నని ఎగతాళి చేస్తున్నారు!... అవకాశం, అదను లభిస్తే తక్కువ కులాలవాళ్ళు ఎక్కువకులాలవాళ్ళతో – ఆడ జాతి మగజాతితో అన్నిరంగాలలోను పోటీ చేయగలరు," అని మొల్ల ఉద్ఘాటించింది.

మొత్తానికి కుమ్మరిదైనా – ఆమె వాక్శుద్ధిని గ్రహించ గలిగాడు రామలింగడు. అందరూ అనుకుంటున్నట్లు యిదొక పిచ్చిదిగాదని – కేవలం శక్తిస్వరూపిణి అని – లేకపోతే యిల్లా తనను ఎదుర్కోడానికి ముందుకు రాదని – ఆయన గ్రహించాడు.

యక్షప్రశ్నల్లాంటివి కొన్ని వేశాడు రామలింగడు. ఆప్రశ్నలన్నిటికి ఆమె సరియయిన సమాధానాలిచ్చింది. ప్రపంచజ్ఞానం ఆమెకు బాగాఉంది అనుకొన్నాడు రామ లింగడు. వేదాంతవిషయాలమీద ఆయన ఆమెను అడిగాడు.

సామాన్యమానవులకు అర్థమయ్యేటట్లు ఆమె జవాబు లిచ్చింది. తర్కశాస్త్రంలోకి దిగారు యిద్దరు. మొల్ల రామలింగనితో దీటుగా నిల్చుంది. ఏకోశానా ఆమె ఆయనకు తీసిపోవటంలేదు. లలితకళలమీద ఆయన ఆమెను ప్రశ్నించాడు. చక్కనిసమాధానా లిచ్చింది ఆమె.

విచార సంతోషాలు యిప్పుడు కేసన ముఖంలో అలముకొన్నాయి. మహాకవితో ఆమె఼ ఢీకొంటున్నందుకు విచారం, ఆయన వివిధప్రశ్నలకు ఆమె సముచితంగా సమాధానాల నిస్తున్నందుకు సంతోషం కేసనకు కలిగాయి. తక్కువ కులాలకు చెందినవాళ్లంతా - ముఖ్యంగా మాల మాదిగలు - ఆవిడ వాగ్ధాటికి విస్తుపోయారు. కులతారతమ్యం లేకండా అక్కడున్న ఆడవాళ్లందరూ - ఆడజాతి మగజాతికి ఏవిషయంలోను తీసిపోదని మొల్ల ఋజువుపరుస్తున్నందుకు హర్షధ్వనులు చేశారు.

మొల్ల దివ్యత్వాన్నిపొందిన స్త్రీ అని - గొప్ప విజ్ఞానవంతురాలని అవగాహన చేసుకొన్న రామలింగడు యిప్పుడు తనకు సరియైన ఉజ్జీదొరికినందుకు లోలోపల సంతోషించాడు. పైకి ఆ సంతోషాన్ని అగుపడనీయకండా - ఆమెలో గర్భీకృతమైయున్న శక్తిని వెలికి తీసుకురావడంకోసం - ఆయన క్షాత్రిన్యాన్ని తన ముఖంలో కనబరిచాడు.

"నేను జగద్విఖ్యాతినందిన తెనాలి రామలింగమహాకవి నన్నవిషయం నీకు తెలుసా?" అడిగాడు రామలింగడు.

"మరి నేను మహాభక్తుడు, పరమజ్ఞానిదైన ఆతుకూరి కేసన కూతురు మొల్ల నన్నసంగతి మీకు తెలుసా?" జవాబిచ్చింది మొల్ల – ఆయనలోని అహంకారానికి సవాలిస్తూ.

"నేను మహాకావ్యాలు వ్రాశాను. లెక్కలేనన్ని రచనలు సాగించాను. మరి నువ్వు యింతవరకు ఒక్క కావ్యమయినా వ్రాయగలిగావా?" అడిగాడు రామలింగడు.

"అవకాశం లేక – అవసరం రాక – యింతవరకు నేనేం వ్రాయలేదు. మీరు కావాలంటే నేను కావ్యరచనను యిప్పుడు సాగిస్తాను," అంది మొల్ల గంభీరంగా.

రామలింగడు ఆలోచనలోకి దిగాడు. "అయితే మన రాజు – రాయలమీద కావ్యం వ్రాస్తావా?" అడిగాడు రామలింగడు.

"రాజు!... ఎవరీరాజులు!... ఈ రాజుల్ని నేను గుర్తించను. రాజులకు రాజు ఒక్కడే ఉన్నాడు నాదృష్టిలో. ఆయన శ్రీరామచంద్రమూర్తి. ఆయన చరితాన్ని మహాకావ్యంగా వ్రాయమంటే వ్రాస్తాను," అంది మొల్ల. అల్లా అంటున్నప్పుడు ఆమెలో భక్తిభావం వెల్లివిరిసింది. దూరంగా ఉన్న శ్రీరామదేవాలయగోపురం ఆమెకు అగపడ్డది. ఆమె కండ్లనుండి హర్షాశ్రువు లొలికాయి.

"అయితే – రామాయణ మహాకావ్యాన్ని వ్రాయడానికి నీకు అయిదేళ్లు గడువిస్తున్నా – చాలా?" ప్రశ్నించాడు రామలింగడు.

"అయిదేళ్లెందుకు? - అయిదురోజులు చాలు!...," అంది మొల్ల - వీరావేశంతో. "అయిదు రోజుల్లో పూర్తి చేయలేకపోతే గండకత్తెర మెడనువేసుకొని ప్రాణం తీసుకోవాలసొస్తుంది - తెలుసా?" అన్నాడు రామలింగడు. అల్లాగేనంది మొల్ల. కేసన భయకంపితుడయ్యాడు. "ఎందుకమ్మా నీకు యిల్లాంటివన్నీ?... వద్దు - తల్లీ వద్దు. కనపడక కనపడక మళ్లీ నా కంటబడ్డావు," అంటూ కంటతడిబెట్టాడు కేసన. సముద్రపు కెరటాలొచ్చి కొడుతూంటే అణుమాత్రం చలించని కొండరాయిలాగా మొల్ల ఉండిపోయింది.

"నీ లాంటి మహాత్ముడు, కవీశ్వరుడు నా తండ్రయితే యీ ప్రపంచంలో నేను సాధించలేని దేముందయ్యా," అంది మొల్ల - తండ్రిపట్ల భక్తి, శ్రద్ధలను అగుపరుస్తూ.

తండ్రియొక్క హితబోధను గూడా లెక్కచేయక ముందరికి లంఘిస్తున్న మొల్లను చూచాడు రామలింగడు.

"ఎక్కడికో వెళ్లి - ఎవరిచేతనో వ్రాయించి తీసుకు రావడం గాదు. రేపు పొద్దుట్నుంచి నువ్వీమంటపంలో కూర్చొని- ఆ మహాకావ్యాన్ని వ్రాయాలసుంటుంది,"అన్నాడు రామలింగడు - అధికారపూర్వకంగా. అల్లాగేనని ఒప్పుకుంది మొల్ల.

ఆచారి, అవధాని, కనకయ్య, తిక్కన ముఖాలలో ఎక్కడా నెత్తురుచుక్క లేదు. మొల్లయొక్క ఆత్మశక్తిని అర్థంచేసుకొన్న సీతమ్మ, రంగనాయకి ముఖాలలో ఆనందం వెల్లివిరిసింది.

కూతుర్ని వెంటబెట్టుకొని — మాల మాదిగలతో — కేసన మాలగూడెంలోని తన గుడిసెకు వెళ్ళిపోయాడు.

ఆ నాటి సాయంత్రం ధ్యానసమాధిలో ఉన్న కేసనకు మొల్ల సాష్టాంగదండప్రణామం చేసింది. "పితృదేవోభవ! నువ్వు నా తండ్రివి. నీ మహిమను గుర్తించకుండా — నీ బోధనలు వినకుండా నే నింతకుపూర్వం ఏమేమిటో చేశాను: ఎక్కెట్లో తిరిగాను. అప్పుడు నాకు జ్ఞానంలేదు. ఇప్పుడు నాలోని జ్ఞాననేత్రం విప్పారింది. అడవిలో ఆ పరమేశ్వరుడే నాకు జ్ఞానభిక్ష పెట్టాడు. నన్ను పెళ్లికూతురుగా చేసి పంపించాడు," అంది మొల్ల. మొల్లమాటలు కేసనకు అర్థం కాలేదు. ఆమె బుగ్గచూచాడు కేసన. కాటుకచుక్కుంది. దేవుడు కాటుకచుక్కను తన కూతురు బుగ్గమీద పెట్టాడంటే ఆయన నమ్మలేకపోయాడు. ఆ విషయం మీాద ఆయన మొల్లను తరిచి, తరిచి ప్రశ్నించాడు. "దేవుడే నా బుగ్గమీాద కాటుకబొట్టు పెట్టి నన్ను పెళ్లికూతుర్ని చేశాడు. నన్ను నిజమైన స్త్రీమూర్తిని కావించాడు. నాకు విజ్ఞానాన్ని ప్రసాదించాడు. సమయమొస్తుందని — ఆ సమయాన నన్ను తనలోకి — గోపవరంలోని అందరి ప్రజల సమక్షాన — తీసుకుంటానని ఆయన చెప్పాడు," అంది మొల్ల. సాధారణ మానవులకు అగపడని ఆ పరమాత్ముడు తన కూతురికి అగపడడమేగాకుండా — ఆమె బుగ్గన కాటుకబొట్టు పెట్టి — ఆమెను పెళ్ళికూతురుచేసి — ఒక సమయంలో వివాహమాడతా ..డన్నందుకు కేసన అమితానందం పొందాడు.

"అయ్యా ! – మరి రేపటి సంగతేమిటి ?... మహా కావ్యాన్ని వ్రాస్తానని రామలింగకవితో సవాలుచేశాను. కవిత్వం ఎల్లావ్రాయాలో – దాని లక్షణాలేమిటో నాకు కూలంకషంగా తెలియవు. నువ్వు కవివి. ఉపాసనాపరుడవు. మరి నాకు కవితాశక్తిని ప్రసాదించవూ ?" అడిగింది మొల్ల. కూతురిమాటలు ఆయన్ను ఆనందపరవశుణ్ణిగా చేశాయి. మహాకావ్యాన్ని వ్రాసేటందుకు యివ్వవలసిన కవితాశక్తి తనలోలేదని ఆయనకు తెలుసు. రామాయణ మహాకావ్యాన్ని వ్రాయడానికి వాల్మీకికి కవితాశక్తి నెవరిచ్చారు ? పోతనకు ఆ కవితాశక్తి ఎల్లాఅబ్బింది ? కాళిదాసుకు అంత పాండిత్యం ఎల్లావచ్చింది ? కవిత్వం వ్రాయడానికి ఉపక్రమింపక ముందు వాళ్లు గొప్పగొప్ప కావ్యాలు, ప్రబంధాలు అల్లాంటి వేమయినా చదివారా ? లేదు. దైవోపాసనాబలంచేతనే వాళ్లు అల్లా వ్రాయగలిగారు. భక్తితన్మయత్వంలో వాళ్లకు ఆగాథలు మనోనేత్రాలముందు తాండవించాయి. తాము ఏంచూస్తున్నారో అదంతా వ్రాశారు వాళ్లు. వీక్షణాశక్తి వారి నంతవారినిగా చేసింది. దైవబలమే వాళ్లచేతుల్లోని గంటాలను శరవేగంతో నడిపింది. ఈ ఆలోచనలన్నీ కేసన మెదడులో దొర్లి – ఆయనకు నూతనోజ్జీవాన్ని యిచ్చాయి.

"అమ్మా!. నేను సామాన్యమానవుణ్ణి!. నువ్వు అనుకున్నంత మహిమ నాలో లేదు. నా కవితాశక్తికి వరి పక్వత అబ్బలేదు. పూర్వం కావ్యాలువ్రాసిన మహానుభావు లందరూ దైవబలంమీదనే ఆధారపడ్డారు. ఆ దైవబలమే

నీకు యిప్పుడు గతి. అంతకంటే ఏంలేదు. నేను నీకు మంత్రోపదేశం చేస్తాను. ఏకాగ్రచిత్తంతో నువ్వు మన యిల వేల్పయిన శ్రీకంఠమల్లేశుని ముందు ఆ మంత్రాన్ని పఠించు. శుచిగా స్నానంచేసి యీ రాత్రంతా ఆయనముందు ప్రాణాచారం పడు. ఆ దైవమే నీకు ఆత్మశక్తి నిస్తాడు. ఆ శక్తితో నీకు అద్భుతకవితాశక్తి అబ్బుతుంది," అంటూ కేసన ఆమెకు మంత్రోపదేశం చేశాడు. ఇంతవరకూ కేసన ఆమెకు తండ్రి. ఇప్పుడాయన ఆమెకు గురువుకూడాను. 'పితృదేవోభవ – గురుదేవోభవ,' అంటూ ఆమె ఆయన చరణాలమీద వాలింది.

ఆ నాటిరాత్రి మొల్ల శుచిగా స్నానంచేసి దీపాన్ని వెలిగించింది. ఆ దీపమే ఆమె నిజనాథుడు. ఆ దీపపు వెలుతురులో ఆమెకు అపారమైన ఆనందం లభించింది. తండ్రి చెప్పిన మంత్రాన్ని పఠిస్తూ – మనస్సు శ్రీకంఠమల్లేశునిమీద కేంద్రీకరించి – ఆమె యోగసమాధిలో ప్రాణాచారం పడ్డది.

మొల్ల విషయంలో రామలింగకవి, రంగనాయకి ఆ రాత్రి ప్రస్తావించుకున్నారు. "ఆమె సాధారణ వ్యక్తిగాదు. ఆమెను చూడడంతోటే నేను ఆ విషయాన్ని కనిపెట్టగలిగాను. రామాయణ మహాకావ్యాన్ని అయిదు రోజుల్లో పూర్తిచేసి– ఆవిడ స్త్రీజాతికి వన్నె తెస్తుంది," అన్నాడు రామలింగడు మందహాసంతో. రంగనాయకి యొక్క ఆనందం యింతా అంతా కాదు. కాని ఆచారి, అవధాని ఆమెను ఏమిహింస పెడతారోనని రంగనాయకి భయపడ్డది. ఎవ్వరూ ఆమెను ఏమీ చెయ్య

లేరని – దైవబలంచేతనే ఆమె యీ పరీక్షలో నెగ్గుతుందని రామలింగడు రంగనాయకికి భయనివృత్తి చేశాడు.

ఇక్కడ అవధాని, ఆచారి సమావేశమయ్యారు. ఇప్పుడు ఏం చెయ్యాలో వాళ్ళకు తోచడం లేదు.

"తెనాలి రామలింగడు బ్రాహ్మణుడు. ఆయన చేతిలో తమరు ఓడిపోయినా ఫరవాలేదు. ఆయనకు మీరు చేయెత్తి దండంబెట్టడంలో తప్పులేదు. కాని యీ కుమ్మరిది మొల్ల – రేపు రామాయణ మహాకావ్యాన్ని అనుకున్నట్లు వ్రాయడమే సంభవిస్తే – మరి మీ గతి, మా గతి ఎల్లా ?... ఈ ఊళ్లో మనం తలెత్తుకొని తిరగ్గలమా ?... మాలమాదిగలతో సహా తక్కువకులాలవాళ్ళు బ్రాహ్మణకులంలో బుట్టిన మనల్ని గేలి చేసి – మన జీవితాలను దుఃఖభాజనం చెయ్యరూ ?... అగ్రహారంలో మొత్తానికి సంక్షోభం కలిగింది. ఈ సంక్షోభాన్ని తొలగించాలంటే నాకు మటుకు నాకు ఒక్కటేదారి కనుపిస్తూంది. వెంటనే మనం హంపీకి వెళ్లి – రాయలవారికీవృత్తాంతం తెలియచేసి – రాజభటుల సహాయంతో యీ సంక్షోభాన్ని ఎదుర్కుందాం. తక్కువకులంలో బుట్టింది – అందులో ఆడది – శైవమతస్థురాలు – రామాయణం వ్రాస్తుందీ అంటే రాయలు ఎంతమాత్రం సహించడు," అన్నాడు అవధాని. ఆచారికిదంతా అయోమయంగా ఉంది. కేసన ఉపాసనాపరుడని – ఆ ఉపాసనాబలంతో ఎల్లాంటి కవిత్వాన్నైనా వ్రాయగలుగుతాడని – ఆ ఉపాసనాబలాన్ని ఆయన తప్పకండా తన కూతురికి యిస్తాడని ఆచారి అభిప్రాయపడ్డాడు. కేసన

యొక్క అండమీదనే - ఆయన బలంమీదనే - యిప్పుడు మొల్ల ఆధారపడ్డది. ఆ కేసనను యీ ప్రపంచంలో లేకుండా చేస్తే....?

—యీధోరణిలో ఆచారి అవధానితో ప్రస్తావించాడు. ఇంతలోకే అక్కడికి కనకయ్య వచ్చాడు. అవధాని కనకయ్య చెవిలో ఏదో ఊదాడు. "అదెంతపని," అంటూ కనకయ్య రొమ్ము విరుచుకుంటూ వెళ్ళిపోయాడు. మొల్ల రామాయణ మహాకావ్యాన్ని వ్రాయకుండా ఎల్లాగైనా చూడాలని కుతంత్రాలు పన్నుతున్న ఆచారికి, అవధానికి సీతమ్మ హితోపదేశం చేసింది. మొల్ల కారణజన్మురాలని - ఆమెను హింసించడానికి పూనుకున్నవాళ్లు తగిన ప్రాయశ్చిత్తాన్ని అనుభవిస్తారని — సీతమ్మ ఆచారికి నొక్కిచెప్పింది. అసలే అవమానంతో కుంగి, కుమిలి, కృశీభూతుడయిన ఆచారి ఆమె మీద మండిపడ్డాడు. 'వినాశకాలే విపరీతబుద్ధిః' అంటూ ఆమె, ఆయన కర్మానికి ఆయన్ను వదిలిపెట్టేసింది. ఆచారి, అవధాని యిప్పుడు జోడెద్దులబండిమీద శరవేగంతో హంపీకి బయలుదేరారు.

ఆరాత్రంతా మొల్ల యోగసమాధిలో ఉండిపోయింది. మాల, మాదిగలంతా ఎప్పుడు తెల్లవారుతుందా - ఎప్పుడు మొల్ల రామాయణాన్ని వ్రాయడానికి కూర్చుంటుందా అని కాచుకుకూచున్నారు. వేకువజామును సూచిస్తూ తిప్పమీద కోడి కూత కూసింది. కేసన లేచి - యోగసమాధిలో ఉన్న

మొల్ల నొక్కమాటు చూసి - గంటాన్ని, తాటాకుల్ని ఆమెదగ్గిరగా బెట్టి - ఏటిస్నానానికి బయలుదేరాడు.

యోగసమాధిలో ఉన్న మొల్లకు ఘంటానినాదం వినపడ్డది. ఆమె లేచి చూచింది. ముందు జంగందేవర నిల్చొనున్నాడు.

"మొల్లా!... నేను శ్రీకంఠమల్లేశ్వుణ్ణి!... నీభక్తికి సంతోషించాను. నీకు వరమిస్తున్నా. అద్భుతమైన కవితాశక్తి నీకు లభ్యమవుతుంది. ఆ శక్తితో నువ్వు రామాయణాన్ని వ్రాసి జగత్ప్రసిద్ధిని పొందు," అన్నాడు ఆజంగందేవర. ఇదంతా కలా ?... ఆవిడ కళ్లు నులుపుకొని చూచింది. ఎవ్వరూ లేరు. ఆవిడలోని జ్ఞానజ్యోతి వెల్లి విరిసింది.

ఈ సంగతి అయ్యకు చెప్పడంకోసం ఆమె 'అయ్యా' అని పిలిచింది. అయ్యలేడు. ఆయన ఏటిస్నానానికి వెళ్లుంటా డను కుంది. మరి తను గ్రామమండపానికి పొద్దున్నే బయలుదేరి పోవడానికి సిద్ధంకావద్దూ ?...

చక్కగా తలంటిపోసుకుంది మొల్ల. ఒకచేతిలో గంటాన్ని, తాటాకుల్ని పట్టుకొని - మరొక చేతిలో దీపపు సెమ్మెను తీసుకుంది. అయ్యరాకకోసం ఆమె నిరీక్షిస్తుంది. తెల్లగా తెల్లవారి పోతూంది. ఇంకా అయ్యరాలేదు. నిర్ణీత కాలానికి ఆమె గ్రామమండపంలో కూర్చొని రామాయణ గ్రంథరచనకు ఉపక్రమించొద్దూ ? అయ్యకు దగ్గ కూతురని పించుకోవద్దూ ?

అయ్య ! ఇంకెక్కడి అయ్య !... ఏట్లో స్నానంచేసి– గూడెంమధ్యనున్న శ్రీకంఠమల్లేశుని విగ్రహంముందు తలవంచి దండంపెడ్తూంటే వెనకనుంచి బలవత్తరమైన దుడ్డుకఱ్ఱ దెబ్బ పడ్డది. ఆ దెబ్బకు తట్టుకోలేక ఆ మహాత్ముడు 'శివశివ' అంటూ కిందబడి ప్రాణాలు విడిచాడు. ఆ అహింసామూర్తిని అల్లాకొట్టిన కిరాతు డెవరు ? ఆ శాంతపురుషుని పొట్టన బెట్టుకొన్న హంతకుడెవరు ?... ఇంకెవరు – రౌడీ కనకయ్య. అవధాని పనుపున అతనల్లాచేశాడు. ఇంతకూ వాడుమటుకు ప్రాణంతో బయటబడ్డాడా ?... ఘాతుకకృత్యంచేసి– యింటికి పరుగెత్తుకుపోతుంటే – కాలికిందబడ్డ నల్లతాచు వాణ్ణి గట్టిగా కాటువేసింది. దాంతో వాడు కిందబడి గిలగిల కొట్టుకు చచ్చాడు.

అయ్యకోసం నిరీక్షిస్తున్న మొల్లకు యీ కఠోరవార్త పోలిగాడు తెలియపరిచాడు. అయ్యలేడు!... కూతురికి మంత్రోపాసనాబలాన్నిచ్చి ఆయన వెళ్లిపోయాడు! ఆయన స్వార్థత్యాగి !... అజ్ఞాతజీవి !... రామాయణ మహాకావ్యాన్ని వ్రాసి – ఆయన ఆత్మకు శాంతి చేకూర్చడమే తన కర్తవ్యమని భావించింది మొల్ల. ఐహికసంబంధమైన మమత, చింత, విచారాలను దిగమింగి – రాగ, ద్వేష, క్రోధాదులను పోగొట్టుకొని–ఆమె గంటం, తాళపత్రాలు,దీపపుసెమ్మె తీసుకొని సకాలానికి గ్రామమండపం జేరుకుంది. ఆమె మన ప్రపంచంలో లేదు. తన శిరోజాలు పూర్తిగా ఆరేలోపల ఆనాడు బాల కాండను పూర్తిచేయాలని ఆమె సంకల్పం.

ఒకచెంప రంగనాయకి, మరోచెంప సీతమ్మ తమ యిష్టదైవాలకు పూజలు సలిపి - ప్రసాదాలతో గ్రామ మండపం జేరుకొన్నారు. తెనాలిరామలింగకవి అప్పుడే వచ్చి-గండకత్తెర నక్కడనుంచి - మండపంలో ఉపవిష్టుడయ్యాడు.

గ్రామంలోని స్త్రీ పురుషులందరూ యీ చరిత్రాత్మక దృశ్యాన్ని తిలకించడానికి మండపందగ్గిర పొద్దున్నే చేరారు. తమగురువు, బంధువు, ఆప్తుడు, మిత్రుడు అయిన కేసనయొక్క ప్రేతానికి అంత్యక్రియలు సలిపి - మాలమాదిగలంతా గ్రామ మండపందగ్గిర కొచ్చేశారు.

కేసన మరణవార్త అందరికీ తెలిసిపోయింది. ఆయన ఆత్మశాంతికి ఎవరిలో వారు మౌనంగా ప్రార్థనలు సలిపారు.

జ్యోతిని వెలిగించి - దాంట్లో తన నిజనాథుడైన కోయకుట్టువాడి స్వరూపాన్ని మొల్ల తిలకించింది. రంగనాయకి, సీతమ్మ పెట్టిన ప్రసాదాలను స్వీకరించి - కళ్లకద్దుకొని - నోట్లో వేసుకుంది. దూరాన అగపడుతున్న శ్రీరామదేవాలయ గోపురాన్ని చూచి భక్తితో నమస్కరించింది. కోదండపాణియైన రామచంద్రుడు ఆమెకు పొడగట్టి "చెప్పుకుపో" అన్నాడు.

గంటం తీసుకొని తాళపత్రాలమీద మొల్ల వ్రాయడం ఆరంభించింది. తన కావ్యానికి శ్రీరాముడు నాయకు డవడం చేత ఆయన్ను గురించి మొల్ల - స్తుతిపూర్వకంగా యిల్లా వ్రాసింది :

శ్రీ మహిమాభిరాముఁడు వ
సిష్ఠమహాముని పూజితుండు సు
త్రామవధూకళాభరణ
రక్షకుఁడాశ్రితపోషకుండు దూ
ర్వామల సన్నిభాంగుఁడు మ
హాగుణశాలి దయాపరుండు శ్రీ
రాముఁడు ప్రోచు భక్తతతి
రంజిలునట్లుగ నెల్లకాలమున్.

తరువాత ఆమె మల్లిఖార్జునుణ్ణి, గోపాలకృష్ణుణ్ణి, విధాతను, వినాయకుణ్ణి, లక్ష్మిని, సరస్వతిని స్తుతించింది. ఇంతకుపూర్వం తమ కవితారచనలతో సంస్కృత, ఆంధ్రభాషామతల్లులకు అఖండనీరాజనాలర్పించిన మహాకవుల స్వరూపాలన్నీ ఆమె కళ్లఎదుట తాండవించాయి.

సీ. సురసన్నుతజ్ఞాను సువివేకి వాల్మీకి
నఖిలవేదాగమాభ్యాసు వ్యాసు
ఘోరాంధకార ప్రభారవి భారవి
సత్కాంతి హిమకరశ్లాఘు మాఘు
వివిధకళాన్విత విఖ్యాతి భవభూతి
బ్రకటకార్యధురీణు భట్టబాణు
ఘానినీలోక సమ్మదముద్రు శివభద్రు
గవితారసోల్లాసు కాళిదాసు
స్తుతగుణోద్దాము నాచనసోము భీము
నవ్యమంజులవాగ్ధుర్యు నన్నపార్యు

రసికుడైనట్టి శ్రీనాథు రంగనాథు
దిక్క కవిరాజును నుతించి ధీనిమించి.

క. తొల్లిటి యిప్పటి సత్కవి
వల్లభులను రసికవినుతవాగ్వైభవకళా
మల్లుల గవితారచనల
బల్లిదులైనట్టి ఘనుల భక్తిగ దలతున్.

తండ్రి కేసన యిప్పుడు ఆమె కళ్ళల్లో మెదిలాడు. ఆయన్ను గూర్చి మొల్ల యిల్లా వ్రాసింది:

క. గురులింగ జంగమార్చన
పరుడును శివభక్తిరతుఁడు బాంధవహితుడున్
గురు డాతుకూరి కేసయ
వరపుత్రిని మొల్ల యనగ వఱలినదానన్.

శ్రీకంఠమల్లేశుడు జంగందేవర రూపంలో వచ్చి – గతరాత్రి తన కిచ్చిన వరాన్ని గూర్చి మొల్ల యిల్లా పేర్కొంది:

సీ. దేశీయపదములు దెనుగులు సాంస్కృతుల్
సంధులు ప్రాజ్ఞుల శబ్దవితతి
శయ్యలు రీతులు జాటు ప్రబంధంబు
లాయా సమాసంబు లర్థములును
భావార్థములు గావ్యపరిపాకములు రస
భావచమత్కృతుల్ పలుకు సరళి
బహువర్ణములును విభక్తులు ధాతు ల
లంకృతి చ్ఛందోవిలక్షణములు

గావ్యసంపదక్రియలు నిఘంటువులును
గ్రమములేవియు నెరుగ – విఖ్యాత గోప
వరపు శ్రీకంఠమల్లేశు వరముచేత
నెఱి గవిత్వంబు చెప్పగా నేర్చికొంటి.

క. చెప్పుమని రామచంద్రుడు
సెప్పించిన పలుకుమీాద జెప్పెద నే నె
ల్లప్పుడు నిహపరసాధన
మిప్పుణ్యచరిత్ర తప్పులెంచకుడు కవుల్.

తన మహాకావ్యం సామాన్యజనానికి గూడా అర్థంకావాలనే అభిలాషతో ఆమె యిల్లా వ్రాసింది :

ఆ. తేనెసోక నోరు తీయన యగురీతి
తోడ నర్థమెల్ల దోచకుండ
గూఢశబ్దములను గూర్చిన కావ్యమ్ము
మూగ చెవిటివారి ముచ్చటగును.

క. ఆది రఘురాము చరితము
నాదరముగ విన్న శ్రోత్రమై లక్షణసం
పాద్యమ్మై పుణ్యస్థితి
వేద్యమ్మై తోచకున్న వెఱ్ఱినె చెప్పన్.

ఉ. రాజితకీర్తిమైన రఘురామ చరిత్రము మున్ గవీశ్వరుల్
తేజమెలర్ప జెప్పిరని తెల్సియు గ్రమ్మఱ జెప్పనేల నన్
భూజనకల్పకంబగుచు భుక్తికి, ముక్తికి మూలమైన యా
రాజును దైవమైన రఘురాము నుతించిన దప్పుగల్గునే.

క. వారాంగన శ్రీరాముని
పేరిడి రాచిలుక బెంచి పెంపువహించెన్
నేరుపుగల చందంబున
నా రాముని వినుతిసేయ హర్షము రాదే.

క. నేరిచి పొగడిన వారిని
నేరక కొనియాడువారి నిజకృప మనుపం
గారణమగుటకు భక్తియె
కారణమగుగాని చదువు కారణమగునే.

ఉ. సల్లలితప్రతాపగుణసాగరుడై విలసిల్లి ధాత్రిపై
బల్లిదుడైన రామనరపాలకు నిన్ స్తుతిచేయు జిహ్వకున్
చిల్లర రాజలోకమును చేకొని మెచ్చగ నిచ్చపుట్టునే
అల్లము బెల్లముం దినుచు నప్పటి కప్పటి కాససేయునే.

— ఈ విధంగా యిష్టదేవతాప్రార్థన, కవీంద్రస్తుతి చేసి మొల్ల రామాయణ మహాకావ్యంలోని బాలకాండ వ్రాయడం ప్రారంభించింది.

బాలకాండలోని ఘట్టాలన్నీ ఆమె మనోనేత్రాలకు అగపడ్డాయి. గంటం శరవేగంతో ముందుకు నడిచింది. తన తలవెంట్రుకల తడి పూర్తిగా ఆరేలోపల ఆమె బాలకాండను పూర్తిచేసి - గద్యను వ్రాసింది.

మొల్ల వ్రాసేస్తున్న తాళపత్రాలను విమర్శనాదృష్టితో చూస్తున్న తెనాలి రామలింగకవి ఆమె కవితాశక్తికి విస్తుపోయాడు.

మరునాడు మొల్ల మళ్ళీ తలంటిపోసికొని - మండపంలో కూర్చొని - సెంత్రికలు ఆ రేలోపల అయోధ్యకాండను పూర్తి చేసింది.

ఆ మరునాడు ఆమె అరణ్యకాండను పూర్తిచేసింది. అక్కడ చేరిన జనులంతా ఆమె కారణజన్మురాలని - ఆమెను దర్శించడంవల్ల తాము పునీభూతుల మవుతున్నామని భావించారు.

మొల్ల యిక్కడ తన ఆత్మశక్తిని ఉద్దీపింపజేసి - దైవబలసహాయంతో మహాకావ్యరచనను సాగిస్తూంటే హంపిలో ఆచారి, అవధాని వైష్ణవగురువు తాతాచారిని కలుసుకొని - ఆయనవెంట - రాయల కొలువుకూటానికి వచ్చారు.

"కుల, మత ధర్మాలకు యిప్పుడు భంగం వాటిల్లింది. గోపవరఅగ్రహారంలో విచ్ఛిన్నకరశక్తులు తలెత్తి ప్రాచీన సాంప్రదాయాలను వమ్ముచేస్తున్నాయి. తమరు లేనప్పుడు - ఒక మాటొచ్చి - రాజభటుల్ని సహాయం తీసుకుని - ఆ విచ్ఛిన్నకరశక్తులను అణచివేశాం. మళ్ళా యిప్పుడవి తలెత్తాయి. కుమ్మరికులంలో బుట్టిన వ్యక్తి - అందులో ఆడది - పవిత్రమైన రామాయణ మహాకావ్యాన్ని తెలుగులో వ్రాయడానికి పూనుకుంది. ఆడది, అందులో కుమ్మరిది - కవిత్వం వ్రాస్తే యింకేమైనా ఉందా ? ఇదంతా బసవేశ్వరోద్యమప్రభావం. అరిష్టాలను తీసుకొచ్చే యీకార్యక్రమాన్ని మనం అరికట్టకపోతే దేశంలో దుర్భిక్షం ప్రబలుతుంది.

సకాలానికి వానలు కురవకండాపోతాయి. దేశమంతా సంక్షోభం బయలుదేరి అరాజకం ప్రాప్తిస్తుంది. కాబట్టి దేవర వారు తమభటుల్ని పంపి - ఆ కుమ్మరిది కవిత్వం వ్రాయకండా ఉండేటట్లు చెయ్యాలి. దాన్ని వెనకాలేసుకొచ్చే పామర జనానికి తగిన బుద్ధిచెప్పి - గోపవరంలో శాంతి భద్రతలను కాపాడాలి," అంటూ అవధాని ఆచారిసహిత ప్రభువుకు నివేదించాడు. సనాతనవాది అయిన తాతాచారికూడా యిందుకు పక్కతాళం వేశాడు.

మాటలసందర్భంలో - తెనాలిరామలింగ మహాకవి కూడా అక్కడే ఉన్నాడని - ఆయనకూడా ఆ కుమ్మరిదాని చేతుల్లో ఓడిపోయాడని - అవధాని ప్రభువుకు చెప్పాడు. రాయలు గంభీరమైన మౌనముద్రను దాల్చి - ఆంధ్రకవితా పితామహుడు అల్లసాని పెద్దనవైపు చూచాడు. "మొత్తానికి రామలింగకవి అక్కడేదో చరిత్రను సృష్టిస్తున్నాడు," అన్నాడు పెద్దన. రాయలు చిరునవ్వు నవ్వాడు.

రాయల మౌనముద్రను, పెద్దన మాటను ఆచారి, అవధానులు సరిగ్గా అర్థంచేసుకోలేకపోయారు. రాయలు తమను సమర్థిస్తాడనే నిశ్చితాభిప్రాయంలో ఉన్నారు వాళ్లు.

"మహాప్రభూ! మీరు యీ ఉదంతాన్ని చులకనగా తీసుకోడానికి వీల్లేదు. నవ్వుల కిది సమయంకాదు. గోప వరంలో కొంప లంటుకుపోతున్నాయి. ఆ దావానలం మీ సామ్రాజ్యమంతా పాకిపోయి కల్లోలం తీసుకొస్తుంది. వెంటనే తమభటుల్ని పంపించి ఆ కుమ్మరిది నిప్పులో చెర్లాటలాడ

కండా చూడండి. అది వ్రాసేగ్రంథాన్ని మహాసముద్రంలో పడేయించండి," అంటూ అవధాని ప్రభువుకు మొఱబెట్టాడు.

"భటు లక్కర్లేదు - ఏమక్కర్లేదు. నేనే స్వయంగా అక్కడకొస్తున్నా. పెద్దనామాత్యుడు కూడా నాతో వస్తాడు," అన్నాడు రాయలు.

ఏనుగునెక్కి రాయలు గోపవరానికి బయలుదేరాడు. పెద్దన, ఆచారి, అవధాని తమతమ వాహనాలమీాద గోప వరానికి పయనంసాగించారు.

గోపవరంలో మొల్ల రోజుకొక కాండ చొప్పున కిష్కింధ, సుందరాకాండలను పూర్తిచేసింది.

ఆనాడు అయిదవరోజు. ఆమె యుద్ధకాండ నెత్తుకుంది. యుద్ధకాండలోని ప్రథమ, ద్వితీయాశ్వాసాలు అయి పోయాయి.

ఇంతలోకే రాయలు, ఆచారి, అవధాని, పెద్దన గోపవరం చేరుకొన్నారు. యోగసమాధిలో ఉన్న మొల్ల - ప్రభువు వచ్చిందికూడా తెలియకండా యుద్ధకాండలోని తృతీయాశ్వాసాన్ని ముగించింది.

"ప్రభు వొచ్చారు. లేచి దండంబెట్టు," అంటూ అవధాని మొల్లను గద్దించాడు. ఆమెప్రపంచంలో ఆమెఉంది. ఎవరి మాటలూ ఆమెకు వినపడడం లేదు. ఎవరిరూపాలు ఆవిడకు కనపడడంలేదు. ప్రభువులకు ప్రభువు శ్రీరామ చంద్రుడే యిప్పుడావిడ దృష్టిపథంలో ఉన్నాడు.

రామాయణ మహాకావ్యరచనను ఆమె సాంతం ముగించింది. రాయలు, పెద్దన ఆమె మూర్తిని తదేకధ్యానంతో చూశారు. ఆ మూర్తి వారికి సంభ్రమాశ్చర్యాలను గొలుపుతూంది. తెనాలి రామలింగకవి లేచి రాయలవారిని చూచి చిరునవ్వు నవ్వాడు. ఆమెశక్తిని యిప్పటికైనా తెలుసుకోలేకపోయిన ఆచారికి, అవధానికి మొల్ల వర్తనపట్ల మహాకోపం వచ్చింది. అవమానంతో వాళ్ళిప్పుడు కుమిలిపోయారు.

"ప్రభువాస్తే లేవనన్నా లేవవ్?..." అంటూ అవధాని— ఆగ్రహ ప్రోద్బలంతో – ఆమె చేతిలోని గంటాన్ని, తాళపత్రాలను లాక్కోబోయాడు.

అపవిత్రమైన ఆయన చేతుల స్పర్శతో ఆ తాటాకుల నుండి మిరుమిట్లు గొలిపే జ్వాలలు వెలువడ్డాయి. ఆ జ్వాలలు ఆచారిని, అవధానిని అంధులుగా చేశాయి. మొల్లకు జరుగుతున్న అపచారానికి – మొల్లకు కాదు, రామాయణ మహాకావ్యానికే జరుగుతున్న అపచారానికి – ప్రకృతి కంపించిపోయింది.

రాయలు కిక్కురుమనకండా అల్లా నిల్చుండిపోయాడు. ఆచారి, అవధాని ఆడిన నాటకం ముగింపుకొచ్చిందని ఆయనకు తెలుసు.

కళ్ళుపోయిన ఆచారికి, అవధానికి దారి, తెన్ను కానరాలేదు. వాళ్ళ దేహాలు కనపడని శూలపుపోట్లకు గురి అయ్యాయి. వాళ్ళు ఆ బాధకు ఆగలేక గిజగిజకొట్టుకున్నారు.

తను మహాపచారం చేశాడన్న విషయాన్ని గ్రహించ డానికి ఆచారికి ఎంతోసేపు పట్టలేదు. కాని అప్పటికి ఆయనలోని అహంకారం, కులాభిమానం చచ్చిందిగాదు. రాయలు శక్తిసంపన్నుడని, మహిమాన్వితుడని - యీ విపద్దశనుంచి ఆయనే తప్పించగలుగుతాడని - ఆచారి ఆయన పాదాలమీద వాలాడు, "మహాప్రభూ - రక్షించు," అంటూ.

మొల్ల కాళ్లమీద బడకండా తన పాదాలు బట్టుకున్న ఆచారిమీద రాయలు ఉగ్రుడయ్యాడు. "ఎవరు నిన్ను రక్షించేది? ఎవరికి నువ్వు అపచారం చేశావో - వాళ్లని క్షమాభిక్ష," అన్నాడు రాయలు.

ఆచారిలోని అహంకారం, కులాభిమానం యిప్పుడు దాదాపు నశించాయి. కాని ఆవిడ కాళ్లమీద బడటానికి ఆయన మనస్సు ఒప్పుకోలేదు.

"నిన్ను నేను సామాన్య మానవురాల వనుకొని - నీకు చెప్పరాని ద్రోహం చేశాను. క్షమించు తల్లీ. నాకు దృష్టిని ప్రసాదించి - నా బాధ తీర్చు," అన్నాడు - ఆచారి. ఆమెకు చేయెత్తి దండంపెడుతూ.

"నేను సామాన్యజీవిని. మీకు తిరిగి దృష్టి నిచ్చే టంత శక్తి నాకు లేదు. మీ భార్య మహాపతివ్రత. ఆమెను క్షమాభిక్ష అడగండి. తప్పకండా ఆవిడ మీకు దృష్టి నివ్వ గలుగుతుంది," అంది మొల్ల. ఆమె కళ్లల్లో అహింసాభావం ఉట్టిపడుతూంది.

భర్తస్థితిచూచి సీతమ్మ ఎంతో దుఃఖించింది. ఆచారి ఆవిడను సమీపించి – క్షమాభిక్ష నడిగి – తనకు దృష్టిని ప్రసాదించమన్నాడు.

"మిమ్మల్ని ఎన్నోసార్లు తూలనాడి – మీ మనస్సుకు నొప్పి కలిగించాను. నేను సరియైన పతివ్రతను కాను. మీకు దృష్టిని ప్రసాదించే శక్తి నాలో లేదు. భోగం కులంలో పుట్టినా సాక్షాత్తు ఆ పరమేశ్వరునికే తన జీవితాన్నంకితం చేసిన మహాపతివ్రత రంగనాయకి నడగండి. శక్తివంతురాలైన ఆవిడ మీకు తప్పకండా దృష్టి నివ్వగలుగుతుంది," అంది సీతమ్మ – శోకిస్తూ.

దీనాతిదీనావస్థలోనున్న ఆచారి దేవదాసి రంగనాయకి శరణు వేడాడు. "నువ్వు భోగందానివనుకున్నాను. తుచ్ఛమైన కామోద్రేకానికి లొంగిపోయి – నీ జీవితాన్ని గూడా నరక కూపంలోకి లాగడానికి సిద్ధపడ్డాను. నేను మహాపాపిని – నన్ను క్షమించి నాకు దృష్టినివ్వు," అని వేడుకున్నాడు ఆచారి.

మహాపండితుడయిన ఆచారి దీనావస్థను చూస్తే రంగ నాయకికి ఎంతో జాలివేసింది. "నా దగ్గరేదో శక్తి ఉందని ఉదారస్వభావంతో మీ భార్య చెబుతూంది. నా భక్తి గూడా పరిపక్వదశకు రాలేదు. నేను రాతివిగ్రహానికే నా జీవితాన్ని సమర్పణ చేశాను. ఆ పరమాత్ముణ్ణి నేను చూడలేకపోయాను. సర్వాంతర్యామిని కళ్ళారా చూచి – ఆయనచేత పెళ్ళి కూతురుగా అలంకరింపబడి – బుగ్గన కాటుకబొట్టు పెట్టించుకు

కాని - యీ నాడు రామాయణ మహాకావ్యాన్ని వ్రాసిన కారణజన్మురాలు మొల్ల కంటే యిక్కడ శక్తిసంపన్నులెవ్వరూ లేరు. దయచేసి ఆమెకే సాష్టాంగపడండి. ఆమె తప్ప మీకు కళ్ళు యిచ్చేవాళ్ళు యింకెవరూ లేరు," అంది రంగనాయకి.

ఆచారిలో అహంకారం, కులాభిమానం యిప్పుడు సంపూర్ణంగా నశించాయి. ఆయన మొల్ల ముందు సాష్టాంగపడ్డాడు.

"ఓ మహాశక్తీ - నీ ప్రతిభ యిప్పుడు కనుక్కున్నాను. నువ్వు అబలవని - ఉత్త ఎముకలపోగువని తలిచాను. అహింసామూర్తి, మహాకవి అయిన మీ తండ్రిని క్షోభ పెట్టి - ఆయన ప్రాణాలు నిలువునా తీయించాను. తుచ్ఛుడైన అవధాని మాటలు విని నా జీవితాన్ని వక్రపుమార్గాలలో పోనిచ్చాను. నేను మహాపాపిని. క్షమించు. నువ్వు క్షమించి - నాకు దృష్టినివ్వకపోతే - యింకా నేను బతికెందుకు ?. ఇక్కడే నా ప్రాణాలు వదులుకుంటాను," అంటూ ఆచారి లేచి తన మెడకు గండకత్తెర తగిలించుకోపోయాడు. మొల్ల ఆయన్ని వారించింది.

"అల్లాంటి పని చెయ్యకండి. ఒకవిధంగా చూస్తే మీరే నాకు ముక్తిమార్గాన్ని చూపెట్టారని నేను చెప్పక తప్పదు. విశ్వామిత్రుడు లేకపోతే హరిశ్చంద్రు డెల్లా పైకొచ్చే వాడు ?... రావణుడు లేకపోతే శ్రీరాముని మహిమ ప్రపంచానికెల్లా తెలిసుండేది ?...," అంటూ ఆవిడ జ్యోతిని

చూచి - ధ్యానించి - ఆచారికి దృష్టి ప్రసాదించమని ప్రార్థించింది. ఆమె మాటలు వింటూంటే అందరికీ అహింసా మూర్తి కేసన స్ఫురణకు వచ్చాడు. ఇప్పుడామె తండ్రికి దగ్గ కూతు రయిందని అందరూ అనుకున్నారు.

మొల్ల ప్రార్థనాఫలితంగా ఆచారికి కళ్లొచ్చాయి. పశ్చాత్తాపంతో ఆయన పవిత్రుడయ్యాడు. తుచ్ఛుడయిన అవధానిగూడా - ఆచారి ఆజ్ఞ ననుసరించి - మొల్లకు సాగిల బడి - దృష్టిని సంపాదించుకొని - తిరిగి మన ప్రపంచంలో పడ్డాడు.

ఈ చారిత్రక సంఘటన చూస్తున్న రాయల ఆనందం యింతాఅంతా గాదు. ఒక మహానాటకం లక్ష్య, లక్షణ సమన్వితంగా తనముందు ఆడబడ్డట్టు యిప్పు డాయన తెలుసు కున్నాడు.

వెట్టివాడు తిక్కన మొల్ల ప్రభావాన్నిప్పుడు గ్రహింప గలిగాడు. ఆమె ఆనాడు పెట్టిన వాత ఒక పెద్ద వ్రణమయి వాడి నింకా బాధపెడుతూంది. "ఓ మహాశక్తీ! నువ్వానాడు పెట్టినవాత యింకా నన్ను బాధిస్తునేఉంది. నాకుకూడా క్షమా భిక్ష పెట్టవ్ ?" అంటూ తిక్కన మొల్లకు ప్రణామం చేశాడు. ఆమెజ్యోతివైపు తిరిగి నమస్కారం చేసింది. చూస్తూండగానే వాడి శరీరంమీది వ్రణం ఐపు, ఆనవాలు లేకండాపోయింది.

మొల్లవ్రాసిన రామాయణ మహాకావ్యాన్ని రామ లింగకవి స్తుతించి - చూడమని పెద్దన కిచ్చాడు. పెద్దన దాన్ని తిరగేసి మొల్లయొక్క అద్భుత కవితాశక్తికి ఆశ్చర్య

పోయాడు. రాయలు ఆ మహాకావ్యాన్ని తీసుకొని భక్తి పూర్వకంగా కళ్లకద్దుకున్నాడు.

తిక్కన మొల్ల ముందుకొచ్చి, "నువ్వానాడు దేవుణ్ణే పెళ్లాడతానన్నావు. ఇందాక రంగనాయకి నీ బుగ్గమీద బొట్టునుగురించి చెప్పింది. జరిగిన విషయమేమిటో నాకు వాళ్ళకు చెప్పవూ? మేమంతా విని ఆనందిస్తాం," అంటూ అమాయికంగా అడిగాడు.

కావ్యరచన పూర్తి అయ్యాక మొల్ల తిరిగి ధ్యాన సమాధిలోకి ప్రవేశించింది. "అవును దేవుణ్ణే పెళ్లాడబోతున్నా. నా దేవుడు శ్రీరామదేవాలయంలోని గర్భగుడిలో జ్యోతి రూపంలో వెలుగుతున్నాడు. అదుగో - ఆయన నన్ను రమ్మంటున్నాడు. ఆయనలో నేను ఐక్యంకాకముందు యీ మహాకావ్యాన్ని శ్రీరామదేవునికి అంకితం చేస్తాను. మా అయ్య కేసన తన శతకాన్ని శ్రీరామునికి అంకితం యివ్వాలని ఎంతో కుతూహలపడ్డాడు. ఆయన అల్లాచేయలేకపోయాడు," అంది మొల్ల - పూర్వపు సంఘటనను స్ఫురణకు తెచ్చుకొని.

దేవదాసి రంగనాయకి మొల్ల మనస్సును తెలిసికొంది. ముందుకొచ్చి ఆవిడ - దేవాలయంలో ఆనాడు - కేసన శతకం అగ్నికి ఆహుతైపోయాక - మిగిలిన బూడిదలోనుంచి తీసి తనుదాచిఉంచిన ఒకతాళపత్రాన్ని - యిప్పుడు మొల్లకు యిచ్చింది. తండ్రి వ్రాసిన గ్రంథంలోని ఒక్కఆకైనా యిప్పుడు తనకు లభించినందుకు మొల్ల ఎంతో సంతోషపడ్డది. తన

మహాకావ్యాన్ని, యీ తాళపత్రాన్ని శ్రీరామదేవుడికి సమర్పించాలని ఆమె తుదికోరిక.

ఆచారి ఆమె కోరికను కనిపెట్టాడు. వెంటనే ఆయన శ్రీరామదేవాలయ అలంకరణకు ఆనతి యిచ్చాడు. అవధాని, శరభరాజు, బొజ్జయ్యచెట్టి, సుబ్బారెడ్డి, తిక్కన మొదలయిన వాళ్లు అత్యుత్సాహంతో వెళ్లి శ్రీరామదేవాలయం అలంకృతంచేశారు.

రాయలకు, రామలింగనికి, పెద్దనకు, మొల్లకు భక్తిపూర్వకంగా దండంబెట్టి ఆచారి అచ్చటి జనాన్ని చూచి యిల్లాచెప్పాడు :

"ఈ రోజు శ్రీరామనవమి. మనమంతా దేవాలయానికి వెళ్ళే ముందు – దేవరవారి అనుజ్ఞతో – ఒక ప్రకటన చేయ దలచుకున్నా. పోయిన శ్రీరామనవమినాడు అహంకారంతో నేను శ్రీరామదేవుణ్ణి విస్మరించి – మహాపచారంచేశాను. ఆ నాడు ఉత్సవంలో పాల్గొన్న మాల, మాదిగలకు 'తప్పెట' ఖర్చులు యివ్వకండా – వారినందరిని తూలనాడాను. వారికి– కూలిగింజలు యివ్వకండా – మలమలమాడ్చాను. వారి యిళ్ళు తగలబెట్టించి వాళ్ళకు గొప్పద్రోహంచేశాను. శ్రమజీవులయిన వీళ్ళను భుక్తికి, ముక్తికి దూరంచేశాను. నేనుచేసిన మహాపాపానికి ప్రాయశ్చిత్తంగా అగ్రహారంలోని నా భూములన్నిటినీ – సర్వహక్కులతో వారికి యిచ్చేస్తున్నాను. నేను వాళ్ళల్లో ఒకడనై – కృషిచేసి నా భుక్తి నేను సంపాదించుకుంటాను. ఇక ముక్తికి సంబంధించిన విషయంమీద ప్రస్తా

విస్తాను. వారూ మన తోటివారనవ్వులు. దేవాలయంలో ప్రవేశించడానికి మనకెంతహక్కుందో వారికీ అంతే హక్కుంది. దేవుని దృష్టిలో అందరూ సమానులే అన్న సత్యం యిప్పుడు నాకుబోధపడ్డది. అందుచేత శ్రీరామ దేవాలయంలోకి అందరు కులస్థులతోపాటు వారినిగూడా నేను హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాను. మరొక విషయం. శివుడు, కేశవుడు ఒక్కడేనని నా భావన. శైవులకు, వైష్ణవులకు ఎల్లాంటి తారతమ్యాలుండగూడదని నా కోరిక. ఇక యీ గ్రామపంచాయతీ విషయాన్ని గూర్చి నాలుగుముక్కలు చెప్తాను. రాయలవారు నాకిచ్చిన సర్వహక్కుల్ని పురస్కరించుకొని — యీ అగ్రహారానికి నేను ఏకచ్ఛత్రాధిపత్యం వెలగబెట్టాను. చాతుర్వర్ణాల లోని పెద్దలను నేనే ఎన్నుకున్నాను. ఇది సరియైన పద్ధతి గాదని నే నిప్పుడు తెలుసుకున్నాను. ఇకముందు కులవివక్ష ఏం లేకుండా, యుక్తవయసొచ్చిన పురుషులతో సహా స్త్రీలు గూడా గోపవర పంచాయతీకి అయిదుగురు ప్రతినిధుల్ని ఎన్నుకోవాలని నా కోరిక. ఇల్లా జరిగితే నిజమైన ప్రజాపాలనకి ప్రాముఖ్యత అందుతుంది. మరొక మాట. కవిత్వం బ్రాహ్మణుల సొత్తుగాదు. కవితాప్రపంచంలో ప్రవేశించడానికి అందరికీ హక్కుంది. పురుషులతోపాటు స్త్రీలుగూడా అన్నిరంగాలలో ప్రవేశించి ముందుకు రావాలి. వారి ఉన్నతిమీదనే దేశం యొక్క భావిభాగ్యోదయం ఆధారపడ్డది. ఈ గ్రామంలో తక్కువ కులాలవాళ్ళకు — ముఖ్యంగా స్త్రీలకు — పాఠశాల పెట్టి — అందులో వారికి నేనే స్వయంగా అన్నివిద్యలతో

పాటు కవిత్వంగూడా నేర్పుతాను. దేవరవారు అంగీకరిస్తే యీ సంస్కారణలను గోపవరంలో తక్షణమే అమలుజరుప తలుచుకున్నాను," అన్నాడు రామాచారి.

రామాచారి ప్రకటనకు రాయలు తన ఆమోద ముద్రనుయిచ్చాడు. ప్రతిగ్రామం గోపవరాన్ని అనుసరించాలని ఆయన ఆశించాడు. అక్కడ చేరినవారందరూ - మాల మాదిగలతో సహా - ఆచారి, రాయల ఔదార్యతకు హర్ష ధ్వానాలు సలిపారు. రాయలరాజ్యం రామరాజ్యమని నినాదాలు చేశారు. మొల్ల యిప్పుడు ఎంతోఆనందించింది. భుక్తికి, ముక్తికి యీప్రపంచంలో ఎవ్వరూ దూరం కాగూడదని మొదటినుంచీ ఆవిడ వాదన. ఇప్పుడావాదన ఒప్పుకోబడ్డందుకు - క్రియారూపకంగా అనువదింపబడుతున్నందుకు - ఆవిడ ఆనందించకుండా ఎల్లాఉంటుంది ?

తెలుగుగడ్డమీద - గంటం బట్టుకొని - తాళపత్రాల మీద మహాకావ్యాన్ని వ్రాసిన ప్రథమ విదుషీమణి మొల్ల అని రాయలు వేదికనెక్కి ప్రకటించాడు. అక్కడున్న జన సమూహం - ఆచారితో సహా - చప్పట్లు చరిచింది. "స్త్రీ లోకానికి - తక్కువకులాలవాళ్లకు ఆవిడ ధ్రువతార. ఆవిడ శాశ్వతకీర్తిని పొందింది. పల్లెపల్లెల్లోను, వాడవాడల్లోను, ఆవిడ రామాయణాన్ని అందరూ పారాయణచేస్తారు. భావిచరిత్రకారులు ఆవిడపేరును కవితాప్రపంచంలో సువర్ణాక్షరాలలో చెక్కుతారు," అన్నాడు రాయలు.

దేవాలయంలోకి మొల్లను తీసుకుపోవడానికి సర్వ సన్నాహాలు జరిగాయి. ఊళ్లోని అందరుమేళగాళ్లు అక్కడ చేరారు. మొల్లను రామాయణ మహాకావ్యంతో - తన- ఏనుగునెక్కమన్నాడు రాయలు. "శ్రీరామచంద్రుడే దాన్ని ఎక్కడానికి అర్హుడు. నేను మానవమాత్రురాలను. నాకిల్లాంటి గౌరవం వద్దు," అంటూ ఆవిడ సవినయంగా జవాబిచ్చింది.

శ్రీరామదేవుని పటం ఏనుగుమీద పెట్టబడ్డది. దేవాలయానికి బ్రహ్మాండమైన ఉత్సవం బయలుదేరింది. రాయలు, మొల్ల, పెద్దన, ఆచారి, తెనాలిరామలింగకవి పాదచారులై ఆ ఉత్సవంతో నడిచారు. మాలమాదిగలు ఉత్సాహంతో తప్పెట్లు వాయిస్తూ - వీరాంగం వేశారు. సీతమ్మ, రంగనాయకి తక్కిన స్త్రీలతోపాటు ఉత్సవంలో పాల్గొన్నారు.

ఉత్సవం దేవాలయ ముఖద్వారం చేరింది. అవధాని, శరభరాజు, బొజ్జయ్యచెట్టి, సుబ్బారెడ్డి, తిక్కన మొదలయిన వాళ్లు దేవాలయం ముందు నిలిచి - అందరిని భక్తిపూర్వకంగా లోపలికి ఆహ్వానించారు. కులవిచక్షణ లేకండా - మాలమాదిగలతో సహా- అందరూ దేవాలయంలోకి వెళ్లారు.

శ్రీరామదేవుని సమక్షంలో తను వ్రాసిన మహాకావ్యాన్ని, తనతండ్రి కేసన రచించిన శతకంలోని ఒక తాళపత్రాన్ని పెట్టి- వాటిమీద మొల్ల పుష్పాక్షతలు చల్లింది. తనకు తండ్రే కాకండా గురువుకూడా అయిన కేసనను ఒక్క

పాటు తలుచుకుంది. చరిత్రాత్మకమయిన యీ సమయ
ఆ మహామహులుంటే ఎంత సంతోషించేవారు.

గర్భగుడిలో - దేవుని సమక్షంలో - వెలుగొందుతో
అఖండజ్యోతిమీద మొల్ల తనదృష్టిని కేంద్రీకరించి
కోయకుట్టవాడు దాంట్లో ఆమెకు అగుపడుతున్నాడు.

"ఇడుగో నా నిజనాథుడు!... నన్ను పెళ్ళికూతు
చేసిన మహాపురుషుడు!... చేతులు సాచి నన్ను ఆ
ఆహ్వానిస్తున్నాడు. తనతో నన్ను శాశ్వతంగా ఐక్యం చేసును
సంటున్నాడు. స్వామీ వస్తున్నా!" అంటూ మొల్ల
మూసి - ధ్యాననిష్ఠలో ఉండిపోయింది.

మొల్ల జీవితానికి యివి ఆఖరిఘడియలని తె
తుంది రంగనాయకి. వెంటనే జ్యోతిని పట్టుకొని -
పరవశురాలై ఆవిడ నృత్యం చేసింది. ఆ నృత్యం హె
స్థాయిలో నడుస్తూంటే - మొల్ల శరీరంలోని ప్రాణం
జ్యోతిరూపంలో పైకి లేచింది.

మెల్లగా చిన్న జ్యోతి వెళ్ళి దేవునిసమక్షంలోని అ
జ్యోతిలో మిళితమైపోయింది. అందరూ ఆ అద్భుతదృశ్యా
తిలకించి - భక్తిపారవశ్యంతో - అఖండజ్యోతికి ప్ర
లర్పించారు.

"అసతోమా సద్గమయ - తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ

ఆవిరావీర్మ ఏధి - రుద్ర యత్తే దక్షిణముఖం
తేన మాం పాహి నిత్యమ్

ఓంశాంతి - శ్శాంతి-శ్శాంతిః" అంటూ ఆ వారి ఆమెకు శ్రద్ధాంజలి నర్పించాడు.

గోపవరంలోని తిప్పమీద - వేనవజామును సూచిస్తూ కోడి 'కొక్కొరొక్కో' అని కూసింది. రామాయణ మహాకావ్యాన్ని వ్రాసి - పరమేశ్వరునిలో లీనం చెంది - అజరామరమైన కీర్తిని సంపాదించిన మొల్ల అడుగుజాడల్లో నడవమని మహిళాలోకానికి యిచ్చిన పిలుపా ఆ కోడి కూత ?...

---

తెనాలి: భారతీప్రెస్‌నందు ముద్రితము — 1954.